డిసెంబరు 2005

335 వ సంచిక

# చతుర

వెల: రూ. 7/-



విహ్వాల వెనుక కథ విప్పిన గుంటూరు శేషేంద్ర శర్మ

మంజరి నవల

కనిపించని సూర్యుడు

## కను'విందు'

నింగిలో ఎవరో బోర్లించిన పెద్ద గిన్నె నుంచి
జారిపడుతున్న వెన్నముద్దల్ని అందుకోవటానికి
ఆత్రంగా పరిగెడుతున్నట్లున్నాయి కదూ
ఈ గజరాజులు....

నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 28 | సంచిక : 11
డిసెంబరు : 2005 | 335వ సంచిక

ఈ నెల నవల

అడవితల్లి ముద్దుబిడ్డల జీవన చిత్రాన్ని అద్భుతంగా అక్షరీకరించిన

## కనిపించని సూర్యుడు

మంజరి

10

## ఇతర శీర్షికలు



రెండు, మూడవ కవర్లలోని ఫొటోలు నేచరల్ హిస్టరీ మ్యూజియం, బిబిసి వైల్డ్‌లైఫ్ మేగజైన్ సంయుక్తంగా నిర్వహించిన వన్యప్రాణుల ఫొటోల పోటీలలో బహుమతి పొందినవి. గజరాజుల ఫొటో ప్రకృతి దృశ్యాల నలుపు తెలుపు ఫొటోల విభాగంలో, చేప ఫొటో జంతువుల కలర్ పోర్ట్రయిట్ విభాగంలో ప్రథమ బహుమతులను గెలుచుకున్నాయి.

ఇంకా హెల్త్ బిట్స్, ఫొటో వ్యాఖ్యలు

బొమ్మలు: పినిశెట్టి

## రచయితలకు ప్రత్యేకం
## కథలు-కబుర్లు (13)

# ఎవరి అభిప్రాయం వారిదే

గొప్ప రచయితలెందరో! ఆయా రచనలు చదివి ముగ్ధులమై "ఇంతకన్న బాగా వేరెవరూ రాయ లేదు. ఇతడే నా ఆదర్శ రచయిత" అనుకుంటాం. సృజన గురించిన వాళ్ల సూచనలు అవశ్యం అనుసరణీయం. కాని చిక్కేమిటంటే ఏ ఇద్దరు రచయితల అభిప్రాయాలూ ఒక్కలా ఉండవు.

"సాహిత్యం వాస్తవికతకు ప్రతిబింబం కాదు" అంటాడొకాయన. సందర్భం "సీగల్" నాటక ప్రదర్శన నేపథ్యంలో కప్పల బెకబెకలు, పక్షుల కిలకిలా రావాలు ఉంటే బావుంటుందంటాడు దర్శకుడు. ససేమిరా ఉండకూడదంటాడు రచయిత.


గుస్తావ్ ఫ్లాబర్ట్

"మనిషి బొమ్మగీసి, దానిమీద నిజమైన మనిషి ముక్కు అతికించామనుకోండి. చిత్రం పాడు కాదూ!" అని వీటో చేశాడు చెహోవ్. అంతే కాదు ఆయన ప్రకారం "కథలో నవలలో ఏముంది? వస్తువేమిటి? ఇతివృత్తమేమిటి? " లాంటి చచ్చు ప్రశ్నల్ని రేపే రచనలకన్నా "చదవటమే ఒక అనుభవం"గా మార్చే రచనలు గొప్పవి.

రచనా ప్రక్రియలో అసలు నేర్పటం, నేర్చుకోవటం ఉంటుందా? సలహాలు, సూచనలు పాటించటం సాధ్యమా? లేదా ఎవరికి వారు అనుభవ పూర్వకంగా తెలుసుకుని తమ కనుకూలమైన పద్ధతుల్లో రాయటమొక్కటే మార్గమా?

ప్రేమికుడికి ప్రియురాలిలో ఇతరులు చూడలేని అందం కనిపిస్తుంది. ఆమె అతడికి ఊర్వశి వరూధిని అవుతుంది ఒక వస్తువులో, వ్యక్తిలో, సంఘటనలో తమకు మాత్రమే కనిపించే గుణాలను చూడగలగటం రచయితల ప్రత్యేకత. (ఇది స్టెంధాల్ అభిప్రాయం)

ఓ కర్ర ముక్కను ఉప్పుతో ఊచడితే తెల్లారేసరికి దానిమీద ఉప్పు స్ఫటికాలు (క్రిస్టల్స్) ఏర్పడతాయి. ఎండకు మెరుస్తాయి కూడాను. రచయిత ఆలోచనల్లో 'కథ' వస్తువు అలా ప్రకాశిస్తుంది.

అసలు "వస్తువు" అనబడేది ప్రత్యేకంగా ఉంటుందా అని కూడా ప్రశ్నించుకోవచ్చు

అగోచరమైన ఆత్మలాగ రూపం లేని వస్తువు ఉండదు. అంటే కథా వస్తువు కథా రూపంలో భాగమన్నమాట. స్పందన తీవ్రత ఉన్నవాళ్లకే రచన సాధ్యం. ఈ లోకంలో కష్టాలూ, కడగండ్లు అనుభవి స్తున్న వాళ్లక్కొదవలేదు. రచయితలందరూ ఇలాంటి ఇబ్బందులను అనుభవించారో లేదో తెలియదు గానీ, వాటి గురించి పనిగ ట్టుకుని మరీ రాస్తారు. కేవలం సమస్య గురించి రాయటం కథ కాదు. సమస్యనెదు ర్కొంటున్న మనుషుల్ని గురించి రాయటం కథ. అంటే రచయిత వైయ క్తిక స్పందనే సామాజిక రూపంగా పరిణామం చెందుతుంది.



స్టెంధాల్



ఆంటన్ చెహోవ్

మనందరం ప్రేరణ గురించి ఆపసోపాలు పడుతుంటామా!ఓ పెద్ద మనిషి ఇది "తక్షణం వర్జయేత్" అంటాడు.

"ప్రేరణ అంటే నరాల ఉత్తేజం. అలాంటి స్థితిలో రాసిందేదీ హేతుబద్ధంగా ఉండే అవ కాశం లేదు. ఆలోచించి నెమ్మదిగా రాయండి. ఉద్రేకంలో చేసిన ఏ పనీ నలుగు రికి ఆమోదయోగ్యంగా ఉండదు" ఈ మాట లన్నది మరెవరో కాదు. రచయితలందరికీ ప్రాతఃస్మరణీయుడు గుస్తాఫ్ ఫ్లాబర్ట్ (మదాం బావరీ రచయిత) వజ్రాల బేహారులు చాలా ఆలోచించి అధ్యయనం చేసి వాటి విలువ నిర్ణయిస్తారు. వాడిన ప్రతి పదాన్నీ "రంగు, రుచి, వాసన" చూసి నగిషీ చెక్కి రాసిన మహానీయులు ఫ్లాబర్ట్" వేసవి కాలం ఎండ చండ్ర నిప్పులు కక్కుతోంది" అని మపాసా రాస్తే కొట్టేసి "ఉక్కగా ఉంది" అని రాయమ న్నాడు. అంతే కాదు. ఆయన ప్రకారం కథ రాయటం కాలక్షేపం కాదు. దుక్కిటెద్దులు మాత్రమే సాహిత్యాన్ని సృష్టించగలవు. రోజుకు పద్దెనిమిది గంటలు పనిచేస్తారు జీని యస్సులు. అవిశ్రాంత కృషి ఫలితమే రచన కథల లక్ష్యం. సామాజిక సమ స్యల్ని పరిష్కరించడం కాదు. సమస్యలకు వ్యక్తు లెలా స్పందిస్తారో చిత్రిం చటం మాత్రమే" చదవటా నికి చాలా ముందరే మనం కథల్ని వింటాం. మన కోసం పెద్ద వాళ్లు చెప్పినవి కొన్ని. మనకు తెలియ కుండా తమలో తాము చెప్పుకున్నవి కొన్నీ. (ఇవే ఎక్కువ ఆసక్తికరంగా ఉంటాయి). రచయితలు చేసే పని ఇదే. వినొద్దనుకు న్నవి వినిపిస్తారు. చెప్పకూడనివి చెబు తారు. కథ రాయటానికి ముందు, ఒక ఐడి యాను కథగా మలచటమెలాగో సాధన చెయ్యాలి. వీలైనంత సులభమైన పదాలు వాడాలి. కఠిన పదాలంటే భేషజం కోసం చేసుకున్న అలంకారాల్లాంటివి. ఆరోగ్యంగా, శుభ్రంగా ఉండగలిగితే అదే అందం. అందానికి అలంకరణలక్కర్లేదు.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

కాలాతీతం

# మాల్ ఫ్లాండర్స్

డేనియల్ డీఫో

1660-1731



ఇంగ్లీషు నవల

మాల్ ఫ్లాండర్స్ పుట్టుకే (ఇంగ్లండు లోని) న్యూగేట్ కారాగారంలో. తల్లి దొంగ తనానికి శిక్ష అనుభవిస్తున్న ఖైదీ. తండ్రి ఎవడో దారిన పొయ్యే దానయ్య. పెంచుకో వటానికి ఒకావిడ ముందుకొస్తుంది గానీ, అక్కడ యింటి చాకిరీ తప్ప మరే సుఖమూ లేదని మాల్ ఫ్లాండర్స్ గ్రహిస్తుంది. స్వేచ్ఛా జీవితం గడపాలని కోరిక. ఒక మేయరెస్ (ఆడ మేయర్) రమ్మంటుంది. స్వంత కూతురిలాగే చూసుకుంటుంది.

మాల్ అద్భుత సౌంద ర్యవతిగా వికసిస్తుంది. "పడుచు పిల్లకు అందం, తెలివితేటలు, వినయం, విధేయత, సత్ప్రవర్తన ఎన్ని వున్నా, డబ్బు లేకపోతే నిష్ఫలమే కద" అంటారు "అక్కలు". ఆ ఇంట్లోనే వరుసకు అన్న లాంటి వాడొకడు ఆమెను వశపర్చుకుంటాడు. మాల్ కూడా అతడి ప్రేమలో పడుతుంది. కాని ప్రేమికుడి తమ్ముడితో పెళ్లి జరుగు తుంది. అయిదేళ్ల తర్వాత భర్త మరణి స్తాడు. అప్పుడామె పరిస్థితిని డీఫో ఇలా వర్ణిస్తాడు. "1200 ఆస్తి సంక్రమించింది. నా భర్త తల్లిదండ్రులు (నా)పిల్లల పెంపకం బాధ్యత తీసుకుంటామన్నారు. ప్రేమించి ఒకసారి కాలుజారాను. ఇక జీవితంలో అలాంటి పొరబాటు మళ్లీ చేయను. మంచి మనిషి దొరికితే పెళ్లి చేసుకుంటాను. లేదా ఒంటరి జీవితం..." కానీ త్వరలోనే మళ్లీ పెళ్లి చేసుకుంటుంది. డబ్బు ఖర్చయిపో తుంది. కొత్త భర్త అదృశ్యమైపోతాడు. "మంచి భర్త దొరికితే అందరాడవాళ్లలాగే బతకాలనుకున్నాను"అంటూనే ఉంటుంది మాల్. వర్జీనియా (అమెరికా) వెళ్లాక మరోసారి పెళ్లి చేసు కుంటుంది. పిల్లలు పుడతారు. ఈ భర్త మరెవరో కాదు. సోదరుడే. తన తల్లి సంతా నమే. ఈ రహస్యం తెలిసిన క్షణాన మాత్రం కాస్త పశ్చాత్తా పపడుతుంది. పెళ్లిళ్లు తనకు అచ్చి రాలేదు. బతకాలంటే దొంగతనం తప్ప గత్యంతరం లేదు. "నీతిగా బతకాలని ఉంటుంది. కానీ అవసరం నేరం చెయ్యక తప్పని పరిస్థితి కల్పిస్తుంది" అంటూ మాల్ మాటల్లో డీఫో ఆమెను సమర్థిస్తాడు.



డేనియల్ డిఫో

ఆ రోజుల్లో దొంగతనం చెయ్యటం చాలా సులభం కాబోలు. పన్నెండేళ్ల తర్వాత

"రెండు సిల్కు గుడ్డలు" దొంగిలిస్తూ పట్టుబడుతుంది. ఉరిశిక్ష విధిస్తారు. కనీసం అప్పటికైనా తను ఎంచుకున్న మార్గం తప్పని గ్రహించినట్టే కన్పిస్తుంది. ఒక ప్రీస్టుగారి చొరవతో శిక్ష తగ్గించి ఆమెను మళ్లీ వర్జీనియా పంపిస్తారు. "అంతా మన మంచికే" అన్నట్టుగా ఆమెకు జైల్లో కూడా లాభం జరిగింది. మరో భర్త దొరుకుతాడు.

వర్జీనియాలో కొడుకు కనిపిస్తాడు. అదృష్టం కలిసివస్తుంది. తల్లి ఆస్తిలో కొంత సంక్రమిస్తుంది. తల్లి సంతానమైన "భర్త" మరణిస్తాడు. కష్టాలు గట్టెక్కుతాయి. "చిట్టచివరికి నేను భర్తా, పిల్లా పాపలతో సుఖంగా స్థిరపడ్డాను. కొందరివి పాపాలు చెయ్యక తప్పని జీవితాలు. గతానికి పశ్చాత్తాపపడటం తప్ప చెయ్యగలిగిందేముంది? " అంటూ కథ ముగిస్తుంది మాల్.




ఇలాంటి కథ రాసిన డీఫోను ఆనాటి మర్యాదస్తులు తిట్టని తిట్టు లేదు. పైగా, ఉపోద్ఘాతంలో రచయిత "ఆమె జీవితంలో విషాదం ఉంది. నీతి బాహ్యత లేదు" అంటాడు. మాల్ లాంటి జీవనసరళిని ఎంచుకున్న పతితులు కనీసం మూల్యం చెల్లించాలని ఆశిస్తాడు పాఠకుడు. కాని డీఫో "కథానాయిక ఏ తప్పూ చెయ్యలేదు. ఆమె విధి వంచిత మాత్రమే. అలా చెయ్యమని పరిస్థితులు ఆమెను బలవంత పెట్టాయి" అంటాడు ఉపోద్ఘాతంలో. (కథ మాల్ ఆత్మకథ రూపంలో వుంటుంది. దాన్ని పాఠకులకు పరిచయం చేశాడు రచయిత). "సుఖ జీవితం కోసం ఏమైనా చేస్తాను" అంటే పాఠకులు హర్షిస్తారా? ఇందులో వ్యంగ్యముందంటారు కొందరు విమర్శకులు. 'మాటలకూ, చేతలకూ ఉన్న అంతరాన్ని చిత్రించి డీఫో వ్యక్తుల ద్వంద్వ విలువలను ఆవిష్కరించాడు" అని ఒక అభిప్రాయం. కథలో మొదటినించీ మాల్ నీతి, అవినీతి గురించి ఎంతో విజ్ఞతతో మాట్లాడుతుంది. కాని ఎంచుకునేది మాత్రం "అవినీతి"

"మంచి చెడులనేవి మనం కల్పించుకున్నవే. బతకటానికి కావలసింది అడ్డంకులను ఎదుర్కొని నిలదొక్కుకోగలగటమే" అంటున్నాడేమో అని డొరొతీవాన్ ఘెంట్ (ఒక విమర్శకురాలు) అభిప్రాయం. తన పనులను సమర్థించుకోగలిగిన నేర్పు మాత్రం మాల్ వద్ద దండిగా ఉంది. తాగి, పడిపోయిన ఒక యువకుడి నుండి "ఒక గోల్డ్ వాచ్, మనీ పర్స్ మరిన్ని ఆభరణాలు, ఖడ్గం వగైరా లాక్కుని అతడి భార్యా, పిల్లల గురించి కన్నీరు కారుస్తుంది. ఒక పిల్ల దగ్గిర నెక్లేసు దొంగిలించి "పిల్లల్ని ఇలా ఒంటరిగా వదిలి పెట్టటం ఎంత ప్రమాదకరమో తల్లిదండ్రులకు తెలిసిరావాలి" అంటుంది.

ఇంక ఆమె సంతానం సంగతి కథంతా చదివినా స్పష్టంగా తెలియదు. ఎంత

## డేనియల్ డీఫో

కవిత్వం, నాటకం వంటి ప్రక్రియలు చరిత్ర పూర్వం నుండే మానవ సంస్కృతిలో భాగంగా ఉన్నాయి. మనకు తెలిసిన "నవల" మాత్రం ఇంగ్లిషులో పద్ధెనిమిదవ శతాబ్దిలో ఆవిర్భవించింది. దీనికి ఆద్యుడు కొంతకాలం వ్యాపారం చేసి, తరువాత జర్నలిస్టుగా మారిన డేనియల్ డీఫో. అందరికీ తెలిసిన నవల "రాబిన్సన్ క్రూసో" (1719) రాసే నాటికి డీఫోకు ఇంచుమించు అరవై ఏళ్లు. మరో మూడేళ్లకు ప్రచురితమై రచయితకు కాసుల పంట పండించింది. 1722లో రాసిన నవల మాల్ ఫ్లాండర్స్ 'గ్రేట్' అనిపించుకోగలిగిన కొద్ది ఇంగ్లిషు నవలల్లో ఇదొకటుంటుంది వర్జీనియా వూల్ఫ్.

డీఫోకు రచయిత కావాలనే ఉద్దేశం ఎంత మాత్రం లేదు. వ్యాపారంలో నష్టం వచ్చింది. పెరుగుతున్న అప్పులు. భార్యా పిల్లలు. గత్యంతరం లేని పరిస్థితుల్లో కుటుంబ పోషణ కోసం కలం పట్టుకున్నాడు. రాజకీయ పార్టీల అభ్యర్థన మేరకు (ఏ పార్టీ అయినా ఫరవాలేదు) సుమారు 350 కరపత్రాలు రాశాడు. ఇది గాక కవిత్వం, వ్యంగ్య రచనలు. ఒంటిరిగా "ది వీక్లీ రివ్యూ" అనబడే పత్రిక కూడా ఏడేళ్ల పాటు ప్రచురించాడు. డీఫోకు అభ్యుదయ భావాలున్నాయనటానికి నిదర్శనం అతడు 'స్త్రీ విద్య'ను సమర్థించడం. మత సహనాన్నీ, పిల్లల కోసం ఆసుపత్రిలూ, పేద, ధనిక తేడాలేక అందరికీ ఒకే చట్టం కావాలనీ ప్రచారం చేశాడు. ఇవన్నీ ఇప్పుడు మనకు తెలిసినంత సులభం కాదు. ఆ రోజుల్లో విలియం III, క్వీన్ ఆన్‌ల పరిపాలనలో ఇంగ్లండులో దుర్భర నిరంకుశత్వం ఉండేది. ఏలినవారికి కోపం తెప్పించినందుకు పలుసార్లు జైలుకు కూడా వెళ్లక తప్పలేదు. తన మాటకారితనం, రచనా సామర్థ్యంతో

మందిని కన్నదో, ఎక్కడివాళ్ళనక్కడే ఎలా వదిలేసిందో కాని చివరికి మిగిలింది ఒక్కడు. (అనాథ పిల్లల కోసం ఆస్పత్రి కట్టించటానికి డీఫో చాలా కృషి చేశాడు!)

ఆర్థిక స్వావలంబన అన్నింటికన్నా ముఖ్యమని చెప్పదలచుకున్నాడేమో రచయిత. మాల్ చేసిన పనులన్నీ డబ్బు కోసమే. ఒకసారి దొంగతనం కేసులో ఆమెకు బదులుగా మరొకర్ని అరెస్టు చేస్తారు. మాల్ బాధ పడుతుంది. కాని నేరం అంగీకరించి ఆ మనిషికి శిక్ష తప్పించే ప్రయత్నం మాత్రం చెయ్యదు. "నాలో కనికరం చచ్చిపోయింది. నన్నెవరు రక్షించారని ఆపదలో చౌర్య వృత్తిలో పోటీ మనిషి ఒక్కరైనా తగ్గినందుకు సంతోషంగా ఉంది" అంటుంది మరో చోట. 'నాది ఆదర్శ జీవితం కాదు. కానీ వాస్తవంలో ఇలాగే జరుగుతుంది" అంటుంది.

"మనిషన్న తర్వాత ఇక్కట్లు తప్పవు. కాని సామాజిక అసమానతలకు అత్యంత హేయమైన నిదర్శనం పేదరికం"

నీతి వాక్యాలకోసం కాదు. జీవిత వాస్తవికతను తెలుసుకోవటం కోసం చదవాలి ఈ నవలను.

కథ ముగిసేనాటికి మాల్ వయసు నలభైరెండు. ఆస్తి ఐదువందల పౌండ్లు. అనేక ఒడుదుడుకుల తర్వాత కూడా ఆమె మనోస్థైర్యం ఏమాత్రం కోల్పోక "ఇక కొత్త జీవితం ప్రారంభిస్తాను" అంటుంది. ఆమె పరిచయం వల్ల నష్టపోయిన వాళ్ళెందరో. కాని తనను మోసం చేసిన వాళ్ల గురించి కూడా ఆమె చెడ్డగా ఆలోచించదు. "మనిషి మంచివాడే. ఘరానా వ్యక్తి.

అతడు కొంత కాలం సీక్రెట్ సర్వీస్ ఏజెంట్‌గా కూడా పనిచేశాడు. "అన్ని పార్టీలనూ చూశాను. అందరికీ స్వప్రయోజనమే ఏకైక లక్ష్యం" అంటూ తాత్వీకరించాడు.

"రాబిన్‌సన్ క్రూసో"కు తొలి డాక్యుమెంటరీ నవలగా గుర్తింపున్నది. ఒక వాస్తవ సంఘటన ఆధారంగానే ఇది రాశాడు. 1704 నుండి 1709 దాకా అలెగ్జాండర్ సెల్‌కర్క్ అనేవాడు యువాన్ ఫెర్నాండెజ్ ద్వీపం మీద గడిపాడు. ఈ వార్తా కథనమే నవలకు ప్రేరణ. 1665 నాటి లండన్ ప్లేగ్ గురించి డీఫో రాసిన "జర్నల్ ఆఫ్ ది ప్లేగ్ ఇయర్" (1722) అతడి రచనలన్నింటిలోకీ ఉత్తమమైనదంటారు. జీవిత చరమాంకంలో రచనలు ప్రారంభించిన వాళ్లకు అనుభవానికేమీ కొదవ. 'మాల్ ఫ్లాండర్స్' లాంటి నవలలో నీతి, అవినీతి, అశ్లీలత గురించి ఎంత చర్చ జరిగినా, వికృత వాస్తవికత మాత్రం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. విధి చిన్న చూపు చూసిన మనుషులు మనకు పతితులుగానే ఎదురుపడతారు. అలాంటి వాళ్లు తమ జీవితాలను చేజేతులా పాడుచేస్తున్న సందర్భాలు కూడా ఉంటాయి.

కొంతకాలం క్రితందాకా 'మాల్ ఫ్లాండర్స్'ను చిన్నపిల్లల కంట పడకుండా దాచేవారట. ఈ నవల బూతు సాహిత్యంగా బొకాషియో 'డికామెరాన్'తో సరితూగింది. నీతివంతమైన కథలలో పాత్రలు నేరాలు, పాపాలు చేసినందుకు చివరి సీనులో పశ్చాత్తాపపడతారు. కాని మాల్ ఫ్లాండర్స్ తన అనుభవాలను జ్ఞాపకం చేసుకుని కాసింత బాధ పడుతుంది. రచనలోని నిజమైన తిరుగుబాటుదనానికి నిదర్శనం ఇదే. బూతు కాదు.

అతడు ఎన్ని ఇబ్బందుల్లో ఉండి అలా చేశాడో!" అనుకుంటుంది.

ఈ సమాజంలో, స్నేహం పురుషులకు లభించినంత సులభంగా స్త్రీలకు దొరకదు. మాల్ జీవిత గమనంలో ఆవిష్కృతమైన మరొక ముఖ్యమైన సత్యం ఇది. స్త్రీని వాడుకోవాలనుకునే వాళ్లేగానీ, సాటి మనిషిగా గౌరవిద్దామనుకునే మగాళ్ళు అరుదు.

డీఫో కాలానికి ఇలాంటి పుస్తకం రాయటం సాహసమే. కొత్తగా ప్రారంభమైన ప్రక్రియ. ఇంత ధైర్యంగా రాసి మర్యాదస్తులకు కోపం తెప్పించాడు. ఇప్పుడు దీన్ని 'తొలి వాస్తవిక' నవలగా గుర్తిస్తారు. ఇలా రాయటానికి జర్నలిస్టు జీవితం కూడా సహాయం చేసిఉంటుంది.

"జీవిత రహస్యాల్ని శోధించిన లాక్ (తాత్వికుడు) రచనలు అమ్ముడుపోవు. కాని రాబిన్‌సన్ కూనిపోవా, మాల్ ఫ్లాండర్స్‌లూ విరగబడి కొంటారు. ఉత్తములకు తినటానికి తిండి ఉండదు. దిగజారిన వాళ్ళు మేడలు కట్టుకుంటారు" అంటూ 1738లో ఆనాటి బెస్ట్-సెల్లింగ్ రచయిత డేనియల్ డీఫోను అభిశంసించాడో పార్లమెంటు మెంబర్.

కనీసావసరాలు తీరని పేదరికం ఎన్ని నేరాలు చేయిస్తుందో వివరంగా చిత్రించిన నవల మాల్ ఫ్లాండర్స్. సాంప్రదాయిక విమర్శకుల, అవగాహనకు, అందానికి "సుమారు మూడు వందల ఏళ్ళ తర్వాత కూడా ఒక స్త్రీకి అలా జీవించే హక్కు ఉందని బహిరంగంగా అంగీకరించలేని పిరికివాళ్లం మనం" అంటాడు జాన్ సదర్లాండ్.

– ఎం. వసంత ✦

వాళ్ళు అడవితల్లి ముద్దుబిడ్డలు. ఆమె గుండెల్లో ఒదిగిపోయిన వారికి తోడు నీడ, గూడు, గుడ్డ, అన్నం, అంబలి అంతా అడవే. ఆమే దేవత. వారివి కల్మషం లేని అంతరంగాలు. నీతీనిజాయితీలు పుష్కలం. స్వచ్ఛమైన గాలి, సెలయేళ్ళతో కూడిన ప్రకృతిలో భాగమైన ఈ అడవి బిడ్డలు తమపై అధికారం చలాయించే దొరలను చూసి గజగజా వణికిపోతుంటారు. వారికి బానిసలమనుకుంటారు. అలాంటి గిరిజనుల ఆచార వ్యవహారాలు, జీవన విధానాలను స్వాతంత్రోద్యమం నేపథ్యంగా ప్రతిబింబిస్తూ ఆసక్తికరంగా మలచటమే గాక వారి గుండెల్లో కొన్ని తరాల వరకు ఆరాధ్యుడై నిలిచిన ఒక బ్రిటిష్ అధికారి వ్యక్తిత్వ వివరలనూ విశ్లేషించిన **'మంజరి'** నవల **'కనిపించని సూర్యుడు'** ఈ నెల 'చతుర' కానుక.



మంజరి

# కనిపించని సూర్యుడు

అతను నివాసం నుంచి బయటకొచ్చాడు. చుట్టూ చూసి గుమికూడిన ప్రజలకు అభివాదం చేసి, సిద్ధంగా ఉన్న గుర్రం వైపు కదలబోయాడు. పక్కనే నిలుచున్న తమ్ముడు గుర్తు చేశాడు.

"అన్నా! ఆయుధం మరిచావు"

తమ్ముడ్ని మెచ్చుకోలుగా చూసి తిరిగి తన నివాసంలోకి వెళ్లాడతను. ఆయుధం అందుకుని బయటకొచ్చేసరికి డెక్కల చప్పుడు వినిపించింది. తమ్ముడు గుర్రం మీద పోతూ ఉండటం గమనించి విస్మయంగా నిలుచుండి పోయాడతను. జరిగిన మోసం అవగతం కావడానికి ఎంతోసేపు పట్టలేదు. నిట్టూర్చి చుట్టూ పోగయిన జనం వైపు బాధగా చూశాడు.

ప్రజలు ఆవేశంతో ఊగిపోతున్నారు.

అతను తేరుకుని చిన్నగా నవ్వి, గొంతు విప్పి ఖంగుమనే కంఠస్వరంతో అన్నాడు, "సోదరులారా! తోడ బుట్టిన వాడు మనని నమ్మించి మోసం చేశాడు. తనొక్కడే సుఖపడాలని అందర్నీ నట్టేట ముంచి రాజ్యం చేజిక్కించుకోవడానికి వెళ్ళాడు. వాడిని క్షమించి వదిలేద్దాం. ఈనాడు మనకి కొత్తగా పోయిందేమీ లేదు. మన బతుకులు మనకి ఉన్నాయి"

"అవును ఉన్నాయి" ప్రజలు ముక్త కంఠంతో వంత పాడారు.

ఈ కథ ఓ వ్యక్తిది కాదు. తాము అజ్ఞానంలో, అడవుల్లో, దుర్భర దారిద్ర్యంలో ఉండటానికి కారణంగా ఒక జాతి చెప్పుకునే కథ. ఇందులో తమ్ముడు నాగరీకుడు. అన్న ఆటవికుడు.

తమది భారతదేశమనీ, ప్రస్తుతం తమని బ్రిటిష్‌వారు పాలిస్తున్నారనీ, భారతీయులు స్వరాజ్యం కోసం సంఘటితమై పోరాడుతున్నారనీ తెలియని అతి పురాతనమైన జాతి వారిది.

అది కోదు జాతి.

ఎప్పుడో ఓ రాజు కొడుకైన రాముడు.. భార్యని, తమ్ముడ్ని వెంట పెట్టుకుని అడవికి వచ్చాడట. రాక్షసుల్ని తుదముట్టించడానికి కోదుజాతి రాముడికి సాయపడిందట. హనుమంతుడు కోదుజాతి వాడేనని, రాముడిని కంటికి రెప్పలా కాపాడే వాడని - పిల్లలకి పెద్దలు కథగా చెబుతారు. ఆ మాటలకు సాక్ష్యం లేనట్టే, కోదులు అక్కడికి ఎలా వచ్చారనే దానికి కూడా సరియైన జవాబు లేదు.

అయినా వారు ఆ కీకారణ్యంలో జీవిస్తున్నారనేది కాదనలేని నిజం. వారి జీవనం సాగిపోతుంది. పాత తరం నిశ్శబ్దంగా నిష్క్రమిస్తుంటే, కోదు సమాజంలో కొత్త తరం అభివృద్ధి చెందుతోంది. ఆస్తులు, నమ్మకాలు, ఆచారాలు - కుటుంబ చరిత్రతో పాటు ఓ వ్యక్తి పేరు కొత్తతరానికి తెలుస్తోంది.

అతన్ని జ్ఞాపకాలు పరామర్శించి పోతున్నాయి.

అడవి మీద చల్లని కిరణాలు వెదజల్లుతున్నాడు చంద్రుడు. నిష్ప్రయోజనమైన దాన్ని అడవి కాచిన వెన్నెల అనడం పరిపాటి. కాని ఆ పోలిక తప్పు అడవి వ్యర్థమైంది కాదు. అద్భుతాలు కడుపులో దాచుకున్న వనదేవత. అక్కడ పరచుకునే వెన్నెల నిరుపయోగం అనుకోవడం భ్రమ.

అడవితో వెన్నెల జతకడితే ఆ దృశ్యం చూడటానికి రెండు కళ్ళు సరిపోవు. ఆకాశం నుంచి జారే వెన్నెల పోగు పడిన వెండి కుప్పలా కనిపిస్తుంది. అప్పుడు జంతువులు కూడా తమ క్రూరత్వాన్ని మరిచి ఆనందపడతాయి.

ఇంకా తెల్లవారలేదు.

అయితే తెల్లవారడానికి సమయం దగ్గర పడినట్టు తూరుపు దిక్కు తెల్లబడుతుంది. నిశ్శబ్దాన్ని కౌగిలించుకున్నట్టు అంతవరకూ చప్పుడు చెయ్యని అడవి, చైతన్యవంతం కావడానికి ఆయత్తమవుతోంది.

ఉలిక్కిపడి లేచి కూర్చున్నాడు జామిరి కోదు. కొద్దిసేపు అలాగే ఉండిపోయి

నిద్రలో జారిపోయిన జుట్టు ముడి వేసుకుని గుడిసె నుంచి బయటికొచ్చాడు. ఆకాశంలో చుక్కల తళుకుల్ని, తూర్పున తెల్లబడుతున్న షైనాన్ని గమనించి కొద్దిసేపట్లో వెలుగొస్తుందని గ్రహించాడు. గుమ్మంలో చతికిలబడి మోకాళ్ళ చుట్టూ చేతులు పెనవేసి మునగదీసుకు కూర్చున్నాడు.

అతను గ్రామానికి పెద్ద.

సావోతా అంటారు.

ఆ పదవి అతనికి తండ్రి నుంచి సంక్రమించింది. ఇప్పుడతని వయసు అరవై దాటింది. సంవత్సరాల లెక్కతెలియకపోయినా శరీరంలో వచ్చిన మార్పుని బట్టి తను అస్తమించే సూర్యుడిననే స్పృహ వుంది. ఆ వయసులో కూడా నడుము వంచకుండా ఏకబిగిన కొండెక్కుతాడు. ఒంటరిగా అడవిలో పోతున్నప్పుడు చిరుత ఎదురైనా జంకడు. ఈటెని లాఘవంగాను, బలంగాను విసురుతాడు. జంతువుల్ని ఎదురించి జీవించడం అక్కడ విధాయకం.

అతనికి భయమంటే ఏమిటో తెలియదు. ఎన్నో తుఫాన్లు చూసిన వయసు అతనిది. కొన్ని వందల సంవత్సరాల నాటి మహావృక్షాలు నిలువునా నేలకూలడం తెలుసతనికి.

ఆ గ్రామ పడుచులు ఎందరో యువకుల చేతులు పట్టుకుని వెళ్ళిపోయి పెళ్ళిళ్లు చేసుకుని పిల్లల్నికన్నారు. కొత్త పడుచులు, గుంటలు డోక్రీ బేడా యువకుల వెంట వచ్చి పిల్లల తల్లులయ్యారు. వాళ్ళు ఎదిగారు, మీసాలొచ్చాయి. ఒక పడుచు వెళ్ళిపోతే, ఓ కుర్రాడు మరో కుర్రదాన్ని వెంట పెట్టుకుని వస్తాడు.

ఇదంతా జరుగుతుండగానే ఎందరో కోదులు అదృశ్యమవుతుంటారు. తను కూడా గ్రామాన్ని వదిలిపోతాడు. తన జీవితం ముగిసిపోతుంది. ఎవరూ శాశ్వతం కాదిక్కడ.

అతను అడవిలో పుట్టాడు. అక్కడే మట్టిలో కలిసిపోతాడు. తానెందుకు అక్కడ బతుకుతున్నాడనే ప్రశ్న ఎన్నడూ కలగలేదు. బయటి ప్రపంచం తెలియకపోవడం వల్ల కళ్ళముందున్న అతడే ప్రపంచం. కోదు తరాలెన్నో కాల గర్భంలో కలిసిపోయాయి. జ్ఞాపకాలు లీలగా మిగిలున్నాయి. ఇప్పుడు తన తరం చివరి దశలో వుంది.

తను కోదు. తనది అతి ప్రాచీనమైన కుయి భాష.

దానికి లిపి లేదు.

జామిరి కోదు చీకట్లోకి చూస్తున్నాడు.

## రచయిత పరిచయం


**పేరు: గంధం నాగేశ్వరరావు**
కలం పేరు: మంజరి


సాహిత్యం: ఇంతవరకూ పన్నెండు నవలలు వెలువడ్డాయి. 'స్వాతి', 'ఆంధ్రభూమి' వారపత్రికల్లో సీరియల్స్‌గా రెండు నవలలు వచ్చాయి. 'చతుర', 'స్వాతి' మాసపత్రికలలో కూడా నవలలు పుస్తకాలు ప్రచురితమయ్యాయి. ఎమెస్కో వారు మిగిలిన వాటిని ప్రచురించారు. 'విపుల' సహ వివిధ వార, మాస పత్రికలలో ముప్పైకి పైగా కథలు ప్రచురితమయ్యాయి. స్వాతి, పులికంటి కృష్ణారెడ్డి, స్పందన (రాయగడ), ఆర్.యస్. కృష్ణమూర్తి, మేరెళ్ళ సోమేశ్వరరావు సాహితీ సంస్థ - మొదలైన పోటీల్లో బహుమతులు లభించాయి. పుస్తక పఠనం అంటే ఇష్టం. మంచి పుస్తకాలను పరిచయం చేస్తారు. బాగా రాసే ప్రతీ రచయితకి తాను ఏకలవ్య శిష్యుడినని చెప్పుకుంటారు. జీవితం ముగిసేలోపు ఇరవైదాకానైన మంచి పుస్తకాలు రాయాలనేది ఈయన కోరిక.


**చిరునామా:** జి. నాగేశ్వరరావు
10-9-12/1, రామ్‌నగర్, మార్కెట్ వీధి,
విశాఖపట్టణం. ఫోను: 0891-5576835



చంద్రుడిని కొండ మింగే యడం వల్ల అడవి వెన్నెల్లో తడుస్తున్నా, గ్రామంలో మాత్రం చీకటి రాజ్యం చేస్తోంది.

ఎవరో ప్రకృతికి నలుపు రంగు అద్దినట్టు కన్ను పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి రాత్రులెన్నో చూశాడు. చిన్నతనంలో అలాంటి చీకటి వేళ తల్లి గుండెల్లో తల దాచుకుని నెమ్మదిగా తడిమి నోటితో రొమ్ము అందుకుని చప్పరిస్తూ నిశ్చింతగాను, వెచ్చగాను పడుకునే వాడు. మరి బిడ్డలు కలగక పోవడంతో ఆ తల్లి ఏమీ అనేది కాదు.

చీకట్లో దీపాల మాదిరి మెరిసే కళ్ళను చూసి చిరుతగా గుర్తించడం అలవడింది. అడవిలో వెళుతూ పక్షుల సంగీతాన్ని వాటి గమ్యంలోని సంచలనాన్ని బట్టి జంతు సంచారం పసిగట్టడం నేర్చుకున్నాడు. చిన్న చప్పుడయినా విరుచుకు పడే కుక్కలు, చిరుత ఆగమనాన్ని గుర్తించి భయంతో దాక్కుంటాయి. ఆ రోజు ఊరు నుంచి ఓ గొడ్డు అదృశ్యమవుతుంది.

ఆ ప్రశాంత ప్రాతఃకాలంలో జ్ఞాపకాలు జామిరికోదుని స్పృశించి పోతున్నాయి. యజమాని అలికిడికి నెమ్మదిగా వచ్చి జామి రికోదు కాళ్ళ దగ్గర కూర్చుని చెవులు రిక్కించింది పెంపుడు కుక్క. అప్పుడు వినిపించే గాలి చప్పుడు చెవులకు సోకటంతో అలవాటుగా తలని అతని పాదాల మీద పెట్టి పడుకుందా శునకం. చలిలో వెచ్చటి స్పర్శని పరస్పరం అనుభవిస్తూ కూర్చున్నారు. యజమాని శరీరం మీద చెయ్యేసి నిమిరితే మురిసిపోతుంది. దానికి నలతగా ఉన్నప్పుడు ఏవో చెట్లవేళ్ళు, ఆకులు తెచ్చి తినిపిస్తాడు. అది లేచి తిరిగే వరకూ దిగులుగానే వుంటాడు. సుదూర గ్రామాలకు వెళ్లినప్పుడు తప్ప ఎటు వెళ్ళినా దానిని వెంట పెట్టుకుని పోతాడు.

నడుము దగ్గిర వస్త్రానికి మెలివేసి దాచిన చెకుముకి రాళ్ళు తీసి వాటితో నిప్పు చేసి చుట్ట ముట్టించుకుని ఆలోచనల్లో మునిగిపోయాడు జామిరికోదు.

తెల్లవారితే వనదేవత పూజ.

పూర్వం వనదేవత పూజ నాడు నరబలి జరిగేది. ధర్మం కోసం, భూమి కోసం నరబలి చేస్తున్నామని కోదు సమాజం నమ్మేది. అలా ఎంతో మంది పూజకి బలయ్యారు. జామిరికోదు తాత సరబుసాహోతా కాలంలో నరబలికి బదులు జంతువుని బలివ్వడం ప్రారంభమయింది.

ఒక ఏడు చిన్నతనంలో తాత సరుబుసాహోతా వెంట వెళ్ళి నరబలి చూశాడు. ఆ దృశ్యం ఎప్పుడు జ్ఞాపకమొచ్చినా ఒళ్ళు జలదరిస్తుంది. ఒకే వేటుకి తల తెగి అవతల పడింది. తల, మొండెం కొట్టుకుంటుంటే రక్తం ఎగచిమ్ముతోంది. గజగజా వణికిపోతూ తాత చేతులు పట్టుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

నేడు అలాంటి విధానం లేకపోయినా పండుగనాడు ఆ దృశ్యం మనసులో మెదులుతుంది. అది తల్చుకోవడం ఇష్టం లేకపోయినా సరే, అతని ప్రమేయం లేకుండా మెదడులోని జ్ఞాపకాల పొద కదిలి ఎక్కడో దాక్కున్న ఆ దృశ్యం చప్పున కళ్ళ ముందు ప్రత్యక్షమవుతుంది.

సంఘం క్షేమం కోరి ఆనాడు నరబలి ఇచ్చే వాళ్ళూ తమలోని ఒకడిని బలి చేస్తున్నట్టు గ్రహించి, మనిషి బదులు జంతువును బలివ్వడమనే పద్ధతిని సరబుసాహోతా ప్రారంభించాడు. రచ్చబండ వద్ద ఆ నిర్ణయం ప్రకటించినప్పుడు తీవ్రమైన వ్యతిరేకత వచ్చింది. సరబుసాహోతా ధైర్యంగా ఎదురు నిలిచాడు. అందువల్ల కోదు ఆచారంలో ముఖ్యమైన మార్పు చోటుచేసుకుంది. ఇప్పటికీ ఆ పద్ధతే సాగుతోంది. సంవత్సరాలు గడుస్తున్నకొద్దీ సరబుసాహోతా నిర్ణయంలోని గొప్పదనం అర్థం చేసుకుని మెచ్చుకోవడం ప్రారంభించారు కోదులు.

ఇతర గ్రామాలు కూడా ఆ నిర్ణయాన్ని హర్షించాయి.

గొడ్డలి భుజంపైన వేసుకుని పొద్దున బయలుదేరి, సాయంకాలానికి ఓ ఎకరం స్థలంలో అడవి నరికి పారేసేవాడు సరబుసాహోతా. మరునాడు భూమి నుంచి మొదలు తొలగించి దున్నేవాడు. నాలుగైదు రోజుల్లో ఎకరం భూమి సేద్యానికి సిద్ధమయ్యేది. అలాంటి సరబుసాహోతా మరణించిన రోజు గ్రామం యావత్తూ దుఃఖ సాగరంలో మునిగిపోయింది. ఉక్కులాంటి ఆ మనిషి లేడనే నిజాన్ని తట్టుకోలేకపోయింది. ఇతర గ్రామాల ప్రజలు వెల్లువలా

అతన్ని చూడటానికి డోక్రీబేడా వచ్చారు. జామిరికోదు గుండెల్లో ఆ ఘట్టం అంతా పదిలంగా వుంది.

ఆలోచనల నుండి తేరుకుని ఆకాశం తెల్లబడటం గమనించాడ తను. కోదు గ్రామాల్లో పూజారి చుక్కలు చూసి యోగం పెడ తాడు. అక్కడ ఏ కార్యం జరగాలన్నా పూజారే చెప్పాలి. అతను రాత్రుళ్ళు తన గుడిసె బయట ఎత్తయిన రాయిమీద కూర్చుని చుక్కలు లెక్కిస్తూ గడుపుతాడు. చుక్కలతో అతను మాట్లాడతాడో లేక చుక్కలే అతనితో మాట్లాడతాయో తెలియదు కాని చుక్కలే అక్కడ పంచాంగ నక్షత్రాలను గుర్తుపట్టడం, అదృశ్యమవుతున్న చుక్కల్ని పరిశీలించడం ద్వారా రుతువులు గుర్తించే పని అతను చేస్తాడు. ఆ విద్య తండ్రి వద్ద నేర్చుకున్నాడతను.

కోదులు ఒక్కొక్కరు నిద్రలేచి గుడిసెల నుంచి బయటకు రాసాగారు. అప్పటికే పూజారి గడ్డ వైపు సాగిపోయాడు. అతను కాలకృత్యాలు తీర్చుకుని స్నానం చేసి శుచిగా తయారైతే తప్ప పూజ ప్రారంభించడు. రాత్రి రచ్చబండ వద్ద పూజకి ముహూర్తం నిశ్చయించి తెలియజేశాడు. అందుకే నిద్ర లేచిన గ్రామస్థుల మొహాల్లో ఒక రకమైన ఉత్సాహం పారాడుతోంది. దాచుకోవడం, ఇతరుల సొత్తు దోచుకోవడం తెలియని కోదులు పండగలకు ఎంతో ప్రాముఖ్యమిస్తారు.

సూర్యుడు ఆకాశంలోకి ఎగబాకి కొండని తప్పించుకుని ఎర్రబారాడు. ఊరు చివర వనదేవత వనంలో డోలు మోగింది. పూజారి చదివే మంత్రాలు గాలితో పాటు సాగిపోతున్నాయి. వానలు కురవాలని, పంటలు సమృద్ధిగా పండాలని, గ్రామస్థుల్ని పులి ఎత్తుకెళ్ళకుండా ఉండాలని కోరుతోంది అతని గొంతు. కోదులు ఆ మంత్రాలు వింటూ భయభక్తులతో వినయంగా నిలుచున్నారు.

సూర్యుడు తన విశ్వరూపాన్ని చూపుతున్నట్టు ఎండ తీక్షణంగా ఉంది.

ఊళ్ళో సందడి మొదలయింది. కేకలు, కేరింతలు గ్రామాన్ని చుట్టుముట్టాయి. కుండలతో కల్లు తెచ్చి వీధిలో పెట్టారు. చిప్పలు, సీసాలు, మట్టి పాత్రలు పట్టుకుని కోదులు చుట్టూ మూగారు. ఆడవాళ్ళ కోసం కాస్త ఎడంగా ఉంచిన రెండు కుండల దగ్గర కోలాహలం మొదలయింది.

రోజంతా పాటలు, నృత్యం, పిల్లలు గోచీలు పెట్టుకుని మట్టిలో ఆడుతున్నారు. అది కోదులకు అత్యంత ముఖ్యమైన పండుగ. ఒక చోట గొడ్డుని చంపి రెండుగా చీల్చారు. అక్కడే పెద్ద నిప్పు రాజేసి సగ భాగాన్ని వేలాడదీశారు. ఆ వేడికి మాంసం ఉడికి చమురు నిప్పులో పడి అదో రకం వెగటు వాసన వస్తోంది. మిగిలిన భాగాన్ని కూర వండటం కోసం కొంతమంది మోసుకుపోయారు.

సూర్యుడు రెండో వైపు దిగిపోసాగాడు.

కేకలు, కేరింతలు గ్రామాన్ని చుట్టుముట్టాయి. కుండలతో కల్లు తెచ్చి వీధిలో పెట్టారు. చిప్పలు, సీసాలు, మట్టి పాత్రలు పట్టుకుని కోదులు చుట్టూ మూగారు



చూస్తుండగా ఆ వ్యక్తి గ్రామ సాహోతా జామిరి కోదుతో అన్నాడు.

"మిరపకాయ టపా ఎత్తుకొచ్చా..."

జామిరికోదు గంభీరంగా తల పంకించాడు. అతని కళ్లలో అయిష్టత కనిపిస్తోంది. పండగ రోజున మిరపకాయ టపా రావడం అశుభమని తోచింది. నాలుగు కొండల అవతల ఉన్న చిలిశంకా గ్రామంలో అధికారులు బస చేశారు. వాళ్ళు తమ గ్రామం రావాలని నిర్ణయించుకున్నారు. చీకటి పడే వేళకి కొంత మంది కోదులు డోక్రీబేడా నుంచి బయలుదేరి ఆ గ్రామం వెళ్ళి వారిని తమ గ్రామం తీసుకురావాలి.

అదీ టపా సారాంశం.

అధికారుల్ని తీసుకురావడం ఎంత శ్రమతో కూడిన వ్యవహారమో అందరికీ తెలుసు. డోలీ కట్టి అందులో వారిని కూర్చోబెట్టుకుని ఎగుడు దిగుడు దారిలో మోసుకురావాలి. గ్రామానికి వచ్చిన వారిని తిరిగి సాగనంపే వరకూ అన్నీ కష్టాలే!

'వనదేవతకి గ్రామంపట్ల దయ కలగలేదనడానికి ఇంతకంటే నిదర్శనం ఏముంది'? మనసులో అనుకున్నాడు గ్రామ సాహోతా జామిరి కోదు.

సరిగ్గా ఆ సమయంలో తూర్పువైపు కొండల నడుమ ఓ వ్యక్తి ప్రత్యక్షమై, రొప్పుతూ వచ్చాడు. చాలా దూరం నుంచి ఆగకుండా పరిగెత్తుకుని వచ్చాడేమో అతని శరీరం చెమటతో తడిసిపోయింది. గ్రామ కోదులు ఆ వ్యక్తి చేతిలోని పొడవాటి కర్రని, దాని చివర కట్టిన ఎర్రటి మిరపకాయని గమనించి ఎవరో శపించినట్టు శిలల్లా ఉండిపోయారు. గ్రామం అంతా విస్తుపోయి

## 2

సూరీడు కొండ వెనుక నక్కాడు.

క్రమంగా గ్రామాన్ని చీకటి అలుముకుంది. విందు భోజనానికి ముందు గ్రామస్థుల్ని సమావేశపర్చి పది మంది యువకుల్ని ఎన్నిక చేశాడు జామిరికోదు. సాహోతా మాట కాదనే ధైర్యం ఎవరికీ లేదు. అందుకే

పండగ రోజున వెళ్ళడానికి తీవ్రమైన అయి ష్టత కలగడంవల్ల ఆ యువకుల ముఖాలు కళ తప్పాయి.

రాత్రికి గ్రామంలో ఎంతో సందడి ఉంటుంది. పడుచు పిల్లలు ఒకచోట చేరి నాట్యం మొదలెడతారు. వారితో యువకులు జత కలుస్తారు. జోడీ కుదిరితే నాట్యం మధ్యలో జంట అదృశ్యమవుతుంది. పూర్తిగా అలిసిపోయి నిద్ర ముంచుకొస్తే తప్ప అక్కడ నుంచి ఎవరూ కదలరు. మనసులతో పాటు సిగలో తురుముకున్న కొండపూలు జారిపోయే తరుణమది. అదో మత్తు. యావత్తు గ్రామాన్ని కుదిపివేసే మైకం. ఆ మత్తు, మైకం కొద్ది రోజులు గ్రామాన్ని వదలవు.

అలాంటి సమయంలో సరదాలన్నీ వదులుకుని చిలిశంకా గ్రామం వెళ్ళడమంటే చిన్న విషయం ఏమీ కాదు. ఎన్నో రోజుల నుంచి ఎదురు చూసిన పండగనాడు- ఆరేడు గంటలు చీకటిలో నడవడం నిజంగా దురదృష్టమే. ఎప్పటినుంచో ఊరిస్తూ, ఉడికిస్తూ ఉన్న కుర్రదాని మనసు చూరగొనాలనుకున్న యువకులు పది మంది ఆ బృందంలో సభ్యులు.

తినడానికి తిండి మూటగట్టుకుని, ఆ మూట కర్రకి వేలాడకట్టి, కర్రని భుజంపైన పెట్టి - మిరపకాయ టపా తెచ్చిన వ్యక్తి వెనుక భారంగా కదిలిందా బృందం. ఎంత తొందరగా నడిచినా నడిజాముకిగాని చిలిశంకా చేరుకోలేమని వాళ్లకి తెలుసు. దేవతల ఆగ్రహం కంటే అధికారుల కోపం తీవ్రమైందని కూడా అనుభవపూర్వకంగా వాళ్లకి తెలుసు.

అందుకే అడుగులు చురుగ్గా వేస్తున్నారు.

చీకటి మరింత చిక్కగా అడవిని ఆక్రమించింది. మనిషి కంటే ఎత్తు పెరిగిన గడ్డి మధ్య ఎన్నో తరాల క్రితం ఏర్పడిన కాలిబాటలో సాగి పోతున్నారు. క్రమంగా ఆకాశంలో చుక్కలు పొడిచాయి. ఆ కాస్త వెలుగులో ఒకరి వెనుక ఒకరు బ్రహ్మాండమైన కొండచిలువ వెళుతున్నట్టు నడుస్తున్నారు. శరీరం నిండా గుడ్డ లేకపోయినా అంత చలిలో కూడా శరీరాలకి చెమట పట్టింది.

అలాంటి సమయాల్లో ప్రయాణం చెయ్యడం వాళ్లకేం కొత్త కాదు. మిలియా పుట్టి సంతకి పోయి చీకటి పడేవేళ తిరుగు ముఖం పడతారు. అడవిలోని జంతువుల తోను, పరిసరాలతోను వారి పరిచయం చాలా గాఢమైంది. అవి వాళ్ళకి నేస్తాలు. చెట్టు పూస్తే పలకరించి పులకరించి పోతారు. గర్భం ధరించిన స్త్రీనీ, పిందె తొడిగిన చెట్టునీ ఒక్కలాగే చూసే ఆచారం వారిది.

అబద్ధం చెప్పడం, మోసం చెయ్యడం తెలియదు. ఒకరి భార్య చెయ్యి పట్టుకోవడం ఇంకొకరి భూమి సంపాదించడం కోదు సమాజంలో నేరం. ఎవరైనా రీతీ, నీతి తప్పితే రచ్చబండ వద్ద గ్రామస్థుల సమక్షంలో విచారించి శిక్షిస్తాడు సావోతా. అతను వారికి రాజు, అధికారి! కష్టం చెప్పుకుని సహాయం అడగడానికి అతనే దిక్కు. కోదు జాతి అనాగరికమైనదే అయినా వారిలో నిజాయితీ అధికం.

సగం దూరం వెళ్లి గెడ్డ పక్కన మైదానం వంటి ప్రదేశంలో ఆగి తిండి తిన్నారు. నిప్పు చేసి చుట్టలు ముట్టించారు. తాము కూడా అడవిలో ఓ భాగమైనట్టు గడ్డిలో వెనక్కి వాలారు. చలిగాలి వారి శరీరాలను ప్రేమగా స్పృశించిపోతోంది. అక్కడ తమ సోదరులు బసచేసిన విషయం గ్రహించి దూరంగా తప్పుకున్నట్టు జంతువుల అలికిడి గాని, అరుపులు గాని వినిపించడం లేదు. విషపురుగులు సైతం రాళ్ళ వెనక, తుప్పల్లో దాక్కుని బయటకొచ్చే ప్రయత్నం మానుకున్నాయి.

ఒక కోదు కర్రకి గుడ్డ చుట్టి దాని పైన ఆముదం పోసి దివిటీ వెలిగించాడు. ఆ వెలుగులో చీకటిని చీల్చుకుంటూ దట్టమైన

చెట్లను దాటుకుంటూ ఆ బృందం తిరిగి ప్రయాణం మొదలెట్టింది, విశ్రాంతి దశ దాటి.

* * *

చిలిశంకా గ్రామం చెట్లకింద పడుకున్న డోక్రీబేడా కోదుల్ని తెల్ల వారుజామున వారిని నిద్ర లేపాడు. ఆ గ్రామం చేరుకుని పట్టుమని రెండు గంటలు కూడా కాకపోవడంతో అలసట వదల్లేదు. అయినా కూడా లేచి ఒకచోట గుంపుగా కూర్చుని చూడసాగారు.

గ్రామానికి వేంచేసిన ఫారెస్ట్ రేంజర్ (ఫారాస్టి) ఇంకా నిద్రలేవ లేదు. అతను లేచిన వెంటనే టీ అడుగుతాడు కాబట్టి ఒక గార్డు పొయ్యి ముట్టించాడు. చిలిశంకా గ్రామ సావోతా పాలు తీసుకురావ డానికి ఓ మనిషిని పంపాడు. కొంత మంది గార్డులు గెడ్డవైపు వెళ్లారు. అప్పటికే గ్రామస్థులు డోలీలు సిద్ధం చేసి వుంచారు.

ఒక మనిషి కూర్చోవడానికి వీలుగా అడవి తీగలు, కర్రముక్కలు కలిపి గూడులా అల్లుతారు డోలీ. బలమైన కర్రకి నడుమ దానిని కట్టి ఇద్దరు మను షులు చెరో వైపు భుజాలకు ఎత్తు కుని మోసుకుపోవాలి. అది చాలా శ్రమతో కూడిన పని. పట్నం నుంచి వచ్చిన అధికారులు కోదు జాతిని పశువులకంటే హీనంగా చూస్తారు. తమని సేవించడానికే భగవంతుడు వారిని సృష్టించినట్టు తలుస్తారు.

తెల్లవారి పోయింది.

ఫారాస్టి తనకోసం ప్రత్యేకంగా వేసిన గుడిసె నుంచి బయటకొ చ్చాడు. కుర్చీలో కూర్చుని సిగరెట్

## అల్లరి పిల్లల మెదడు మెల్లన

కొందరు పిల్లలు ముద్దుగా ఉంటారు. మరికొందరూ ముద్దుగానే ఉంటారు కానీ క్షణంలో ఇల్లు పీకి పంది రేసి పకపకమంటారు. అటువంటి వాళ్లని చూస్తే రాక్ష సులేనయమనిపిస్తారు. కానీ ఏమీ అనటానికి లేదు. 'పిల్లలు కాకపోతే నువ్వూ నేనూ అల్లరి చేస్తామా?' అని వాళ్లని సమర్థించటమే కాదు 'ఎదిగితే వాళ్లే నేర్చు కుంటారు' అని మనకే సర్ది చెప్తారు. అయితే 'అల్లరే కదా' అని సరిపెట్టుకోకుండా అమెరికాకు చెందిన 'నేష నల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెంటల్ హెల్త్' వారు ఈ అతి చురుకు పిల్లల మెదళ్లను క్షుణ్ణంగా పరిశీలించారు. వీళ్లు పరిశోధించి తేల్చిందేమిటంటే ఈ మితిమీరిన అల్లరి ఓ రకమైన వ్యాధి అని. దీనికి 'అటెన్షన్ డెఫె సెట్ హైపర్ ఆక్టివిటీ డిజార్డర్' అని పేరు పెట్టి ఇందుకు కారణం మెదడులో జరిగే రసాయన చర్యలు అని తేల్చి చెప్పారు. చిన్నతనంలో అల్లరి పిల్లలుగా పేరు పొంది, ఎదిగిన తరువాత అల్లరి పిల్లలకు జన్మ నిచ్చిన ఓ ఇరవై అయిదు మంది పెద్దల మెదళ్లను 'పాజిట్రాన్ ఎమిషన్ టోమోగ్రఫీ స్కానింగ్'కు గురిచే శారు. వీరితో పాటు మామూలు మనుషుల మెదళ్లను పరీక్షించారు. ఈ పరీక్ష వల్ల తేలిందే మిటంటే, మామూలు మను షుల మెదడు కన్నా హైపర్ ఏక్టివ్ మనుషుల మెదడు ఎనిమిది శాతం మంద కొడిగా పనిచేస్తుందట. అంటే, మెదడులోని రెండు ప్రాంతాల నడుమ సమాచారం నెమ్మదిగా ప్రయాణి స్తుందట. అంటే పిల్ల లెంత అల్లరి చేస్తే, వాళ్ల మెదళ్లు అంత నెమ్మదిగా పనిచేస్తా యట. కాబట్టి ఇక నుంచీ అల్లరి పిల్ల లను 'షార్ప్' అని పొగిడేకన్నా 'స్లో' అని తిట్టాలన్నమాట.



జ్ఞాపకం చేస్తోంది. తన ఆకారం వికారంగా వున్న దని తెలియని వాడికి మల్లే కులాసాగా కూర్చు న్నాడతను.

ఫారాస్టి తయారయ్యేసరికి సూర్యుడు ఆకాశంలోకి చొచ్చుకొచ్చాడు. రాత్రి కురిసిన మంచువల్ల వాతావరణం ఇంకా చల్లగా వుంది.

"డోలీలు దగ్గరకు పదండి. దొర బయలుదేర్తున్నాడు"

చిలిశంకా గ్రామ సాహోతా డొక్రీబేడా వారిని హెచ్చరించాడు.

అందరూ గాభరాగా డోలీల వద్దకుపోయి, ఒక్కొక్క డోలీ దగ్గర ఇద్దరు చొప్పున నిలుచున్నారు.

ఫారాస్టి కాస్త పెద్దగా కనిపిస్తున్న మొదటి డోలీలో కూర్చున్నాడు. గార్డులు సామానులతోసహా మిగతా డోలీలు ఆక్రమించారు. గ్రామస్థులు వంగి దండాలు పెడుతుండగా డోలీలు కదిలాయి. ఫారాస్టి డోలీని కొంతదూరం అనుసరించాడు సాహోతా. ఊరు దాటి దట్టమైన అడవిలోకి ప్రవేశించిన తరువాత ఆగిపోయాడతను.

ప్రయాణం చురుగ్గా సాగుతోంది.

సూర్యుడు తల మీదకొచ్చినప్పుడు ఒక చోట ఆగారు. గార్డులు తమ వెంట తెచ్చిన ఆహార పదార్థాలు ఆకులో సర్ది ఫారాస్టికి అందించారు. అతను చెట్టు నీడలో కూర్చుని ఆరగిస్తుంటే, సిబ్బంది ఓ పక్కకి పోయి తినసాగారు.

బరువు దించి ఊపిరి పీల్చుకున్నారు కోదులు. మెలితిరిగిన కండరాలు చెమటతో



వెలిగించి, విలాసంగా కాల్చసాగాడు. కాలు మీద కాలేసుకుని అతను కూర్చున్న తీరు చూస్తే మనుషుల్లో తనో ప్రత్యేకమైన వాడిగా భావిస్తున్నట్టు తోస్తుంది. కడుపు నిండా జీలుగు కల్లు పట్టించి, అవలీలగా రెండు బలిసిన కోడి పెట్టలు ఆరగించి అరాయించుకోగలడు. అందువల్ల అతని కడుపు ముందు కొచ్చి ఎత్తుగా నెలలు నిండిన స్త్రీ గర్భంలా కనిపిస్తోంది. మెడ కింద కొవ్వు పేరుకు పోయి ముడతలు పడి గంగడోలుని

తడిసి సూర్య కాంతి పడి మెరుస్తున్నాయి. వాళ్ళు తుప్పల చాటుకి చేరుకుని చుట్టలు ముట్టించారు. డోక్రీబేడా చేరాలంటే ఇంకా, వచ్చినంత దూరం నడవాలి. తమను మోస్తున్న వారికి తిండి పెట్టాలనే ఆలోచన ఫారెస్టి వారికి లేదు. తమ కష్టనష్టాల గురించి ఆలోచించే అధికారుల్ని కోదులు ఎన్నడూ చూడలేదు. అధికారులు తమ గ్రామానికి వచ్చినప్పుడు వాళ్లు తొందరగా పోతే మొక్కులు తీరుస్తామని దేవతలకి మొరపెట్టుకుంటారు.

ఫారాస్టి అంటే కోదులకు అంతులేని భయం. అతను గ్రామానికి వస్తున్నాడంటే కలకలం చెలరేగుతుంది. డబ్బు చందాలు వేసుకుని సావోతా చేతికిస్తారు. ఎలాంటి కష్టం ఎదురైనా కలిసి భరించాలనేది వారి విధానం.

తేనె, పెండలం, పాత బియ్యం, చింత పండు వంటి వస్తువులు జాగ్రత్త చేస్తారు. ఇవన్నీ స్నేహంతో కాకుండా భయంతో చెయ్యడం జరుగుతుంది. చెట్లు నరకడం, అడవి కొట్టి వ్యవసాయం చెయ్యడం నేరం. నేర తీవ్రతని బట్టి పైకం చెల్లించాలి. అందుచేత ఫారాస్టిని మంచి చేసుకోవడానికి ప్రయత్నిస్తారు.

ఫారాస్టికి అడవి కోళ్ళ వేటంటే ప్రీతి. అతనే స్వయంగా తుపాకి పేల్చి వాటిని చంపుతాడు. ఆ ముచ్చట తీర్చడం కోసం గ్రామ సాములో అడవిలో చోళ్లు జల్లి అడవి కోళ్లను ఒక చోట చేరే అలవాటు చేస్తాడు. ఫారాస్టి వాటిని వేటాడి కూర వండించుకుని తింటాడు. మామూలు కోళ్లు ఎన్ని సమర్పించినా అడవి కోళ్ళు లేకపోతే చిర్రుబుర్రులాడ తాడు. అలాంటి ప్రమాదం కలగకుండా ముందుగానే జాగ్రత్త పడతాడు సావోతా.

కోళ్ళు బిస్కత్తుల్లా తిని కాయం పెంచడం వల్ల ఇద్దరు మనుషుల కంటే బరువుంటాడు ఫారాస్టి. అందుచేత అతని డోలీ మోస్తున్న కోదులు చెమటలు కక్కారు. తిరిగి ప్రయాణం ప్రారంభమైనప్పుడు మరో జంటకి ఫారాస్టి డోలీ అప్పగించి ఇంకో డోలీ వాళ్ళిద్దరూ ఎత్తుకున్నారు.

సూర్యుడు అటు పక్క ఒరుగుతున్నాడు. గ్రామం దూరంలో వుండగానే గ్రామ స్థుల్ని వెంటేసుకుని ఎదురొచ్చాడు సావోతా జామిరికోదు. ఫారాస్టికి వంగి వంగి సలాం చేసారు వారంతా.

"ఏరా! సావోతా నంజికొడకా! అడవి కొట్టిం



చేస్తున్నావట. నీ బాబుగాడి సొత్తనుకు న్నావా? " అరిచాడు ఫారాస్టి

డోలీలు మోస్తున్న వారితోసహా అందరి మొహాలు మాడిపోయాయి, మొదటి దెబ్బ సూటిగా తగిలి.

"తమ బిడ్డలం.. కోప్పడితే మేం ఏటయి పోతాం.." సావోతా వినయంగా అన్నాడు. అతనికి తెలుసు, అధికారుల ముందు పౌరుషం తెచ్చుకుంటే పని కాదని.

"బిడ్డలమంటారు అడవి నరికేస్తారు. బంగారంలాంటి చెట్లు తెగేసి అమ్ముకుం టారు. జంతువుల్ని చంపి తినేస్తారు. వాటి లెక్కలు చూడటానికి మేం అడవుల పట్టి తిరగాల. దొంగ లెక్కలు తయారు చెయ్యాల. ఎన్ని తూర్లు సెప్పినా మాను కోరు. ఆ ఫారాస్టి నంజి కొడుకు అడవిలోకి ఏటొస్తాడులే అని ఆర్డరు మీరేస్తారు. దొంగ లెక్కలు సూసి గవర్నమెంటు మా సెంపలు వాయగొడుతుందని తెలుసుకోని టక్కుట మార గజకర్ణ, ఘోకర్ణ విద్యలు తెలిసిన మాయ నంజి కొడుకులు మీరు. పోయిన ఏడాది పంటలు లేవని తిండికి సచ్చిపోతు న్నామని ఏడ్చి తప్పించుకుపోయారు. ఆ రూపాయలు కూడా ఇప్పుడు కక్కిస్తాను"

ఫారాస్టి డోలీ కదులుతోంది. దానితో పాటు సోవోతా, అతనితో వచ్చిన వాళ్ళు భయంగా అడుగులు వేస్తూ కదులుతు న్నారు. ఆ అధికారి తిట్ల దండకం ప్రవాహం సాగిపోతుంది. ఊరు చివరి ఎత్తైన ప్రదేశంలో ప్రత్యేకంగా అప్పటిక ప్పుడు తయారు చేసిన పాక వద్ద డోలీలు ఆగాయి. ఒక గార్డు హడావిడిగా సావోతాని అడిగాడు.

"దొరకి టీ సెయ్యాలి... పాలు తెచ్చావా? "

అతను తలూపి, చిన్న మట్టి పాత్ర పట్టు కున్న కోదుని చూపించాడు. ఆ మట్టి పాత్ర పైభాగం ఆకుతో మూసి వుంది. వెంటనే పొయ్యి రాజేసి తమతో తెచ్చిన తేయాకు ఉపయోగించి టీ చేశాడు గార్డు.

వెంట తెచ్చిన కుర్చీ పాక ముందు వేశారు. ఫారాస్టి ఆ కుర్చీలో కూర్చుని సిగ రెట్ వెలిగించి షోగ్గా పట్టుకుని రెండో చేత్తో టీ గ్లాసు అందుకున్నాడు. ఆ కుర్చీకి తుపాకి ఆనించి వుంచాడు ఓ గార్డు. కోదుల్ని భయపెట్టి అదుపులో వుంచడానికి అవన్నీ అవసరమని ఫారెస్ట్ వాళ్ళకి తెలుసు. రూపాయి ముట్టే చోట రెండు రూపాయలు గుంజాలంటే తగిన ఏర్పాట్లు చేసుకోవాలి. అవతలి వాడు తన గోడు వెళ్ల బోసుకుని తప్పుకోకూడదంటే దౌర్జన్య పద్ధ తులు అవలంభించాలి.

కాళ్ళు కట్టేసిన కోళ్ళ అరుపులు ఫారాస్టిని శాంతపరుస్తూ పాక వెనుక నుంచి వినపడు తున్నాయి. అప్పుడే చెట్టు నుంచి తీసిన తాజా జీలుగు కల్లు కుండతో తెచ్చి పాకలో పెట్టారు. ఆ కుండ మీద మూత లేకపోవ డంవల్ల వస్తున్న కల్లు వాసన పీలుస్తూ మరింత షోగ్గా టీ తాగుతున్నాడు ఫారాస్టి.

గార్డుల కోసం ముంతలతో విప్ప సారా తీసుకొచ్చి ఫారాస్టి కంట పడకుండా తుప్పల్లో దాచాడు బారికి. ఫారాస్టి బస చేసిన పాక చుట్టుపక్కల మగవాళ్లు తప్ప స్త్రీలు, పిల్లలు లేరు. వాళ్లు గుడిసెల నుంచి బయటకు రాకుండా అక్కడ జరిగే తంతు రహస్యంగా కనిపెడుతున్నారు. ఇద్దరు కోదుల సాయంతో కోళ్ళు కోయించే పనిలో వున్నాడు ఓ గార్డు.

"రేపు అడవి కోళ్ళ వేటకి పోదాం" తుపా కీని ప్రేమగా నిమురుతూ సావోతాతో అన్నాడు ఫారాస్టి. అతనికి చెరో వైపు కూర్చుని కాళ్ళు పిసుకుతున్నారు ఇద్దరు కోదులు.

"సిత్తం దొరా" సావోతా అన్నాడు.

అక్కడ నుంచి ఇరవై అడుగులు నడిస్తే వరుసగా గుడిసెలు తగులుతాయి. మొత్తం యాభై కంటే ఎక్కువ లేవు గుడిసెలు. ఓ గుడిసెలోని స్త్రీ తన మొగుడు రావడం

చూసి ఆందోళనగా అడిగింది

"అదేంటి నెత్తురు కారుతోంది"

అతను నిస్సత్తువగా కూర్చుని అన్నాడు.

"డోలీ మోస్తే నెత్తురు కారదేంటి?"

ఆమె విస్మయంగా చూసింది. అంబలి తాగి పొలంలో వంచిన నడుము ఎత్తకుండా చీకటిపడే వరకూ పనిచేసే రాయిలాంటి మనిషి భుజాల నుండి నెత్తురు కారడం చూసి మతిపోయిందామెకి.

"...ఫారెస్టు ఏనుగంత మనిషి. దారిలో ఓ క్షణం నిలుచోవడానికి ఒప్పడు. మా భుజాలు పుళ్ళవుతున్నాయని తెలుసుకోడు. కడుపులు మాడిపోతున్నా మొయ్యాలి. ఆడు మనిషో, రాయో తెలవదు" చెప్పాడు బాధగా.

ఆ స్త్రీ గబగబా బయటకొచ్చి చుట్టూ జాగ్రత్తగా పరికించి చూసి గుడిసెలను చాటు చేసుకుని అడవి వైపు నడిచింది. పుట్టినప్పటి నుంచి సంచరించిన నేలలో ఏ మొక్క ఎక్కడుందో తెలుసామెకు. కొద్దిసేపట్లో చిన్నచిన్న ఆకులు గుప్పెడు పట్టుకుని తిరిగొచ్చింది. రెండు చేతులతో ఆకులు నలిపి వచ్చిన పసరు భర్త భుజాల మీద కనిపిస్తున్న గాయాలకు పూసింది. అప్పటికే అతను ముంతడు సారా పట్టించడం వల్ల వాసన గుప్పుమంటోంది. దానికి పసరు నుంచి వెలువడుతున్న వెగటు వాసన తోడయింది.

మనిషికి నీరు ఎంత అవసరమో కోదులకు కల్లూ, సారాయీ అంత అవసరం. ఎవరికి వారు స్వయంగా సారాయి వండుతారు. జీలుగు చెట్ల నుంచి కల్లు తీస్తారు. చిన్న పిల్లలకు కూడా సారా అలవాటు చేసే ఆచారం వారిలో వుంది. సారా తాగితే కొన్ని జబ్బులు రావనే నమ్మకంతో ఆ పని చేస్తారు.

అధికారుల మీద ఎదురు తిరగాలనే ఆలోచన వారికెప్పుడూ రాలేదు. తరతరాల నుంచి వినయ విధేయతలు, భయభక్తులు ప్రదర్శిస్తూనే వున్నారు. ఒంటరిగా క్రూరమృగాలతో తలపడటానికి జంకని కోదు



## చక్రపాణి చమత్కారాలు

వెండితెరకు మకుటాయమానంగా నిలిచే మాయాబజార్, మిస్సమ్మ, పాతాళభైరవి, గుండమ్మకథ వంటి గొప్ప చిత్రాలందించిన విజయా అధినేతలలో చక్రపాణి స్టైలే వేరు. పైకి సీరియస్‌గా ఉన్నా ఆయన మాటలు చాలా సరదాగా ఉంటాయి.. ఈ నెల చతుర పాఠకులకు ఆయన చతురోక్తులు ప్రత్యేకం.

### మొగుడుంటే కథకు అడ్డం పడతాడు

విజయావారు 'గుండమ్మ కథ' సినిమా తీస్తున్న రోజులు.. ఎన్టీఆర్, ఎఎన్నార్, సావిత్రి, జమున, సూర్యకాంతం, ఎస్వీఆర్ వంటి హేమాహేమీలంతా నటిస్తున్నారు. ఓ రోజున షూటింగ్‌లో ఒకాయన 'గుండమ్మకు మొగుడ్ని పెడదాం.. గయ్యాళిది కనుక భార్య మాటకు ఎదురుచెప్పలేడన్న విధంగా ఆ పాత్రను తీర్చిదిద్దుదాం' అన్నాడు. అంతా ఈ ప్రతిపాదనను చక్రపాణి గారి ముందు ఉంచారు. 'ఒద్దొద్దు.. ముందనుకున్నట్లే తీద్దాం.. గుండమ్మకు మొగుడుంటే చీటికి మాటికి కథకు అడ్డం పడతాడు' అన్నారాయన తపీమని ఒక్క క్షణమన్నా ఆలోచించకుండా. అదీ నిజమే అనుకున్నారంతా ఆ తర్వాత.



బయటి మనుషుల్ని చూసి భయపడతాడు. అధికారులు అడవి జంతువుల కంటే ప్రమాదకరమని కోదు భావన. అతను అలా అనుకోవడంతో అతిశయోక్తి ఏమాత్రం లేదు. ఎందుకంటే, అధికార్ల దౌర్జన్యం అతను రుచి చూసివున్నాడు కాబట్టి.



అప్పుడెప్పుడో ఓ ఫారాస్టి వుండే వాడట. అతను గ్రామానికి తరలివచ్చినప్పుడు పెళ్ళి కాని పడుచుల్ని పంపమనేవాడట. అది భరించలేక కోదులు వనదేవతని ప్రార్థించారట. ఒక రాత్రి ఫారాస్టి నిద్రపోతున్నప్పుడు కోడెత్రాచు ఒకటి పాక కప్పునుంచి మంచం మీదకు జారి కాటు వేసింది. అతను బతకడానికి అవకాశం లేకుండా నాలుగైదు చోట్ల కరిచింది. తెల్లారాక పీడ విరగడైందని తెలుసుకుని గ్రామం యావత్తూ పండగ చేసుకుందట. గ్రామంలోని వృద్ధుల స్మృతిపథం నుండి ఎన్నడూ చెరగని జ్ఞాపకం అది.

ఆ రాత్రి ప్రశాంతంగా పనులు పూర్తవుతాయని తలచిన డోక్రీబేడా గ్రామ సావోతా జామిరి కోదు, అలా జరక్కపోవడంతో ఖిన్నుడయ్యాడు. ఫారాస్టి వెంట వచ్చిన వారిలో సాహు అనే గార్డు వున్నాడు. అతను కడుపు నిండా విప్ప సారా పట్టించాడు. సరిగ్గా ఫారాస్టి భోజనానికి కూర్చున్న సమయంలో బిగ్గరగా అరిచాడు.

ఆ అరుపుకి గ్రామం అంతా ఉలిక్కిపడింది.

"ఏటిరా ఎదవ నంజి కొడకా! నా బొట్టికి బాలేదంటే తీసుకొచ్చి ఏటిరా సేస్తున్నావ్? కల్లు తాగి మాంసం తినడమేనేట్రా డ్యూటీ. పోతులా తొంగుండి గురకెడతావ్. మాం మనుసులమని నీకెప్పుడురా తలకెక్కుద్ది... ఇంటికాడ నన్నొగ్గెస్తే నీకేటిరా నట్టం. పెళ్ళాం పిల్లలు లేనోడికి కట్టం ఏటి తెలుసుద్ది. డూటీకి రాకపోతే రిపోర్టు రాత్తాడంట. పిచ్చినాకొడకా, ఇక్కడ నువ్వెన్ని కోళ్ళు మెక్కావో, ఎంత కల్లు తాగావో పెద్ద అధికారికి నేను సెప్పలేనా" అలా పిచ్చిపిచ్చి ప్రేలాపనలు పేలి చివరికి కిందపడిపోయి మరి లేవలేదు.

ఏదో జరిగిపోతుందని భయపడిపోయాడు సావోతా.

ఆ మాటలు విననట్టు మౌనంగా భోజనం ముగించాడు ఫారాస్టి. అతని కోసం చేసిన

పదార్థాలు కొన్ని మిగిలిపోయాయి. దానిని బట్టే సాహు మాటలు ఫారాస్టి మీద ప్రభావం చూపాయని మిగతా గార్డులకి అర్థమయింది. కుర్చీలో కూర్చుని కాస్త స్థిమితపడి సిగరెట్ ఒకటి ముట్టించి, తన ఎదురుగా చేతులు కట్టుకుని నిలబడ్డ ఓ గార్డుతో ఫారాస్టి అన్నాడు,

"వాడొట్టి అమాయకుడని నాకు తెల్సు. సారా తాగితే ఒళ్ళు తెలియదు వాడికి. తీసుకుపోయి ఓ పక్క పడేసి గొంగళి కప్పు. మీరు అన్నం తిని పడుకోండి... పొద్దున అడవి కోళ్ళ వేటకి వెళ్ళాలి"

ఓ మూల చీకట్లో నిలుచున్న సావోతా ఆ మాటలు విని, అక్కడ ఇంకేదో పెద్ద రభస జరుగుతుందని ఊహించడం వల్ల కలిగిన ఆందోళన చేత్తో తీసేసినట్టు మాయం కావడంతో తృప్తిగా గుడిసెలవైపు అడుగులు వేశాడు.

ఉదయం అడవి కోళ్ళ వేట పూర్తవుతుంది. సాయంకాలం ఎక్కడెక్కడ అడవి నరికి వ్యవసాయం చేసింది రాసుకుని, డబ్బులు వసూలు చేస్తాడు ఫారాస్టి. ఈ లోపు అతను వెళ్ళే గ్రామానికి మిరపకాయ టపా పంపాలి. ఎల్లుండి గ్రామం నుంచి ఫారాస్టి ప్రయాణమవుతాడు. అంతవరకూ మాట రాకుండా చూసుకోవాలి. అతడికి సదుపాయాల ఆలోచనలతో తన గుడిసెలోకి ప్రవేశించాడు సావోతా జామిరి కోదు.

## 3

విసుగు చెందని సూరీడు ఎప్పటిలా ఆకాశంలోకి చొచ్చుకురాసాగాడు. వెండి జలతారు వంటి కిరణాలు భూమిని తాకాయి. ఆ కిరణాలను అడ్డుకుంటున్న పర్వతాన్ని నిస్సహాయస్థితిలోకి నెడుతూ మరింతగా ఎగబాకిన సూరీడు, పర్వతం వెనుకవున్న డోక్రీబేడా గ్రామంపైనా వెలుగు వెదజల్లేడు.



ఆ సమయానికి అడవి నిశ్శబ్దంగా వుంది. అంతవరకూ ప్రకృతిని చుట్టేసిన మంచు అదృశ్యమై ఆ స్థానాన్ని ఎండ ఆక్రమించుకుంది. నిరంతరం జరిగే ఆ చర్యని గమనించిన వృక్షాలు మౌనంగా నిలుచున్నాయి. రాత్రి ఉధృతంగా వీచిన చలిగాలి ఎటుపోయిందో అంతు చిక్కడం లేదు. ప్రకృతి మాత విశ్వరూపం తిలకించడానికి వీలుగా సూర్యకాంతి అడవిలోకి చొచ్చుకుపోతున్నది.

దట్టమైన తుప్పల వెనుక నుంచి అలవాటుగా బయటకొచ్చింది అడవి కోడి ఒకటి. ఆ తుప్పల ముందున్న కొద్దిపాటి జాగాలో చాలా సార్లు తిన్న ఆహారం కనబడటంతో జాగ్రత్తలన్నీ గాలికొదిలేసి చిన్నగా అరుస్తూ కదిలింది. దాని అరుపుకి మరికొన్ని కోళ్ళు బయటకొచ్చాయి. క్రమంగా అక్కడొక పెద్ద గుంపు తయారయింది. తొందరగా ఆహారం చేజిక్కించుకోవాలని చోడిగింజల్ని చకచకా ముక్కుతో అందుకుంటూ అటు ఇటు కదులుతున్నాయి అడవి కోళ్ళు.

అడవి కోళ్ళు చాలా చురుకైనవి, బలమైనవి. జుట్టు కారునలుపైతే శరీరం ఓ మాదిరి నలుపు. అడవుల్లో జీవించే కోదులు కూడా వాటిని పట్టుకోలేరు. శత్రువుని పసిగట్టిన మరుక్షణం ఒక్కసారిగా గాలిలోకి లేచి తుప్పల మీద వాలి చూస్తుండగానే మటుమాయమవుతాయి. నేల మీద పరిగెత్తే అలవాటు వాటికి ఉండదు. మనుషులు చొరబడలేని దట్టమైన తుప్పల్లో నివాసమేర్పర్చుకుని గుడ్లు పెట్టి పొదుగుతాయి. ప్రకృతి వైపరీత్యాలు తట్టుకుని బతికేవి స్వల్పం. తెలివితో వేటాడాలి

తప్ప వాటిముందు కండబలం పనికిరాదు.

అసహనంగా కదిలాడు ఫారాస్టి.

రాళ్ళ వెనుక అనుచరులతో పాటు మోహరించి కూర్చుని ఉన్నాడు. అక్కడ కొచ్చి రెండు గంటలు దాటడం వల్ల అసహనం చోటుచేసుకుంది. వేటగాడికి ఓర్పు, సహనం అవసరం. ఆ విషయం తెలిసిన వాడు కనుకనే తన భారీ కాయం రాళ్ల వెనుక వుంచగలిగాడు. అడవి కోడి మాంసం గుర్తొస్తే అతని నోట్లో లాలాజలం వూరుతుంది. జీలుగు కల్లు తాగుతూ, నిప్పుల మీద దోరగా కాల్చిన అడవి కోడిని నంజుకుంటుంటే తన కాయం రెండింతలైనా పట్టించుకోడు.

అదే సమయంలో ఒక కోడి తుప్పల్లోంచి బయటకు రావడం గమనించి ఫారాస్టిలో ఉత్సాహం కలిగింది. ఆ కోడి చిన్నగా అరవడంతో మరి కొన్ని కోళ్ళు బయటకొచ్చాయి. ఫారాస్టి మొహం సంతోషంతో విప్పారింది. అప్రయత్నంగా తుపాకి పైకి లేపి గొట్టం రాయి మీద ఆనించాడు. తల వంచి గురి చూసి పేల్చాడు.

"ఢాం..."

ఆ శబ్దం వెలువడిన మరుక్షణం గుంపుగా మేస్తున్న కోళ్ళు ఒక్కసారిగా ఆకాశంలోకి లేచాయి. రవ్వల దెబ్బతిన్న కోళ్ళు నేల కూలితే మిగతావి ఎగిరిపోయాయి. ఒక కోడి ఎగిరే ప్రయత్నంలో పైకి లేచి కిందపడి, మరోసారి ప్రయత్నించి సాధ్యం కాక ఓ తుప్ప వెనక్కి పాకి నక్కింది.

ఫారాస్టి వెంటవున్న సిబ్బంది అటు పరిగెత్తి కోళ్లను ఒడిసి పట్టుకున్నారు. చాలా కోళ్ళు ప్రాణాలతో వున్నాయి. తమని పట్టుకున్న మనుషుల వైపు వాటి కళ్ళు భయంగా చూస్తున్నాయి.

కర్రకి రెండువైపులా కోళ్ళు కట్టి అక్కడ నుంచి బయలుదేరారు. వేట సక్రమంగా పూర్తయినందుకు సంతోషపడ్డాడు సాహేతా. కాళ్ళు కర్రకి కట్టడంవల్ల కోళ్ళ తలలు క్రిందకు వేలాడుతున్నాయి. తమని పట్టుకున్నందుకో లేక శరీరాలకు రవ్వలు చేసిన గాయాలు బాధపెడుతున్నందుకో కోళ్ళు అరుస్తున్నాయి. గాయాల నుంచి రక్తం కారి నేల మీద పడుతోంది.

* * *

ఒక కోడిని శుభ్రం చేసి నూనె, పసుపు, కారం రాసి నిప్పుల మీద జాగ్రత్తగా కాల్చాడు సాహు. కల్లు తాగుతూ ఆ కోడిని అల్పాహారంలా తినేసాడు ఫారాస్టి. మధ్యాహ్నం భోజనంతోపాటు మరో రెండు కోళ్ళ కూర లాగించాడు. వెంటనే మంచం పైన వాలిపోయాడు. కాసేపటికి ఆ పాక నుంచి పెద్ద గురక బయటకు వినిపించసాగింది.

వంట చేసిన సాహు పాకలోకి వచ్చి గురక పెడుతున్న ఫారాస్టిని చూసి తృప్తిగా నిట్టూర్చాడు. తాగి రాత్రి తనేం పేలాడో ఉదయం మిగతా వాళ్ళు చెప్పారతనికి. దానితో మతిపోయి దిగులు ఆవరించింది. ఫారాస్టిని మంచి చేసుకుంటే తప్ప మనుగడ సాగదని గ్రహించి వంట పని చేపట్టాడు. నిప్పుల మీద కాల్చాల్సిన కోడిని పట్టుకొని రెండుసార్లు హడావిడిగా ఫారాస్టి ముందునుంచి తిరిగాడు. వంటచేస్తూ సామాన్లు పట్టుకురమ్మని, ఆలస్యమైతే దొరగారికి కోపం వస్తుందని హెచ్చరించాడు. సాయం చేస్తున్న వృద్ధ కోదుని. వినయవిధేయతలు, సేవాభావం రాత్రి తను చేసిన నేరం నుండి తప్పిస్తాయని అతని ఉద్దేశ్యం.

ఆ చేష్టలు గమనించి మనసులోనే నవ్వుకున్నాడు ఫారాస్టి.

రాత్రి జరిగిన సంఘటన తీవ్రమైందిగా పరిగణించలేదతను. పరిగణించలేదంటే నిజంగా పట్టించుకోలేదని కాదు, అలా నటిస్తున్నాడంతే! నిజం చెప్పాలంటే, సాహూ మాటలు గుండెల్లో నిప్పు రాజేసాయి. అయితే పదేపదే ఆ మాటలు గుర్తుచేసుకోవడం వల్ల నష్టం తప్ప లాభం లేదని అను

భవజ్ఞుడైన అతను గ్రహించాడు. అందుకే ఏమీ జరగనట్టు వున్నాడు. సాహూ మరిం తగా భయభక్తులతో పని చేయ్యాలంటే అదే మంచి మార్గం.

తనెలా స్పందిస్తాడో తెలియక మతిపో తుంది వాడికి. ఆ అంచనాని నిజం చేస్తూ వంట పని చేపట్టి చేస్తున్న సందడి గమ నించి నవ్వుకుని, సాహూ చేసిన వంటకాలు పొట్టనిండా కూరి కూరి నిద్రలోకి జారి పోయి గుర్రుపెడుతున్నాడు.

గురక వినిపించిన మరుక్షణం రచ్చబండ వద్దకు వెళ్లాడు సాహోతా. అప్ప టికే అక్కడ వున్న గ్రామస్థులతో మంతనాలు ప్రారంభించాడు. కష్టం వస్తోందని తెలిసినా దాని తీవ్రత ఎవరూ అంచనా కట్టలేక పోయారు. ఎలాంటి కష్టం వచ్చినా అందరూ సమానంగా భరించాలని తీర్మానించారు.

తుఫానుకి జంకని కోదు, అధి కార్ల ఆగమనం తుఫానుకంటే తీవ్రమైనదని - అప్పుడు జరిగే నష్టం నుంచి తేరుకోవడం కష్టమని తలుస్తాడు. ఈ భావన ఈ నాటిది కాదు. తరతరాల నుండి వెన్నాడుతున్నది.

గ్రామానికి కుడివైపు వున్న కొండని సూర్యుడు సమీపిస్తున్నప్పుడు నిద్రలేచాడు ఫారాస్టి. చెట్ల కింద కాలక్షేపం చేస్తున్న గార్డులు హడావిడిగా కదిలారు. గ్రామం లోని మగవాళ్ళని శుచిగా స్నానాలు చేసి రమ్మని ఉత్తర్వులు జారీ చేశాడు ఫారాస్టి. అలా ఎందుకు చెయ్యమన్నాడో తెలి యకపోయినా అందరూ గెడ్డకెళ్ళి స్నానం చేసి వచ్చారు.

ఫారాస్టి గ్రామం చివర వున్న వనదేవత గుడిదగ్గర కుర్చీ వేసుకుని కూర్చున్నాడు.

కోదులు నేరస్తుల్లా అతని ముందు నిలు చున్నారు. తాము భయపడిన ఘడియ వచ్చిందని గ్రహించడం వల్ల వారి ముఖాల్లో దిగులు చోటుచేసుకుంది.

ఒక కోదుని దగ్గరకు పిలిచాడు ఫారాస్టి.

"వనదేవత మీద ఒట్టేసి ఎంత అడవి నరి కావో, ఎన్ని చెట్లు తెగేసి సంతలో అమ్ముకు న్నావో సెప్పు" ఆ కోదు కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగాడు.

ఆ మనిషి శరీరం గజగజా వణకడం మొదలెట్టింది. అప్పటికప్పుడు శరీరం చెమ టతో నిండిపోయింది.

"నీ బిడ్డలం... దయ సూపు దొరా..." కీచుగా అన్నాడతను.



**అంతవరకూ విడి పించుకోవడానికి గింజుకున్న అతను, చెయ్యి దేవత తలని తాకిన మరుక్షణం కదలకుండా నిటారుగా ఉండిపోయాడు. అతని కళ్ళు తదేకంగా దేవతనే చూస్తున్నాయి**

"వనదేవత శక్తిగల తల్లి... అబద్ధం సెప్పిన మనిషిని నిలువునా తినేస్తుంది. తన ఎర్రటి కళ్ళతో నిన్ను సూస్తోంది సూడు" మంద్ర స్వరంతో అన్నాడు ఫారాస్టి.

"రక్షించు దొరా! పేదోళ్ళం. గడ్డి తిని బతి కేటోళ్ళం. నీ సేవ చేస్తే తప్ప మాకు బతుకు లేదు" దీనంగా వేడుకున్నాడా కోదు.

ఫారాస్టి సైగందుకుని ఇద్దరు గార్డులు ఆ కోదును పట్టుకుని లాక్కెళ్ళి కుడిచేతిని దేవత తల మీద వుంచారు. అంతవరకూ విడిపించుకోవడానికి గింజుకున్న అతను, చెయ్యి దేవత తలని తాకిన మరుక్షణం కద లకుండా నిటారుగా వుండిపోయాడు. అతని కళ్ళు తదేకంగా దేవతనే చూస్తున్నాయి.

హఠాత్తుగా ఆ కోదు పెదాలు విడిప డ్డాయి.

"కొండెనక ఎకరం బాగు సేసి చోడి సేను, గెడ్డ పక్క రెండెకరాలు కంది సేను" వరు

సగా సంవత్సరం పొడవునా చేసిన పనులు చెప్పాడు.

ఫారాస్టి చురుగ్గా కాగితం మీద రాసుకున్నాడు.

ఒక్కొక్కరు దేవత మీద ఒట్టేసి ఎంత భూమి దున్నిందీ, ఎన్నిచెట్లు నరికిందీ, వేటకెళ్ళి ఏపే జంతువులు చంపిందీ వివరంగా చెప్పారు.

సూర్యుడు అస్తమించకముందే ఆ తతంగం పూర్తయింది. మొత్తం తిరిగి వ్యవసాయం కోసం నరికిన అడవి గుర్తుపట్టి కొలిచి రాసుకోవాల్సిన పని నిముషాల్లో ముగిసిపోయింది.

ఎవరు ఎంత చెల్లించాలో లెక్కలు వేసి చెప్పాడు ఫారాస్టి. కోదులు కాళ్ళ మీదపడి ఎంత వేడుకున్నా చలించలేదతను, చలిస్తే రూపాయి దక్కదని అతనికి తెలుసును.

ఇంట్లోని పొయ్యి వెనుక గోతిలో దాచుకున్న రూపాయలు బయటకు తీశారు కోదులు. అది వారికి లక్ష్మి స్థానం.



ఆరు పాయలు తీసుకెళ్ళి ఫారాస్టి దోసిళ్లలో పోశారు. తమలో అజ్ఞానం, చీకటి నెలకొని వున్నదని కోదులు ఎప్పుడూ అనుకోలేదు.

అలాంటి అమాయకుల పట్ల సానుభూతితో సహాయపడే ఓ వ్యక్తి అప్పటికే భారతదేశం వచ్చాడు. ఆ విషయం అతనికి కూడా తెలియదు.

## 4

"బాబూ! ఫాదరీ బాబూ. నా కొడుకుని రక్షించు బాబూ! ఈ దీనురాలిని ఆదుకో తండ్రీ! నువ్వు తప్ప మాకు దిక్కెవరూ లేరయ్యా"

చర్చి పక్క ఇంటి ముందు మోకరించి కూర్చున్న వృద్ధ స్త్రీ ఒకామె హృదయ విదారకంగా మొరపెట్టుకుంది. అర్ధరాత్రి చిక్కగా అలుముకున్న నిశీథిలో నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ మారుమోగింది ఆమె గొంతు.

"ప్రార్థనకి ప్రభువు కరుణించి కష్టాలు

తీరుస్తాడని చెప్పావు. నాచేత చాలా రోజుల నుంచి ప్రార్థనలు చేయిస్తున్నావు. నే ప్రభువుని నమ్ముకున్నాను. ఈ ముసిల్ది ప్రాధేయపడుతున్నా వినకుండా నా కొడుకుని బలవంతంగా తీసుకుపోయారు. కాళ్ళ మీద పడితే విసిరి కొట్టారు నన్ను. ప్రభువు ప్రమేయం లేకుండా ఇదంతా జరిగిందా? ఏసుని నమ్మి నిత్యం బైబిలు చదివితే కష్టాలు తొలగిపోతాయని నమ్మబలికావు."

తలుపు తెరుచుకున్న చప్పుడు విని, గుమ్మం అవతల నిటారుగా నిలబడిన వ్యక్తిని చూసి ప్రవాహంలా సాగుతున్న మాటల్ని అప్రయత్నంగా ఆపేసిందా స్త్రీ.

"ఏమైందమ్మా?" శాంత గంభీర స్వరంతో ప్రశ్నించాడతను. అతను తెల్లటి దుస్తుల్లో మల్లెపువ్వులా వున్నాడు. ఎలాంటి పరిస్థితిలోనైనా చెక్కుచెదరనట్టుంది



స్వరం.

"నిద్రపోతున్న నా కొడుకుని బలవంతంగా సిపాయిలు లాక్కుపోయారు. ఫాదరీ బాబూ! గ్రామం దాటి ఎన్నడూ బయటికి పోని నా కొడుకు ప్రభుత్వాన్ని కూలదోసే పనులు చేస్తున్నాడట. ఇరవై సంవత్సరాలు వచ్చినా నేను ప్రక్కన లేకపోతే సరిగ్గా అన్నం తినడం తెలియనివాడు అటువంటి పనులు చేస్తాడంటే ఎలా నమ్మడం? వాడు లేకపోతే నేనెందుకు బతకడం?" ఆవేదనగా అందామె.

"అలా కూర్చుని కాస్త స్థిమిత పడు తల్లీ" అన్నాడు ఫాదర్.

ఆమె ఇంటి అరుగు మీద కూర్చుంది. ఫాదర్ ఇంట్లోకి వెళ్లి చెంబుతో మంచినీళ్లు తెచ్చి ఆమెకిచ్చాడు. ఆమె నీళ్లు గడగడా తాగి మిగిలిన వాటితో ముఖం తడుపుకుంది.

"వాడు తప్ప నాకెవరూ లేరు ఫాదరీ బాబూ! రెండేళ్ళ క్రితం నా పెనిమిటి పట్నం వెళ్ళి స్వాతంత్ర్య సమర ఉద్యమకారుల మీద బ్రిటిష్ సిపాయిలు జరిపిన కాల్పుల్లో చనిపోయాడు" ఆమె స్వరం గద్గదమైంది.

రెండు క్షణాలు ఆగి అంది.

"... ఇప్పుడు వీణ్ణి సిపాయిలు బలవం

తంగా లాక్కుపోయారు. నా కుటుంబం మీద ప్రభువు పగబట్టాడు ఫాదరీ బాబూ! లేకపోతే ఇలాంటి ఘోరాలు జరగవు. నా గుండె పగిలిపోకుండా వుండాలంటే నా బిడ్డ డికి మీరు ప్రాణభిక్ష పెట్టాలి" దుఃఖం తన్నుకొచ్చి గొంతు పూడుకుపోయింది.

ఫాదర్ బాధగా నిట్టూర్చాడు.

స్వాతంత్ర్య ఉద్యమకారుల్ని అణిచివేయ డానికి ప్రభుత్వం తీవ్రమైన చర్యలు చేప ట్టింది. అందులో సామాన్యులు కూడా చిక్కుకుని బలవుతున్నారు. ఈ వ్యవహా రంలో సత్యం ఏమిటో తెలుసుకునే వీలు లేకుండా పోతోంది. ప్రజల్ని భయపెట్టి, బాధపెట్టి ఉద్యమం అణిచివేయడం సాధ్యమో, కాదో తెలియదు కాని అధికారుల దౌర్జన్యాలు ప్రజల్ని ప్రభుత్వానికి దూరం చేస్తున్నాయి. ఎదురుగా కూర్చున్న ఆ స్త్రీ మనసులో ఉద్భవించిన ప్రభుత్వ వ్యతిరేక భావం మరికొందర్ని ప్రభావితం చేసే అవ కాశం వుంది. తమని పరాయివాడు పాలి స్తున్నాడనే భావన అధికమవుతుంది. ఇప్పుడు ఈమెకి సాయం చెయ్యకపోతే చర్చిని కూడా దూషిస్తుంది. కష్టంలో వున్న వాడు భగవంతుణ్ణి కూడా లెక్కచెయ్యడు.

ఫాదర్ ఆలోచనల నుండి తేరుకుని అడి గాడు,

"నీ కుమారుడ్ని ఎక్కడికి తీసుకెళ్ళా రమ్మా? "

"పోలీసు ఠాణాకి..."

"దేనికి? " అడిగి, ఆ ప్రశ్నకి సమాధానం ఆమెకంటే తనే స్పష్టంగా చెప్పగలనని స్ఫురించి, జవాబు చెప్పే అవకాశం ఇవ్వ కుండా అన్నాడు.

"పద... వెళదాం..."

ఇద్దరూ చీకట్లో ఠాణా చేరుకునేసరికి అక్కడ హడావిడిగా వుంది. ఎప్పుడూ రాత్రి వేళ చీకటి రాజ్యం చేసే ఠాణాలో నూనె దీపాలు వెలుగుతున్నాయి. ఠాణా ముందున్న వ్యానులో నిండుగా మనుషులు న్నట్టు అస్పష్టంగా మాత్రమే తెలుస్తోంది. సిపాయిలు వ్యాను చుట్టూ నిలుచుని కాపలా కాస్తున్నారు.

ఠాణా ఉద్యోగి ఒకతను ఫాదర్ని గుర్తు పట్టి నమస్కరించాడు. బదులుగా నమ స్కారం చేసి అడిగాడు ఫాదర్.

"లోపల ఎవరున్నారు? "

"సర్కిల్ సాబ్ వున్నారు"

"నేనొచ్చానని వారికి మనవి చెయ్యి"

అతను లోపలికి వెళ్ళి వెంటనే బయటకొ చ్చాడు.

"ఫాదర్! మిమ్మల్ని రమ్మంటున్నారు" చెప్పాడు.

తన గౌను సవరించుకుంటూ లోపలికి వెళ్ళాడు ఫాదర్.

ఆ స్త్రీ అప్రయత్నంగా క్రీనీడలోకి జరి గింది. ఆమె గుండెలు భయంతో వేగంగా కొట్టుకుంటున్నాయి. జీవితంలో మొదటి సారి ఠాణా సమీపానికి వచ్చింది. కొడుకు కోసం ఫాదర్ వెంట ఆతృతగా వచ్చింది కానీ, లేకపోతే కలలో కూడా అటు వెళ్ళా లని అనుకోదు. ఠాణాకి అధికారులు వచ్చిన పుడు సిపాయిలు గ్రామం మీద పడి కోడి పెట్టలను, ఇతర వస్తువుల్ని బలవంతంగా పట్టుకుపోవడం చూసింది. ఒంటరిగా స్త్రీలు కనిపిస్తే వదలరని చెప్పుకుంటూ వుంటారు.

భయాన్ని అణుచుకుని వ్యాను వైపు చూసిందామె. లోపల వున్న మనుషుల్లో తన కొడుకు ఉండొచ్చుననే ఆలోచన వచ్చింది. వ్యాను వద్దకు వెళ్ళి ఆ విషయం రూఢి చేసుకోవాలనే కోరిక పుట్టింది. చుట్టూ వున్న సిపాయిల్ని గమనించి కదల కుండా వుండిపోయింది.

వారిది వ్యవసాయదారుల కుటుంబం. ఆమె కాపురానికొచ్చి ఇరవై సంవత్సరాలు దాటింది. ఒక్కడే కొడుకు కావడం వల్ల అల్లారు ముద్దుగా పెంచింది. చాలామంది ఆడవారికి మల్లే తమని పరిపాలిస్తున్న వారి గురించి తెలియదామెకు. పట్టణంలో విద్యు

ద్దీపాలు వెలగడం చూశామని చెబితే ఆశ్చర్యంగా వినేది. మోహన్ దాస్ కరమ్‌చంద్ గాంధీ గురించి చాలా సార్లు భర్త చెప్పేడు. దేశాన్ని పరాయి మూకలు పాలిస్తున్నాయని, వారి చేతుల్లోంచి దేశానికి విముక్తి కలిగించాలని కూడా అతను చెప్పేవాడు.

ఎక్కడెక్కడో తిరిగి అలిసి ఇంటికొచ్చే భర్త ఓసారి టౌనులో జరుగుతున్న సమావేశానికి వెళ్లి ఇంటికి రాలేదు. సిపాయిల కాల్పుల్లో భర్త మరణించాడని తెలిసినప్పుడు నమ్మలేదు. కానీ అది పచ్చినిజమని నిర్జీవ దేహం చూసి గ్రహించి నిలువునా కూలిపోయింది. ఇప్పుడు కొడుకుని బలవంతంగా తీసుకుపోతుంటే తట్టుకోలేకపోయింది. సమయానికి గుర్తొచ్చిన ఫాదర్ సాండర్స్ దగ్గరకు సహాయం కోసం వచ్చింది.

అతను కూడా బ్రిటిష్ వాడేనని ఆమెకి తెలియదు. చర్చిలో ప్రార్థనలు నిర్వహించి హితోపదేశం చేసే ఫాదర్ తన బిడ్డని రక్షిస్తాడని తలపోసింది.

"రామయ్య అనే యువకుడ్ని బయటకు తీసుకురండి" గంభీరమైన కంఠం వినిపించింది.

ఆమె ఉలిక్కిపడి వాస్తవ ప్రపంచంలో పడింది.

ఠాణా ముందు సర్కిల్‌తోపాటు ఫాదర్ కనిపించారు. వాళ్ళిద్దరూ లోపల నుంచి బయటకొచ్చారని గ్రహించి ఆమె ఇంకొంచెం వెనక్కి జరిగింది.

సిపాయిలు బూట్లు శబ్దం చేసుకుంటూ వెళ్ళి వ్యాను నుంచి రామయ్యని తీసుకొచ్చి సర్కిల్ ముందు నిలబెట్టారు. అతనికి ఇరవై సంవత్సరాలు ఉంటుంది వయసు.

"నీ పేరు? " సర్కిల్ అడిగాడు.

"కంది రామయ్య"

"నీ తండ్రి సోమయ్య ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమకారులతో చేరి కాల్పుల్లో చచ్చిపోయాడు. అతని కొడుకువైన నువ్వు ఊరు చివర యువకుల్ని పోగేసి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నావట. నీలాంటి వారిని కనిపెట్టడానికి ప్రతీ గ్రామంలో మాకు అనుచరులు ఉన్నారు. నీ తరపున ఫాదర్ సాండర్స్ గట్టి హామీ ఇవ్వడం వల్ల మొదటి తప్పుగా ఎంచి విడిచి పెడుతున్నాను. బ్రిటిష్ సామ్రాజ్యంలో రవి అస్తమించదని గుర్తు పెట్టుకో. మరోసారి అదే తప్పు చేస్తే గ్రామం నడిబొడ్డున కట్టేసి నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను" కఠినంగా హెచ్చరించి, ఫాదర్ వైపు తిరిగి అన్నాడు.

"మీమీద గౌరవంతో విడిచి పెడుతున్నాను, తీసుకెళ్లండి. ప్రభుత్వానికి ఎదురు తిరిగే ప్రయత్నాలు మానుకోమని గ్రామస్థులకు చెప్పండి"

సర్కిల్‌కి కృతజ్ఞతలు తెలియజేసి, రామయ్యని వెంట పెట్టుకుని అక్కడ నుంచి ఫాదర్ కదిలాడు.

**ఫాదర్ సాండర్స్ గట్టి హామీ ఇవ్వడం వల్ల మొదటి తప్పుగా ఎంచి విడిచి పెడుతున్నాను. బ్రిటిష్ సామ్రాజ్యంలో రవి అస్తమించదని గుర్తు పెట్టుకో. మరోసారి అదే తప్పు చేస్తే గ్రామం నడిబొడ్డున కట్టేసి నిర్దాక్షిణ్యంగా కాల్చేస్తాను**

సర్కిల్ లోపలికి వెళ్ళేవరకూ ఆగి క్రీనీడలో నిలుచున్న రామయ్య తల్లి ముందు వెళుతున్న వారిని అనుసరించింది.

చీకటి వారిని తన కడుపులో దాచుకుంది.

* * *

డియర్:

జీవితం నన్ను కష్టపెడుతోంది.

నిత్యం భక్తి శ్రద్ధలతో ప్రభువుని ప్రార్థిస్తున్నా జీవితం ఇలా ఎందుకుంటున్నదో నాకర్థం కావడం లేదు. తీవ్రంగా ఆలోచించిన మీదట నా హృదయంలో ఎక్కడో అసంతృప్తి చోటుచేసుకుందని గుర్తించాను. నువ్వు నాకు దూరం కావడం వల్ల వచ్చిన అసంతృప్తిలాంటిది కాదిది. ప్రభువు సందేశం దీనజనులకు అందించాలని ఈ మార్గం ఎంచుకుని తప్పు చేశానేమోననే సందేహం కారణంగా వచ్చిన అసంతృప్తి.

పది మందికి ఉపయోగపడేటట్టు జీవించడం కంటే ఒక చట్రంలో ఇరుక్కుపోయి చర్చికొచ్చిన వారితో ప్రార్థన చేయించడం, మత దీక్ష ఇవ్వడం గొప్ప విషయాలా? నేను చూస్తున్న పేదల బతుకులు ఇలాంటి అనుమానాలెన్నో కలిగిస్తున్నాయి. నాలోని ఈ పరిణామం నిన్ను ఆశ్చర్యంలో ముంచవచ్చు. ఇదంతా సత్యాన్వేషణలో ఓ భాగమని గ్రహించు.

రోజూ చేసే ప్రార్థనలు, బైబిల్ చదవడం వంటివి నా సందేహాలకి జవాబు చెప్పడం లేదు. మనకి ఒక్కడే ప్రభువు. ఇక్కడి ప్రజలకి ఎందరో దేవుళ్ళు, మరెందరో దేవతలు ఉన్నారు. వీరంతా నిత్యం పూజలందుకుంటున్నారు. అయినా మనిషిని కష్టాలు వదలడం లేదు.

ఎందుకని?

ఈ ప్రశ్నకి జవాబు తెలుసుకోవాలని నేను చేసిన ప్రయత్నాలు ఫలించడం లేదు. ప్రభువుని నమ్మినవారికి, దేవుళ్లను పూజిస్తున్న వారికి కూడా ఒక్కలాంటి సమస్యలే కలుగుతున్నాయి. దీనికి కారణం ఏమిటో నాకు బోధపడలేదు. ప్రభువు... ముక్కోటి దేవతలూ కూడబలుక్కుని మనిషిపైన కక్ష గట్టారా?

ఇది చాలా చిక్కు ప్రశ్న. వివేచన గలవారికి ఇటువంటి చిక్కు



ప్రశ్నలు కలుగుతాయి. ఆలోచనకి తావు లేకుండా తనకొచ్చిన కష్టాలు కర్మాను సారం వస్తున్నాయని సరిపెట్టు కుంటే ఎలాంటి ఇబ్బంది ఉండదు. నేను మాత్రం అదే ఆత్మవంచన అనుకుంటు న్నాను. మానవ మేథస్సుకి అందని సత్యం ఏదో ఉంది. అది ప్రకృతిలోనే దాగి ఉంది. నేను తెలుసుకో వాలనుకుంటున్నది ఆ సత్యాన్నే.



ఈ విషయాలు నన్ను కలచివేయ డానికి ఓ కారణముంది.

కొద్ది రోజుల క్రితం తన కుమారుణ్ణి రక్షిం చమని అర్ధరాత్రి వచ్చి ఓ స్త్రీ వేడుకుంది. అది నా శక్తికి మించిన పనే అయినా చెయ్యక తప్పలేదు. మరునాడు ఆమె కొడు కుతో పాటు చర్చికి వచ్చినప్పుడు నాకు సంతోషం కలిగింది. అంతే కాదు, మనస్సుకి ప్రశాంతతా చిక్కింది. సాటివాడికి సాయప డితే, దైవ సన్నిధి ఇవ్వలేని స్వాంతన పొందవచ్చునని ఈ సంఘటన తెలియజే సింది నాకు.

ఇది నాకు కొత్త అనుభవం.

అందుకే ప్రజలతో నేరుగా సంబంధాలు పెట్టుకుని వారికి సహాయపడాలని నిశ్చ యించుకున్నాను. నిన్ననే ఓ ఉద్యోగానికి అర్జీ పంపాను. నా ప్రయత్నం విజయ వంతం కావాలని ప్రభువుని వేడుకో.

ఎల్లప్పుడూ నీ ప్రేమ పొందాలని తపించే-

నీ సాండర్స్.

ఉత్తరం రాయడం ముగించి వెనక్కి వాలాడతను. మనసులోని భావాలు కాగితం మీద పెట్టాక గుండె బరువు దిగి పోయి తేలిక పడింది. కళ్ళు మూసుకునేస రికి భార్య రూపం ప్రత్యక్షమయింది- మస్తిష్క పటం మీద.

అతని బాధ అర్థం చేసుకున్నట్టు దయగా చూస్తోంది భార్య రూపం.

## 5

వానాకాలం ప్రారం భమై అడవి తల్లి పులకించి పోతోంది. ఆకాశంలో మేఘాలు దట్టంగా అలుముకుని భూమాతకి నీడ పట్టి నట్టు వెలుగు అదృశ్య మైంది. చల్లటి గాలులు వీచడం మొదలై చినుకులు పడుతు న్నాయి. పిల్లలు ఆకాశం వైపు చూస్తూ తమ ఆనందం వ్యక్తం చేస్తూ గెంతుతున్నారు.

ఎండకి వేడెక్కిన భూమి చినుకులు పడ టంతో వెచ్చటి ఆవిర్లు వెలువరించసాగింది. క్రమంగా వర్షం పెద్దదై నేల బురదగా మారి పిల్లలు గుడిసెల్లోకి జొరబడ్డారు. అప్పటికే గుడిసెలకు చేరిన గ్రామస్థులు గుమ్మాల్లో కూర్చుని వర్షాన్ని చూస్తున్నారు. అందరి కళ్లల్లో ఒకే రకం సంతోషం వ్యక్త మవుతోంది.

గ్రామ పూజారి ఆకాశంలో ఏ నక్షత్రాలు చూసి నిర్ణయించాడో తెలియదు కానీ, రెండు దినాల్లో వర్షం పడుతుందని, గెడ్డ నీటితో పొంగుతుందని వారికి ముందే చెప్పాడు.

వర్షం పడితే కోదులకు చేతినిండా పని. మొదట నక్షత్ర యోగం చూసి భూదేవి పండుగ చెయ్యాలి. ఆ తరువాత ముహూ ర్తం నిర్ణయించి అందరూ ఒకేసారి భూమి దున్నాలి. వీటన్నిటికంటే ముందు వ్యవ సాయ పనిముట్లు బాగుచేసుకోవాలి. అవస రమైతే సంతకు పోయి ఎడ్లు కొని తీసుకు రావాలి. ఊపిరి సలపనంత పని.

వర్షం కోదులకు సంతోషం కలిగిస్తుంది. సమృద్ధిగా వర్షం పడితే పంటలు పుష్క లంగా పండుతాయని వారికి తెలుసు.

అంతే కాదు, ఇప్పుడే మరో ప్రమాదం పొంచి ఉంటుందని కూడా ఎరుగుదురు.

ఊరికి దూరంగా పొలాలు దున్నుతారు కోదులు. మాటువేసి వారి కదలికలు పసిగట్టి ఎత్తుకుపోతుంది పులి. ఒకసారి అలా ఎత్తుకుపోయాక అలవాటు పడి తరుచుగా మనుషుల మీద దాడి చేస్తుంది. ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ప్రమాదం తొలగిపోదు.

వానాకాలం, చలికాలం ఇలాంటి ప్రమాదాలు ఎక్కువగా జరుగుతాయి. మనిషిని పులి ఎత్తుకుపోయిన కొన్నాళ్లకి ఎక్కడో రాయి వెనుకా, తుప్పల మాటునా చిరిగి పేలికలైన గుడ్డలూ, ఎముకల పోగూ కనిపిస్తాయి. అవి చూసి విచారంగా నిట్టూరుస్తారు. అంతటితో ఏమీ చెయ్యకుండా వూరుకుండిపోతారని కాదు. అది మనసులో పెట్టుకుని ప్రతీకారంతో రగిలిపోతారు.

ఎండాకాలం ప్రారంభానికి ముందు వేట కోసం ఏర్పాట్లు చేసుకుంటారు. ఈటెలు, నాటు తుపాకులు సిద్ధం చేస్తారు. కొన్నిచోట్ల వేళ్ళతోను, కుళ్ళబెట్టిన మాంసంతోనూ విషం తయారు చేసి బాణాల మొనలకు పూస్తారు. కొందరు ఉప్పు, మూత్రం, ఎండు చేపలు, మెంతులు మొదలైన వాటిని కలిపి ఒక దొన్నెలో పెడతారు. అది తినడానికి పులి వస్తుందని తలపండిన వారు భావిస్తారు.

ఇతర గ్రామాలకు పులి దాడి కబురు వెళుతుంది. ఆ గ్రామాల కోదులు పులి సంచరించిన గ్రామం చేరుకుంటారు. పులి దొరుకుతుందా లేదా అనే దాని గురించి ఆలోచించరు. వనదేవత కరుణిస్తే పులిని చంపుతారు. లేకపోతే దాన్ని మరో చోటుకి తరుముతారు. అంతా జట్లు జట్లుగా విడిపోయి అడవిలోని ప్రతి అణువు వదలకుండా గాలిస్తారు. ఒక గ్రామానికి కష్టం వచ్చినప్పుడు మిగతా గ్రామాలు ఆ కష్టం తొలగించడానికి కలిసికట్టుగా శాయశక్తులా ప్రయత్నిస్తాయి. గ్రామంలో మిగిలిపోయిన ముసలాళ్ళూ, పిల్లలూ అడవిలోంచి వినిపించే తుపాకి శబ్దం కోసం ఆశగా చూస్తుంటారు.

పులి వేటకి వెళ్ళిన వారికి రకరకాల జంతువులు తారస పడతాయి. అడుగుల గుర్తులు పసిగట్టి జంతువుని చంపుతారు. జంతువు చిక్కినప్పుడు అందరూ ఒక ప్రదేశం చేరుకుంటారు. అగ్గి ముట్టించి జంతువుని నిప్పులమీద కాలుస్తారు. కల్లు కుండలు, విప్ప సారా ముంతలు ప్రత్యక్షమవుతాయి. నాట్యం, పాటలు మొదలవుతాయి. కోదులకి నాట్యంతో విడదీయలేని బంధం. పడుచులు గెంతుతుంటే రవికెలు లేని పైట వెనుక రొమ్ములు లయబద్ధంగా కదులుతాయి.

పులి వేట పూర్తయ్యేసరికి కొన్ని జంటలు జత కలవడానికి తయారవుతాయి. మనసు పడిన యువకునితో వెళ్ళడానికి కోదు పడుచు సంకోచించదు. వాళ్ళ గ్రామం ఎంతదూరమైనా సరే జంకదు. అది కోదు దేశంలో ప్రధానమైన ఆచారం. పడుచు తరపు బంధువులకు కబురు వెళుతుంది. వాళ్ళు వస్తారు. సాంప్రదాయం ప్రకారం పెళ్ళి తంతు జరుపుతారు. కడుపు నిండుగా కల్లు, తినగలిగినంత మాంసం కావాలి. కోదు తన జీవితంలో జరుపుకునే ఏకైక శుభకార్యం పెళ్ళి కనుక దేనికీ లోటు రానివ్వడు- పెళ్ళి కొడుకు.

వర్షం తీవ్ర రూపం దాల్చింది.

మొహం మీద చినుకులు పడటంతో ఆలోచనల నుండి తెప్పరిల్లి వెనక్కి జరిగాడు జామిరి కోదు. గుమ్మంలో కూర్చుని ప్రతి ఏడూ వచ్చే వర్షం ఎప్పటిలా సంతోషం కలిగిస్తుంటే చూస్తూ ఉండిపోయాడతను. చుట్ట ముట్టించి గుండెల నిండుగా పొగ పీల్చాడు. చల్లటి వాతావరణంలో వెచ్చటి పొగ గుండెల్లో చేరి హుషారు కలిగించింది.

అతనికి దగ్గరగా పడుకుని ఉంది పెంపుడు కుక్క. చిన్నతనంలో తల్లి వెనుక

తిరగడం దానికి లీలగా గుర్తుంది. మొదటి సారి జామిరికోదు దగ్గరకు పిలిచి ప్రేమగా తల నిమరడం కుక్క ఇప్పటికీ మర్చిపో లేదు. ఆ నాటి నుండి జామిరికోదుని వద లకుండా తిరుగుతోంది. చిత్తకార్తెలో ఆడ కుక్కలవెంట తిరిగినప్పుడు కూడా యజ మాని మీద, ఇంటిమీద ఓ కన్నేసి ఉంచు తుంది. పని పూర్తి చేసుకుని యజమాని వద్దకు పరిగెడుతుంది. నిజం చెప్పాలంటే యజమాని మీద ప్రేమ రెట్టింపయ్యేది అప్పుడే!

జామిరికోదు ఏదైనా గ్రామం వెళ్ళి రెండు రోజులు రాకపోతే దానికి పిచ్చెత్తినట్లు ఉంటుంది. ప్రేమగా నిమిరి, ముద్దు చేసే యజమాని కనిపించకపోతే కుక్కకు తిండి సహించదు. ఊరు చివర అతను నడిచి వెళ్ళిన బాట చేరు కుని ఎదురు చూస్తుంది. చీకటి పడ్డాక ఇంటికొచ్చి చడీ చప్పుడు చెయ్యకుండా పడుకుంటుంది.

చీకట్లో ఎన్నో దృశ్యాలు చూసిన అనుభవముంది కుక్కకి. అర్ధరాత్రి యజమాని కదలిక గుర్తు పడుతుంది. యజమానురాలిని అడవికి తీసుకెళ్ళి అతడు ఆక్రమించుకో వడం ఎన్నోమార్లు చూసింది.

యజమాని పొలం పని చేస్తుంటే చెట్టు కింద పడుకుని జోగుతుంది. అయినా కూడా యజమాని కదలికలు ఎప్పటికప్పుడు కనిపెడుతుంది. ఒకసారి పొలంలో పని చేస్తున్న ఒక పడుచు జామిరి కోదుని రెచ్చ గొట్టింది. అతను లోయవైపు కదిలిన కొన్ని క్షణాలకు ఆ పడుచు అదే దారి పట్టింది. ఆ వ్యవహారం పసిగట్టి వారిని అనుసరించిందా కుక్క. లోయలో అడుగు వరకూ దిగింది. చెట్ల కొమ్మలు తప్పించుకుని చూస్తే సూర్యకాంతి పడుతున్న కొండరాయి మీద వారిద్దరూ కనిపించారు.

తుప్పల వెనుక ఆగిపోయి చూసింది కుక్క.

అప్పటికే జామిరికోదు నడుంపైనున్న గుడ్డ జారిపోయి వెనుక భాగం నగ్నంగా కనిపిస్తోంది. ఆ పడుచు వేసుకున్న లంగా మొల వరకూ పైకి జరిగి బలమైన కాళ్లు దర్శనమిస్తున్నాయి. కొండని ముక్కలు ముక్కలు చెయ్యడానికన్నట్టు జామిరికోదు కదులుతున్నాడు. కదిలినప్పుడల్లా అతడి కండరాలు మెలితిరుగుతున్నాయి.

అక్కడ నుంచి నిశ్శబ్దంగా వెనక్కి తిరిగి వచ్చి పొలంలో చెట్టు కింద పడుకుని కళ్ళు మూసుకుంది.

జామిరికోదు, అతని పెంపుడు కుక్క జ్ఞాపకాలతో నిమిత్తం లేనట్టు వర్షం ఆగ కుండా పడుతూనే ఉంది.



6

తెల్లవారుజామున నిద్ర లేచాడు ఫాదర్ సాండర్స్. ఎప్పటిలా చెక్క కుర్చీ బయట వేసుకుని కూర్చున్నాడు. ఇంటి చుట్టూ ప్రహరీ నడుమ రకరకాల మొక్కలు న్నాయి. ప్రహరీని ఆనుకుని ఉన్న చర్చిలోకి వెళ్లేందుకు చిన్న తలుపు ఉంది. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ప్రకృతిలోని చల్లదనం మనసుకి హాయి గొల్పుతోంది. రోడ్డు మీద ఎడ్లబండి వెళుతున్నట్టు గంటల చప్పుడు దూరం నుంచి వినవస్తోంది.

ఆ సమయంలో అక్కడ కూర్చుని ఆలో చించడం ఫాదర్ సాండర్స్‌కి ఎంతో ఇష్ట మైన దినచర్య. అప్పుడు ఎన్నో జ్ఞాపకాలు ఆయన మనసు పొరల్ని స్పృశించిపో తాయి. తెల్లవారితే శరీరాన్ని కప్పే గౌను, చెప్పే మాటలూ తనకు తానుగా ఆలోచించ డానికి ఎలాంటి అవకాశం ఇవ్వవు.

అసలు ఈ దేశంలోని ప్రజల్ని అర్థం చేసుకోవడానికి చాలా సమయం తీసుకున్నాడతను. ఇప్పటికీ వారి ఆచారాలు కొన్ని బోధ పరుచుకోలేక పోతున్నాడు. దేశం కాని దేశంలో రకరకాల భాషలు మాట్లాడే ప్రజల మధ్య జీవించాల్సి రావడం శాపమని భావించిన రోజులు గతించాయి.

సాండర్స్‌కి చిన్నతనం నుంచి భక్తి అధికం. అందుకే బైబిల్ ట్రైనింగ్ సెంటర్‌లో చేరాడు. అక్కడే ఫాదర్ అయ్యాడు. కొంత మందిని ఎన్నిక చేసి వివిధ దేశాలకు పంపే ప్రక్రియలో సాండర్స్‌ని భారతదేశం వెళ్లవలసిందిగా బైబిల్ ట్రైనింగ్ సెంటర్ ఆదేశించింది. ప్రభువు మీదున్న విశ్వాసంతో. భారతదేశం వచ్చాడతను.

బిషప్ ఆదేశానుసారం ఒక మారుమూల గ్రామంలో చర్చి నిర్మించే పని చేపట్టి ఆ పని పూర్తి చేశాడు. అక్కడే ఫాదర్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ ఉన్నాడు.

తల్లి తెలియకపోయినా తండ్రి మాత్రం గుర్తున్నాడు సాండర్స్‌కి. పాలు తాగే పసి దశలో తల్లి, యుక్త వయసులో తండ్రి కాలం చేశారు. తల్లి ప్రేమ తెలియకపోవడంతో కాబోలు జీవితంపట్ల అంతులేని మమకారం ఏర్పడింది. సాటి మనిషిని ప్రేమించడం, దీన జనులను చూసి కరిగి పోవటం అతని సహజ లక్షణాలయ్యాయి. అతను చదువుకుంటూన్నప్పుడు అతడికి ఎందరో సాయపడ్డారు. వారి రుణం ఇతరులకు సహాయపడటం ద్వారా తీర్చుకోవాలనేది సాండర్స్ ఉద్దేశ్యం.



నిర్మలమైన అతని హృదయం ఈ మధ్యనే పరిపరి విధాల ఆలోచించడం ప్రారంభించింది. ఒక్కొక్కసారి ప్రభువు పట్ల గాఢమైన విశ్వాసం కలిగితే, మరో సమయంలో తీవ్ర వ్యతిరేకత ఏర్పడుతోంది. అలాంటి పరిస్థితి కల్పించిన ఓ విచిత్ర వ్యక్తి నెల రోజుల క్రితం తారసపడ్డాడు.

అర్థరాత్రి చప్పుడయితే తలుపు తీశాడు సాండర్స్.

ఆ చిమ్మ చీకటిలో, మనుషులు సంచరించని సమయంలో- సాండర్స్ చేతిలోని నూనె దీపం వెలుగులో చిరిగిన దుస్తుల్లో ఒక వృద్ధుడు నిలుచుని ఉన్నాడు. అతని జుట్టు చింపిరిగా ఉంది. శరీరం ఎండిపోయి ఎముకల గూడులా కనిపిస్తోంది. అయినా కళ్ళు జ్వలిస్తున్నట్లు చూస్తున్నాయి. ఆకారం బికారిలా ఉన్నా నిలబడిన తీరు, నిశ్చలంగా చూస్తున్న కళ్లు - అతని మీద తేలిక భావం కలిగించడం లేదు.

"ఆకలి వేస్తోంది ఫాదర్" నెమ్మదిగా, స్పష్టంగా అన్నాడతను.

సాండర్స్ నొసలు ముడివడింది. రాత్రి పనిపిల్ల తయారు చేసిన నూకల గంజి తాగి తాను నిద్రకి ఉపక్రమిస్తాడు. మరునాడు ఆ పిల్ల వచ్చే వరకూ ఏమీ ముట్టుకోడు. అర్థరాత్రి తలుపు కొట్టి ఆకలేస్తోందంటే ఎవరికైనా ఏం పెట్టగలడు?

"నీ ఆకలి తీర్చడానికి నావద్ద ఆహారం లేదు" బదులిచ్చాడు సాండర్స్.

అదే సమాధానం ఆశించినవాడిలా నవ్వాడతను.



"ప్రభువు సందేశంతో మానవాళిని పాప విముక్తుల్ని చేస్తున్న ఫాదర్ గారూ... మీరు ఓ మనిషి ఆకలి తీర్చలేరా? మీ శక్తి అపరిమితమని జనులు నమ్ముతున్నారు... అది నిజం కాదా? ఆకలి వంటి సాధారణ లక్షణాలని జయించే శక్తి మీకు లేదా? "

అతని వైపు సూటిగా చూశాడు సాండర్స్.

"కష్టించి పని చేస్తే ఆహారం వస్తుంది" అన్నాడు కొద్ది క్షణాల తర్వాత.

అతను మరోసారి నవ్వాడు. ఆ మాటల్లోని అర్థం గ్రహించినట్టు.

"అంటే స్థిర చిత్తంలేని మనిషి మనసులోని అస్పష్ట భావాలను ఆధారం చేసుకుని భగవంతుని లీలలు వల్లిస్తారు తప్ప నిత్యం మనిషిని దహించివేసే ఆకలిని తొలగించలేరన్నమాట. ఎంత చిత్రం? " అన్నాడ

తను ఆశ్చర్యంగా.

కొన్ని క్షణాలు మౌనంగా ఉండిపోయాడు సాండర్స్. బికారిలా కనిపిస్తున్న అతను సామాన్యుడు కాదని తోచింది.

"ప్రభువు కుమారులమైన మనం ధర్మమార్గంలో జీవించాలి. బలహీన మనస్కుడైన మనిషి జీవించే క్రమంలో వ్యామోహాలకు లోనై ఎన్నో పాపాలు చేస్తాడు. అతను పాప విముక్తుడైతే తప్ప ప్రభువు వద్ద చోటు దొరకదు. అలాంటి వారిని సక్రమమార్గంలో పెట్టడానికి నేను ప్రార్థనలు నిర్వహిస్తాను. ఈ సమయంలో వచ్చి ఆకలి వేస్తుందని అడిగితే ఆహారం సృష్టించి ఇవ్వడానికి నా వద్ద మానవాతీత శక్తులు ఉండవు"

అతని పెదవుల మీద చిరునవ్వు చెరగ లేదు.

"గాలిలోంచి వస్తువులు సృష్టించి ఇచ్చేవాడు నా కింతవరకూ తారసపడలేదు. జనులు నీ గురించి గొప్పగా చెబుతుంటే ఆకలి తీర్చుకోవాలని వచ్చాను. ఓ పేద రైతు వద్దకు వెళ్ళి ఉంటే కాసిన్ని గింజలు ఉడికించి కడుపు నింపి ఉండేవాడు. అతనితో పోలిస్తే నువ్వు దయనీయ స్థితిలో ఉన్నావు. నిజం చెప్పాలంటే మనిషికి ముందు తిండి కావాలి. అసలు భగవంతుడు ఎక్కడున్నాడు? మనిషి మంచితనంలో, అతడు చేసే శ్రమలో ఉన్నాడు. మానవుడే లేనప్పుడు దైవంతో పనేముంది? ఈ సత్యం తెలియక మనిషిని తేలిగ్గా చూడటం జరుగుతోంది. తనని సృష్టించిన వాడిని సృష్టించే శక్తి మానవునిది. ప్రపంచాన్ని నడిపించేది అదే" అని గిరుక్కున వెనక్కి తిరిగి చీకట్లో కలిసిపోయాడు.

పిడుగుపాటు తిన్నవాడిలా ఉండిపోయాడు సాండర్స్. అతను అక్కడ నుంచి కదలడానికి చాలా సమయం పట్టింది. ఎంత ప్రయత్నించినా నిద్ర రాలేదు. ఓ రైతు కంటే తను బలహీనుడననే ఆలోచన మనసుని తొలిచేయసాగింది. అప్పటి నుంచి మతపరమైన కార్యక్రమాలు తృప్తిని వ్వడంలేదు. ఆకలి వేస్తోందంటూ అర్ధరాత్రి వచ్చిన ఆ వృద్ధుడు మళ్ళీ కనిపించలేదు.

ఆలోచనల నుండి తేరుకుని లోపలికి వెళ్ళి రాత్రి దుస్తులు విడిచి పొడవాటి లాగుతో బావి వద్దకు నడిచాడు ఫాదర్ సాండర్స్. చేదతో నీరు తోడి తలపై నుంచి పోసుకున్నాడు. చల్లటి నీరు శరీరాన్ని తడిపింది. నరాలు జివ్వుమన్నాయి. రెండో చేద పోసుకున్నప్పుడు అలాంటి భావం కలగలేదు.

స్నానం ముగించి పొడి వస్త్రంతో శరీరం తుడుచుకుని ఉతికిన దుస్తులు ధరించాడు. రెండు చెట్లకి కట్టిన తాడు మీద తువ్వాలు, లాగు ఆరేశాడు. వడివడిగా చర్చివైపు నడిచి ప్రభువు ముందు నిలుచుని ప్రార్థనకి ఉపక్రమించాడు. హఠాత్తుగా మస్తిష్కం శూన్యమైంది. తల విదిలించి మనసు ప్రార్థన మీద లగ్నం చెయ్యడానికి ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు.

కళ్ళు తెరిచి శిలువ వైపు చూశాడు. ప్రశాంత వదనంలో కళ్ల నుంచి కరుణ జాలువారుతోంది.

ఎట్టకేలకు కష్టంగా ప్రార్థన ముగించాడతను.

* * *

దైవ ప్రార్థన ప్రశాంతతని కలిగించడం లేదని గుర్తించాడు ఫాదర్ సాండర్స్. ఇతరులకు సాయపడటం వల్ల కలిగే తృప్తి అనిర్వచనీయమైందని తెలుసుకున్నాడు. చర్చి బాధ్యతలు నిర్వహిస్తూనే ప్రజల సమస్యల్లో పాలు పంచుకోసాగాడు.

ఒక రోజు ప్రార్థన ముగించి గ్రామస్థుల్ని కలుసుకున్నాడు. వారితో చర్చించి గ్రామంలో అల్లరి చిల్లరగా తిరిగే పిల్లల్ని ఒక చోట చేర్చి అక్షరాలు నేర్పించే కార్యక్రమం ప్రారంభించాడు. అందుకోసం చిన్న పాక నిర్మించాడు. గ్రామంలో సంత జరిగిన మరునాడు వీధులు శుభ్రం చేసే పని చేపట్టాడు

## కోందులు

మాక్ పెర్సన్ అనే అధికారి తెలుగులోని కొండ అనే పదం నుంచి కోందు పుట్టిం దని భావించాడు. సంస్కృతంలోని 'స్కంధ' లేదా 'కంద' అనే పదాల నుంచి కోందు ఉద్భవించిందని కొందరంటారు. ఈ జాతి గిరిజనులది. 'కుఖి' మాండలికం. కెప్టెన్ ఫ్రే భాషా శాస్త్రవేత్త. కుఖి మాండలికాన్ని బోధనా స్థాయికి తీసుకొచ్చాడు.

ఒరిస్సా రాష్ట్రంలోని గంజారి జిల్లా అడవుల్లో కోందు జాతి గిరిజనులు అధి కంగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్‌లోని అరకు ప్రాంతం మారుమూల గిరిజన గ్రామాల్లో (ఇవి ఒరిస్సాను ఆనుకుని ఉన్నాయి) నివసించే కోందు జాతి గిరిజ నుల్ని సామంతులని పిలుస్తారట.

కోందుల్లో 'ఉదులియా' సాంప్రదాయం ఇప్పటికీ ఉంది. పశ్చిమ గోదావరి గెడ్డపల్లి తదితర గ్రామాల్లో చెంచులు, కోయలు ఉన్నారు. వీరిలో కూడా 'ఉదులియా'ని పోలిన సాంప్రదాయం ఉంది. అంతే కాదు, వాళ్లు ఇంటిని పవిత్ర దేవాలయంగా భావిస్తారు. కాలి బాటలో ఏదైనా చెట్టు కొమ్మ (పచ్చటిది) పడివుంటే, ఆ చుట్టుప క్కల ప్రాంతంలో కోయ భార్యాభర్తలు దాంపత్య సుఖం కోసం వచ్చారని, ఎవరూ అటు రావద్దని గుర్తు. అలాగే వేటకి వెళ్ళినప్పుడు కోందులు మాదిరిగానే కోయలు కూడా చుట్టుపక్కల గ్రామాలకు కబురుపెట్టి వేటకి బయలుదేరుతారు.

అంతే కాకుండా భూమిని, ఆకాశాన్ని, వనదేవతని దేవుళ్ళుగా ఆరాధిస్తారు. పండగలప్పుడు కల్లు, సారాయి తాగి నృత్యం చేస్తారు. ఇలా చూసినప్పుడు ఒరి స్సాలోని కోందుల ఆచారాలకు, ఆంధ్రప్రదేశ్‌లోని కోయల ఆచారాలకు ఎన్నో పోలికలు కనిపిస్తాయి.

సాండర్స్. రహదారి మీద ఏర్పడిన గుంతలు పూడ్చటం, దారికి ఇరువైపులా చెట్లు నాటడం వంటి పనులు జరుగుతు న్నాయి. గ్రామానికి రెండో వైపు నేల బావి ఒకటి తవ్వారు.

ఇప్పుడు ఫాదర్ సాండర్స్‌కి క్షణం తీరిక లేదు. ఇదివరకటిలా అతన్ని అశాంతి బాధించడం లేదు.

ఆ రోజు మధ్యాహ్నం భోజనం ముగించి కొద్దిసేపు విశ్రాంతి తీసుకున్నాడు. చన్నీటితో మొహం కడుక్కుని బైబిల్ తెరిచాడు. పరి సరాలు మర్చిపోయి పఠనంలో మునిగిపో యాడు.

"నమస్కారం ఫాదర్ సాండర్స్..."

బైబిల్ నుండి తలెత్తి చూశాడు. అపరిచి తుడొకతను నిలుచుని కనిపించాడు. అతని చేతిలో కవరు ఉంది. ఆ వ్యక్తిని పరిశీలిం చడం ముగించి శాంతంగా ప్రశ్నించాడు.

"ఎక్కడనుంచి వచ్చావు నాయనా?"

"టౌన్ నుంచి వచ్చాను ఫాదర్. ఇది మీకు వేగిరం అందజెయ్యమన్నారు" చెప్పా డతను కవరు అందిస్తూ.

సాండర్స్ నొసలు ముడివడింది. బిషప్ నుండి కాని భార్యనుండి కాని వచ్చిన లేఖ కాదది. ఆలోచిస్తూ చించి చిన్న కాగితం బయటకు తీసి చదివాడు.

అలాగే కదలకుండా కూర్చుండిపో యాడు.

తను గతంలో కోరుకున్నదే అందులో ఉంది. సంతోషించదగ్గదే అయినా మూడు నెలల క్రితం అయితే నిస్సందేహంగా సంతో షపడేవాడు. అర్జీ పంపినప్పటి మానసిక స్థితి ఇప్పుడు లేదు.

ఒక పనిలో ఇబ్బంది ఎదురైతే మరో పని

## రక్త ప్రసారం లేకుండా ఆపరేషన్

ఆపరేషన్ చేయాలంటే రక్తనాళాలు కోయాలి. రక్తం కారుతుంది. కానీ రక్తాన్ని గడ్డ కట్టించి ఆపరేషన్ చేస్తే? ఈ ఆలోచన కొందరు శాస్త్రవేత్తలకు రావటంతో ప్రపంచ వైద్య చరిత్ర ఉన్నత శిఖరాలు అధిరోహించింది. కొలంబియా ప్రెస్బిటేరియన్ మెడికల్ సెంటర్‌లో డాక్టర్లకు ఓ వ్యక్తి మెదడు ఆపరేషన్ చేయాల్సివచ్చింది. అది మామూలు ఆపరేషన్ కాదు. మెదడు గుండా పోయే ఓ వెంట్రుకంత సన్నని రక్తనాళం వాచిపోయి, గోల్ఫ్ బంతి అంతయింది. దాంతో మెదడుపై ఒత్తిడి పెరిగి తగినంత స్థలం లేకుండా పోయింది. ఈ వాపు చిన్నదే అయితే రక్తం కారుతున్నా డాక్టర్లు ఆపరేషన్ చేసేయగలరు. కానీ ఇప్పుడు ఆ నాళాన్ని కోస్తే రక్తం అధికంగా కారుతుంది. ఆపరేషన్ కష్టమవుతుంది. అంతసేపు రక్తం అందకపోతే మెదడు దెబ్బతింటుంది. ఇది డాక్టర్లను డైలమాలో పడేసింది. అప్పుడొచ్చింది వాళ్లకీ రక్తాన్ని గడ్డ కట్టించే ఐడియా. డాక్టర్లు రోగి రక్తాన్ని 15.5 డిగ్రీల సెంటీగ్రేడు ఉష్ణోగ్రతకు తగ్గించారు. దాంతో శరీరంలో రక్త ప్రసరణ ఆగిపోయింది. ఈ ఉష్ణోగ్రత వద్ద రక్తం లేకుండా మెదడు ఓ గంట ఉండగలదు. ఇంకేం, వెంటనే డాక్టర్లు చకచకా ఆపరేషన్ చేసి పారేశారు. రోగి ఎంచక్కా హాయిగా, ఆరోగ్యంగా ఉన్నాడిప్పుడు. చూశారా, మనకు పార్లమెంటును 'సస్పెండెడ్ ఆనిమేషన్'లో పెట్టడం తెలిస్తే, డాక్టర్లు శరీరాన్నే సస్పెండెడ్ ఆనిమేషన్‌లో పెట్టేస్తున్నారు.



చూసుకోవచ్చు. అయితే క్రొత్త దానిలో ఎలాంటి ఇబ్బంది వుండదనే భరోసా లేదు. జీవిస్తున్న చోట ఎదురయిన ఇబ్బందులు అధిగమించి బతకాలి తప్ప పలాయనం చిత్తగించడం పరిష్కారం కాదు. అతను ఈ విధమైన ఆలోచనతో డోలాయమాన స్థితి నుంచి బయటపడి తన అభిప్రాయం మార్చుకుని ప్రశాంతత చిక్కించుకున్న చాలా కాలానికి వచ్చింది ఈ లేఖ.

మత గురువుకంటే ఆ నౌకరీ అన్ని విధాల మేలే అయినా దానిని తిరస్కరిస్తే తిరిగి అలాంటి అవకాశం లభించకపోవచ్చు.

ఏం చెయ్యాలి?

సందిగ్ధాన్ని మనసులో వుంచుకుని ఆ వ్యక్తితో అన్నాడు.

"శ్రమ తీసుకుని వచ్చి శుభవార్త అందజేశావు... కృతజ్ఞతలు. నీ కొరకు ప్రభువుని ప్రార్థిస్తాను"

అతను నమస్కారం చేసి వెళ్లిపోయాడు.

సాండర్స్ మరోమారు ఆ లేఖని పరిశీలనగా చదివి ఉక్కిరిబిక్కిరయ్యాడు. అందులోని వివరాల ప్రకారం రెండు దినాల్లో మద్రాసు చేరుకుని కమిటీ ముందు హాజరుకావాలి.

ఆ గ్రామం నుంచి పట్నం వెళ్ళడానికి ఆరేడు గంటల సమయం పడుతుంది. అక్కడ రైలు బండి ఎక్కితే నలభై ఎనిమిది గంటల తరువాత అది మద్రాసు చేరుతుంది. అంటే తెల్లవారకముందు పట్నం వెళ్ళాలి. లేకపోతే రైలుబండి అందదు. ఇదంతా తేలికైన వ్యవహారం కాదు.

పని పిల్లని పిలిచి చెప్పాడు.

"గ్రామంలోకి వెళ్ళి పట్నం వెళ్ళడా

నికి ఎవరైనా బండి కడతారేమో కనుక్కు నిరా"

ఆ పిల్ల తూనీగలా బయటకు పరిగెత్తింది. ఫాదర్ పట్నం వెళితే, తిరిగొస్తూ తియ్యటి మిఠాయిలు తెస్తాడని ఆ పిల్లకి తెలుసు.

మద్రాసు వెళ్లడానికి బండి కుదరడం ఒక్కటే సమస్య కాకపోయినా, ముందు బండి సంగతి తేలితే మిగతా వాటి గురించి ఆలోచించవచ్చునని అనుకోవడం వల్ల పని పిల్ల రాక కోసం ఎదురుచూస్తూ అలాగే కూర్చుండిపోయాడు సాండర్స్.

పిల్ల వేగంగా దూసుకొచ్చింది. కొన్ని క్షణాలు ఆయాసం తీర్చుకోవడానికి ఆగింది.

"పట్నం వెళ్ళడానికి అడవి మార్గంలో ప్రయాణం చెయ్యాలిట. దారిలో దోపిడీ దొంగలు అడ్డగించి దోచుకుంటారట. దానికి తోడు ఆకాశంలో మేఘాలు కమ్మాయట. వర్షం వస్తే ప్రయాణం అసలు సాగదట. అందుకని ఎవరూ బండి కట్టమనేశారు" గడగడా తాను కనుక్కొచ్చిన విషయం చెప్పింది.

హతాశుడయ్యాడు ఫాదర్ సాండర్స్.

అప్పటికే సూర్యుడు కిందకి దిగిపోతున్నాడు. ఒకటి రెండు గంటల్లో చీకటి చుట్టుముడుతుంది. సాహసించి బయలుదేరినా ఒంటరిగా వెళ్ళలేడు.

ఏమిటి చెయ్యడం?

ఈ క్లిష్టపరిస్థితిలో ఎవరు సాయం చేస్తారు?

అతని మొహం మాడిపోయింది. కనుచూపు మేర పరిష్కారమార్గం కనిపించకపోవడంతో, పూర్తిగా నిస్పృహ ఆవరించి దిగులుగా కూర్చున్నాడు.

ఆ సమయంలో వచ్చిందా వృద్ధ స్త్రీ.

"నమస్కారం ఫాదరీ బాబూ!" వినయంగా చేతులు జోడించింది.

"నమస్కారం..." అన్యమనస్కంగా బదులిచ్చాడతను.

ఓ క్షణం నిశ్శబ్దం.

"మీరు దిగులుగా వున్నట్టున్నారు" సందేహంగా అందామె.

ఆ స్త్రీవైపు భావరహితంగా చూశాడు సాండర్స్. ఈ సమస్య ఆమెకి వచ్చుంటే "ఖర్మ" అని సరిపెట్టుకుని సంతృప్తిపడి వుండేది. తనకి అది కూడా చేతకాదు. మనసులో అనుకుని జీవంలేని నవ్వొకటి పెదవుల మీద కదులుతుండగా ఆమెని చూశాడు.

"మనం ప్రభువు బిడ్డలం. సమస్యలు సృష్టించి మన శక్తి సామర్థ్యాలు పరీక్షించడం ప్రభువుకి పరిపాటి" చిన్నగా అన్నాడు.

"నిత్యం ప్రభువుని సేవించే వారికి సమస్యలు వస్తాయా ఫాదరీ బాబూ!"

ఆమె అమాయకత్వానికి జాలి కలిగింది.

"నేను తెల్లవారేసరికి పట్నం వెళ్లాలమ్మా! చీకట్లో అడవి దాటడం కష్టం కాబట్టి ఎవరూ బండి కట్టమంటున్నారు. పట్నం వెళ్ళకపోతే అరుదైన అవకాశం ఒకటి చేజారిపోతుంది. ఈ సమస్య సృష్టించి నన్ను పరీక్షిస్తున్నాడు ప్రభువు!" చెప్పాడు.

రెండు క్షణాలు ఆలోచించి ఒక నిర్ణయానికొచ్చినదానిలా తల పంకించిందామె.

"మీరు ప్రయాణానికి సిద్ధంకండి. చీకటి పడకముందు మీ కోసం బండి వస్తుంది" చెప్పింది.

"ప్రమాదమని తెలిసి బండెవరు కడతారమ్మా? "

"మేము వ్యవసాయదారులం. మాకు ఎడ్ల బండి వుంది. మీరు రక్షించిన నా కొడుకు మిమ్మల్ని పట్నం తీసుకెళ్లడానికి బండి తీసుకొస్తాడు" చెప్పి సమాధానం కోసం చూడకుండా వెళ్ళిపోయింది.

ఆమె మాటలు విశ్వసించాలో లేదో అర్థం కాలేదు ఫాదర్ సాండర్స్‌కి. కొద్దిసేపు మౌనంగా వుండిపోయాడు. ఏదో గుర్తొచ్చి

నట్లు చప్పున లేచి లోపలికి వెళ్ళి మట్టి డిబ్బీ ఒకటి తెచ్చి బల్లమీద పెట్టాడు. అందులో తన సమస్యకి పరిష్కారం వున్నట్టు కొన్ని క్షణాలు పరిశీలించాడు.

భార్యకి ఉప్పాడ చీర ఒకటి కొనాలని అందులో డబ్బులు దాస్తున్నాడు. అతని వద్ద అది తప్ప వేరే పైకం లేదు. ఆ డబ్బు తీసుకోవడానికి మనసొప్పకపోయినా గత్యం తరంలేక గుండె చిక్కబట్టుకుని, ఆ మట్టి డిబ్బీకి దెబ్బ తగులుతుందని భయపడు తున్న వాడిలా నెమ్మదిగా బల్లమీద కొట్టాడు. డిబ్బీ ముక్కలుగా విడిపోయింది. చెల్లాచెదురైన పెంకుల మధ్య నాణేలు మెరుస్తున్నాయి. వాటిని ఏరి లెక్కించాడు.

పన్నెండు వెండి రూపాయ బిళ్ళలు, మూడు అణాలు, పది చిల్లు కాణీలు వున్నాయి.

అవి ఖర్చులకు సరిపోతాయని తృప్తిపడి ఓ గుడ్డలో మూటగట్టాడు. సంచి సర్దుకుని, బిషప్‌కి లేఖ రాశాడు. రాత్రి భోజనం కోసం జొన్న రొట్టెలు కట్టుకునేసరికి ఇంటి ముందు బండి ఆగిన సవ్వడి వినవచ్చింది.

రామయ్య లోపలికి వచ్చి చెప్పాడు,

"నమస్కారం ఫాదర్. మీ కోసం బండి తెచ్చాను" సాండర్స్ చర్చిలోకి నడిచాడు ప్రార్థన చెయ్యడా నికి.



## 7

"పుల్మే కనిపించడం లేదు."

"సీకటడిపోతుంటే ఎటెళ్లింది? "

"పొద్దు తలమీదున్న ప్పుడు అడవిలోకి వెళ్ళడం సుక్రీ సూసిందట. సోభెనా కోదు వెంట వున్నాడట"

"చాలు జోడీ గ్రామ కోదు వెంట ఎందు కెళ్ళింది పుల్మే? "

ఎవరో కిసుక్కున నవ్వారు.

"నీకు తెలవక అడుగుతున్నావా పెద్ద తండ్రీ? " ఆ గొంతులో వెక్కిరింత. వెంటనే మరికొన్ని గొంతులు నవ్వాయి.

"ఎంత మోసం. అతిథిగా వచ్చినాడు. డోక్రీబేడా గుంటని లేపుకుపోతాడా? చాలు జోడీ వాళ్ళు ఏటనుకుంటున్నారు మన గురించి? " అరిచాడతను.

అక్కడివారు నిశ్శబ్దంగా వుండిపోయారు.

బేశుకోదు ముసలి వాడయిపోయాడు. పొద్దు పొడిస్తే సారా, పొద్దు వాలితే సారా కావాలతనికి. ముంతడు సారా కడుపులో పడితే మతిపోయి పిచ్చిపట్టినట్టు వాగు తాడు. మత్తు దిగితే ఒక్క మాట కూడా గుర్తుండదు. తాగితాగి ఛాతీ ఎండిపో యింది. కడుపులోకి చోడంబలి దిగదు. సారా మాత్రం గొంతు వరకూ పట్టిస్తాడు. వాగుతూ, కనిపించిన వారి మీద కేకలు వేస్తూ గ్రామం చుట్టూ తిరిగి ఎప్పుడో పడి పోతాడు. బేశుకోదు పెళ్ళాం వెదుక్కుంటూ వస్తుంది. అతనికి బరువులు, బాధ్యతలు లేవు. ఎందుకు తాగుతున్నాడో, ఎవరి కోసం తాగుతున్నాడో, ఎంత తాగుతున్నాడో అతనికే తెలియదు.

అది నిత్యం జరిగే భాగోతం.

"పడుచుది కనిపిస్తే చిరుతని చూసిన కుక్కల్లా దాగుండి పోయే దద్దమ్మలు డోక్రీబేడా కుర్రాళ్ళు. అందుకే మన గుంటని పరాయివాడు ఎత్తుకెళ్ళాడు. గుడ్లు పొదిగే కోడిలా గ్రామం వదలరు మీరు. ఇంకా అమ్మ రొమ్ము సీకాలనుకుంటారు. మీకు పౌరుషం అనేది లేదు. మీ తాతలు, తండ్రులు పౌరుషం లేనోళ్ళు కాదని గుర్తెట్టుకోండి" బిగ్గరగా అని, తొడ చరిచాడు బేశుకోదు.

ఉండబట్టలేక అన్నాడోయువకుడు.

"కోదు సాంప్రదాయం మర్చిపోకు. నచ్చిన వాడి వెంట పడుచు వెళితే నువ్వు ఆపగలవా? ఆపి జగడమాడగలవా? కాటికి కాళ్ళు చాపుకున్న నీకెందుకు గ్రామ సంగతులు? "

కోదు జాతిలో ఉదూలియా అనే ఆచారం తరతరాల నుంచి వస్తోంది. తన ఇంటికి సరిపడే పడుచుని చూసి చేపట్టి తీసుకుపోవడం అక్కడ రివాజు.

బేశుకోదు కళ్లెర్రజేసి ఆ యువకుడ్ని తీవ్రంగా చూశాడు.

"పోయిన ఏడు వేటకెళ్ళి తుపాకితో నక్కని సంపావు. అప్పటి నుండి సెవుల పిల్లిని కూడా సంపడానికి మొరాయిస్తోంది నీ తుపాకి. మేం కాటికి కాళ్ళు జాపుకున్నాం. మీరు నక్కల్ని కొట్టి బతుకుదురు గాని. పుల్మేకి నీ సత్తా తెలిసే ఎళ్ళిపోయింది" అని నవ్వాడు.

ఆ యువకుని ముఖం ఎర్రబడింది.

వేటకి పోయిన రోజు తుప్పల్లో దాగిన జంతువు ఉనికి పసిగట్టి అడవిగొర్రె అనుకుని తుపాకి పేల్చాడు. విరుచుకుపడిపోయి కొట్టుకుంటున్న జంతువు వద్దకి వెళ్ళి చూస్తే అది నక్క! నక్కని చంపితే తుపాకి గురి తప్పుతుందని, వేటకి పనికి రాదని గాఢంగా నమ్ముతారు కోదులు. అప్పటి నుంచి ఆ యువకుడు తన నాటు తుపాకి బయటకు తియ్యలేదు.

జామిరికోదు అటువైపు వచ్చాడు.

"మీకు మతోయిందేంట్రా సోద్యం సూస్తున్నారు. ఓ గుంట వెళ్ళిపోతే మనోళ్ళు పది మంది గుంటల్ని పట్టుకొస్తారు. కోదు రాజ్యానికి ఆచారాలు వున్నాయి. వాటిని మీరే హక్కు ఎవరికీ లేదు. ఇళ్ళకి పోండి. మీ తల్లులు ఏ గ్రామం నుంచి వచ్చారో అడగండి" గద్దించాడు.

అక్కడ గుమికూడిన వారు తమ గుడిసెలవైపు కదిలారు.

జామిరికోదుని మత్తునిండిన ఎరుపుకనులతో చూశాడు బేశుకోదు.

"ఏరా సావోతా నంజికొడకా! నీ బాబు నాకు తెలుసొరేయ్. నేను లేకుండా ఆడు వేటకి పోయేవాడు కాదు. అప్పుడు నువ్వు గోచీకట్టి మట్టిలో పొర్లేవాడివి. ఇప్పుడు సావోతానని రొమ్ము విరుచుకుని బేశుకోదు మొనగాడి ముందు నిలబడ్డావు. నీ గ్రామం పడుచుని మరో గ్రామపోడు ఎత్తుకెళ్ళాడు. వినపడిందా? సిగ్గు ఒగ్గేసి తిరుగుతున్నావ్. సావోతా నా కొడుక్కి పౌరుషం లేదు"

జామిరికోదుకి నవ్వొచ్చింది.

బేశుకోదు వయసులో వున్నప్పుడు గొప్ప వేటగాడని పేరుంది. జామిరికోదు తండ్రితో అతనికి విడదీయలేని స్నేహం. ఇద్దరూ జట్టుగా వేటకి పోయేవాళ్ళు. జంతువు తుప్పల్లో దూరితే ఆకుల కదలికలను బట్టి దాని గమనాన్ని అంచనా వేసి ఈటె విసిరేవాడు. ఆ ఈటె ఎంతబలంగా వెళ్ళేదంటే గాలిని కోస్తున్న చప్పుడు వచ్చేదట. జంతువు శరీరంలోకి దిగబడి భూమిలోకి చొచ్చుకుపోయేది ఈటె. ఆ కాలంలో బేశుకోదు పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వస్తుంటే

మీకు
మతోయిందేంట్రా
సోద్యం
సూస్తున్నారు.
ఓ గుంట ఎళ్ళి
పోతే మనోళ్ళు
పది మంది
గుంటల్ని
పట్టుకొస్తారు.
కోదు
రాజ్యానికి
ఆచారాలు
ఉన్నాయి.
వాటిని
మీరే హక్కు
ఎవరికీ లేదు

భయంగా పక్కకి తప్పుకునేవాడు జామిరి కోదు. అప్పటి విషయాలు చెప్పి పిల్లల్ని ఆశ్చర్యంలో ముంచుతారు వృద్ధులు.

బేశుకోదు పెళ్ళి చేసుకున్న చాలా ఏళ్ళకి ఓ ఆడపిల్ల పుట్టింది. ఆ రోజు అతను అడవిలో పెద్ద కణుజుని వేటాడేడు. దానిని మోసుకు రావడానికి డోక్రీబేడా నుంచి ఇరవై మంది వెళ్ళాల్సి వచ్చింది. కర్రకి జంతువుని కట్టి అటో పదిమంది ఇటో పదిమంది భుజాలు కాసి మోసుకొస్తుంటే ఆ పక్కనే బేశుకోదు గర్వంగా గ్రామంలోకి నడిచి వచ్చాడు. నాలుగు దినాలు గ్రామానికి సమృద్ధిగా మాంసం దొరికింది.

బేశుకోదు కూతురు మూడోఏట విష జ్వరం సోకి చనిపోయింది.

అప్పటి నుంచి అతని పతనం మొదలయింది. ఎవరు చెప్పినా దిగజారిపోవడం ఆగలేదు. తాగితాగి చివరికి నలుగురిలో పిచ్చివాడిలా మిగిలాడు. చిన్న విషయానికి కూడా రెచ్చిపోయి రాద్ధాంతం చేసే స్థితికి చేరుకున్నాడు. అతను ఎవర్ని తిట్టినా గ్రామస్థులు పట్టించుకోరు. బేశుకోదు భూమిని తన పొలంతోపాటు దున్ని పంట వేస్తాడు జామిరికోదు. తన ఇంటికి తెచ్చినట్టే బేశుకోదుకి కూడా సంత నుంచి సరుకులు తెస్తాడు.

"గుడిసెకి పద, ముసల్ది సూస్తుంటుంది" అభిమానంగా అన్నాడు జామిరికోదు.

"ముసల్ది..." అని గొణిగి రెండు క్షణాలు ఆలోచించి, "అవును ముసల్దే! కానొరేయ్, బాఘమారీ నుంచి తీసుకొచ్చినప్పుడు మా సక్కగా వుండేదిరా. గుండెల్లో గువ్వలా దూరిపోయేది. నాకలుపొచ్చినా దానికొచ్చేది కాదు. అదేంటో కూతురు సచ్చిపోనాక ముసల్దయిపోయింది. దానిని సూస్తే జాలేస్తుందిరా. పిచ్చి ముండ ఎట్టా బతుకుద్దో" బేశుకోదు కళ్ళు చెమర్చాయి.

జామిరికోదు గుండె నీరైపోయింది.

"నేనున్నంత వరకూ నీకు గాని పిన్నమ్మకి గాని ఎట్టాంటి లోటు రాదు. పద..." అని, బేశుకోదుని తీసుకెళ్ళి పిన్నమ్మకి అప్పగించి వెనక్కి తిరిగాడు. అడుగులు వేస్తూ తలెత్తి చూశాడు. ఆకాశం నిండా నక్షత్రాలు మిల మిల మెరుస్తున్నాయి.

వాటినెవరు అక్కడ తగిలించారు?

తమనెవరు ఇక్కడ జీవించమని శాసించారు?

ఇత్యాది ప్రశ్నలు అతనిలో ఉదయించలేదు.

ఎందుకంటే, అతను చదువు-సంధ్యలేని ప్రాచీన ఆదిమజాతి మానవుడు!



## 8

ఫాదర్ సాండర్స్ ప్రయాణిస్తున్న ఎడ్ల బండి వూహించినట్లు అడవిమార్గం చేరుకునే సరికి బాగా చీకటి పడిపోయింది.

హఠాత్తుగా చల్లటి గాలులు వీచడం మొదలైంది.

ఆకాశంలో దట్టంగా మేఘాలు కమ్ముకున్నాయి. చీకటి మరింత చిక్కనై మార్గం కానరావడంలేదు. బెదురుతున్న ఎడ్లకి ధైర్యవచనాలు చెబుతూ బండి తోలుతున్నాడు రామయ్య, రైతు కుటుంబంలో పుట్టినవాడు కావడం చేత బండితోలేపని ఎంతో నైపుణ్యంగా చేస్తున్నాడతను.

వర్షం మొదలైంది.

రామయ్య బండి ఒక చెట్టు కింద ఆపాడు. బండి దిగువున అమర్చిన తాటాకు గొడుగు సాండర్స్‌కి అందించి, అతని సంచి బండి కింద భద్రపరిచాడు. బండి ముందుకి వెళుతున్న కొద్దీ వర్షం పెద్దది కాసాగింది. తాటాకు గొడుగు వర్షం తాకిడిని ఆపలేకపో

# ఉత్తమ నవలలకు ఆహ్వానం

మీరు విలక్షణ రచయితలా
వినూత్నంగా అక్షరాన్ని
సంధించడం మీ అభిలాష
మరింకేం, వెంటనే
స్పందించండి.

## చతుర

**సాదర స్వాగతం**

గత 28 సంవత్సరాలుగా
అప్రతిహతంగా నెలనెలా
ఉత్తమ నవలను పాఠకులకు
అందిస్తున్న **చతుర** రానున్న
సంచికలను మరింత అద్భుతంగా వెలువరించాలని
సంకల్పిస్తోంది. అశ్లీలతకు తావులేకుండా, మానవతా విలువలతో
ఆబాలగోపాలాన్ని అలరించగల మంచి నవలలకు స్వాగతం పలుకుతోంది.

**సునిశిత హాస్యంతో ఓలలాడించే వ్యంగ్య నవలలకు
ప్రత్యేక ప్రాధాన్యం**

నవలలు ఇతివృత్తంలో నవ్యత, రచనాసంవిధానంలో వైవిధ్యం కలిగి ఉండాలి.
తెలుగు వాతావరణాన్ని, తెలుగు వారి సమకాలీన జీవితాన్ని విభిన్న
కోణాల నుండి సమగ్రంగా ప్రతిబింబించగలగాలి. సామాజిక స్పృహతో
మానవ స్వభావాలను, అంతరంగిక చిత్రాన్ని సమర్థవంతంగా ఆవిష్కరించగలగాలి.
నవల చతురలో అచ్చులో 90 పేజీలు మించకుండా చూసుకుని పంపించాలి.
అంతకు మించిన పేజీలు ఉన్న పెద్ద నవలలను పరిశీలించడం కుదరదు.
కనుక రచయితలు చతురలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో సరిచూసుకుని
నవలలను పంపించాలి. ఎంపిక కాని వాటిని తిప్పి పంపగోరువారు
తగు పోస్టేజి ఉన్న కవరును జత పరచాలి.

**సంపాదకుడు**

**చతుర**

'ఈనాడు' కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ - 82.

తోంది. రామయ్యా పూర్తిగాను, సాండర్స్ పాక్షికంగాను తడిశారు.

దైవం అనుకూలించకపోవడం వల్ల తన ప్రయాణానికి అన్ని ఆటంకాలు ఏర్పడుతున్నాయని తలపోశాడు సాండర్స్. ఇంట్లో వెచ్చగా ఉండాల్సిన రామయ్యకి తను శ్రమ కలిగించాననే భావన కలిగింది.

"రామయ్యా! వాతావరణం అనుకూలంగా లేదు. ఈ పరిస్థితిలో ఎడ్లు ఎక్కువసేపు నడవలేవు. మనం వెనక్కి పోదాం" అన్నాడు.

"ఎడ్ల గురించి మీరు బెంగెట్టుకోకండి. వాటి సత్తా, సత్తువ నాకు తెలుసు. ఈ వర్షం కాసేపటికి ఆగిపోవచ్చు లేదా దారి పొడవునా ఇలానే పడొచ్చు. జంకి వెనకడుగువేస్తే మనం ఏ పనీ చేయలేమని మా అయ్య చెప్పేవాడు"

"మీ అయ్య సిపాయిల కాల్పుల్లో మరణించాడని విన్నాను"

"నిజమే..."

"కారణం ఏమిటి? "

"మా అయ్యకి గాంధీగారంటే వల్లమాలిన అభిమానం. కాంగ్రెస్ సభకి గాంధీగారొస్తున్నారని తెలిసి చూడటానికి పట్నం వెళ్ళాడు. అక్కడ సభకొచ్చిన జనాన్ని చూసి బెంబేలెత్తి సిపాయిలతో జనాన్ని కాల్పించారు బ్రిటిష్ అధికారులు. మా అయ్యకి తూటా తగిలి నేల కూలిపోయాడు" ఏదో అడ్డం పడ్డట్టు గొంతు జీరబోయింది.

రెండు క్షణాలు విరామం తరువాత గొంతు విప్పాడు.

"మా అయ్య చెయ్యెత్తు మనిషి. మెలితిరిగిన మీసాలతో పులిలా కనిపించేవాడు. ఎవరైనా తప్పు చేసినా, అబద్ధం చెప్పినా భరించలేకపోయేవాడు. ఒకసారి అబద్ధం చెప్పి దండనకి గురయ్యాను" క్రమంగా ఆ కుర్రవాడి కంఠం గద్గదమైంది.

కొద్దిసేపు ఇద్దరి మధ్య మౌనం రాజ్యం చేసింది. హోరుమనే చప్పుడుతో విసురుగా వీస్తోంది గాలి. సూదుల్లా శరీరాన్ని తాకుతున్నాయి వర్షపు చినుకులు. వారిద్దర్ని అవేమీ బాధించడం లేదు.

"మీ అయ్య అడుగుజాడల్లో నువ్వు నడుస్తున్నావని సర్కిల్ చెప్పాడు. అతను నిన్ను విడిచి పెట్టడానికి మొదట అంగీకరించలేదు"

"క్రీస్తు పుట్టిన తరువాత కోట్లాది మంది మనుషులు ఈ భూమి మీద పుట్టారు. కాని ఏసు ప్రభువు స్థానాన్ని ఎవరూ భర్తీ చెయ్యలేకపోయారు. అలాగే నేను రామయ్యనే తప్ప ఎన్నటికీ సోమయ్యను కాలేను. రోజూ గ్రామం చివర కుర్రవాళ్ళమంతా చేరి కాలక్షేపం చేస్తుంటాం. దేశంలో జరుగుతున్న విషయాలు ముచ్చటించుకుంటాం. స్వాతంత్ర్య పోరాట సంగతులు చెప్పుకుంటాం. గ్రామంలో ఏదైనా సభ జరగాలంటే మేము పూనుకోవాలి. మునిపల్లె గ్రామంలో బ్రిటిష్ వారి తొత్తు ఒకడున్నాడు. అతని కూతుర్ని నేను ప్రేమించానని కక్షతో నా మీద సర్కిల్‌కి లేనిపోనివి కల్పించి చెప్పాడు"

"ఆ అమ్మాయి అందంగా వుంటుందా? " అడిగాడు సాండర్స్.

"చాలా"

"పెళ్ళి చేసుకుంటావా? "

రామయ్య చిన్నగా నవ్వాడు.

"అందులో సందేహించాల్సిందేం లేదు. ఈ క్షణంలో వాళ్ళ ఇంటికెళ్ళి పిల్లని తీసుకొచ్చి పెళ్ళి చేసుకోగలను. నా తల్లి బాధపడుతుందని ఇంతవరకూ సందేహించాను. ఇప్పుడు ఆ అడ్డంకి తొలగిపోయింది. మిమ్మల్ని పట్నంలో వదిలివస్తే ఆ పిల్లని కోడలిగా అంగీకరిస్తానని నా తల్లి వాగ్దానం చేసింది"

పెటేలున ఆకాశం ఉరిమింది.

"నీ కోసం ఆ ప్రభువుని ప్రార్థిస్తాను" చెప్పాడు సాండర్స్.

"కృతజ్ఞతలు ఫాదర్"

వర్షం విలయతాండవం ఆపి శాంతించింది. ఆలోచిస్తూనే నిద్రలోకి జారిపోయాడు సాండర్స్. ఒకచోట బండి ఆగడం,

## ఎందుకేంటి? చూడ్డానికే...

స్క్రిప్ట్ ప్రకారం 'గుండమ్మకథ' సినిమాలో మొదట ఎల్. విజయ లక్ష్మి డ్యాన్స్‌లేదు. చక్రపాణిగారే ఆమె డ్యాన్స్ ఉండితీరాలని పట్టుపట్టారు.

'ఎందుకండీ.. ఎక్కడ పెడతాం దాన్ని?' అని వాదించారు కొందరు.

దానికాయన 'ఎందుకేమిటి.. చూడ్డానికి. ఎలాగూ ఎల్.విజయలక్ష్మి మన సినిమాలో నటిస్తోంది కనుక ఆమె డ్యాన్స్ ఉండాల్సిందే' అంటూ డ్యాన్స్ షూట్‌చేయించేశారు. దాన్ని ఎక్కడ పెట్టాలా అని అంతా బుర్ర బద్దలుకొట్టుకుంటుంటే 'ఎందుకయ్యా.. అంత ఆలోచన? నాగేశ్వరరావు, జమున ఆడియన్స్‌లో కూర్చుని చూస్తున్నట్లు రెండు షాట్లు తీయండి. వారిద్దరూ వచ్చి డ్యాన్స్ చూస్తున్నట్లు ఉంటుంది' అని సింపుల్‌గా తేల్చేశారు.

చివరకు ఆయన చెప్పినట్లుగానే యూనిట్ చేసింది. ఆ రోజున ఆయనలా చేసి ఉండకపోతే ఆ అద్భుత నృత్యంచూసే యోగం మనకు దొరికేది కాదేమో!




దారికి అడ్డంగా కూలిన చెట్టుని రామయ్య ప్రయాసతో తొలగించడం అతనికి తెలియదు. సాండర్స్ కళ్ళు తెరిచేసరికి స్టేషన్ వద్ద ఉంది బండి.

చుట్టూ చూశాడతను.

వర్షం ఎంత త్రీవంగా పడిందో నేలమీదున్న నీటిని బట్టి తెలుస్తోంది. అతను బండి దిగాడు. తాళ్ళు విప్పి ఎడ్లను వదిలి పెట్టాడు రామయ్య. ఇద్దరూ స్టేషన్ వరండా చేరుకున్నారు. అక్కడ పొడిగా వుంది.

స్టేషన్ మాష్టరు గది వరకు వెళ్ళి తలుపు తట్టి పిలిచాడు సాండర్స్. ఎంతోసేపు పిలిచినా బదులు రాలేదు. తిరిగి వరండాలోకి వచ్చేశాడు. రామయ్య దుస్తులు విప్పి పిండి ఆరేశాడు. నేల శుభ్రంచేసి ఇద్దరూ నడుము వాల్చారు. దారిలో నిద్రపోవడం వల్ల కళ్ళు మూతలు పడలేదు సాండర్స్‌కి. రామయ్య మాత్రం వెంటనే నిద్రపోయాడు.

సాండర్స్ ఆకాశంవైపు చూస్తున్నాడు.

అక్కడ ఏముందో కంటికి కనిపించడం లేదు. మబ్బులు దట్టంగా అలుముకుని ఉన్నాయి. అతను అలా చూస్తుండగానే తళుక్కుమని ఓ చుక్క మెరిసింది. క్రమంగా లెక్కలేనన్ని చుక్కలు దర్శనమిచ్చాయి. ఓ చివర ఆకాశానికి పట్టుకుని వేలాడుతున్నట్లు చంద్రుడు ప్రత్యక్షమయ్యాడు.

సాండర్స్‌లేచి సమీపంలోని చెరువు వద్దకు వెళ్ళాడు. స్నానం చేసి ప్రార్థన ముగించాడు. అప్పటికి పూర్తి తెల్లవారిపోయింది.

అవతలి వైపు వున్న జనవాసాల నుంచి కొంతమంది పౌరులు స్టేషన్‌కి వచ్చారు. రామయ్య నిద్రలేచి ఓ చెట్టు నుంచి పుల్ల విరిచి నోట్లో పెట్టుకుని చెరువు వైపు వెళ్ళాడు. స్టేషన్ మాష్టర్ గంటకొట్టి టిక్కెట్లు అమ్మే చోటుకి వచ్చి కూర్చున్నాడు.

సాండర్స్ మూడున్నర రూపాయలు చెల్లించి టిక్కెట్ తీసుకున్నాడు. ఆ రైలు బండి మద్రాసు చేరుకునే సమయం

భోగట్టా చేసి తృప్తిపడ్డాడు.

చెరువుకి వెళ్ళి రామయ్య వచ్చి దుస్తులు వేసుకుని తన సంచి నుంచి ఆకులతో కట్టిన పొట్లం ఒకటి బయటకు తీశాడు. దానిని తెరిచి సాండర్స్‌తో అన్నాడు.

"రండి ఫాదర్! కొద్దిగా ఆహారం తీసుకుందాం"

అప్పటికే ఆకలి వేస్తుండటంతో అభ్యంతరం వ్యక్తం చెయ్యకుండా వెళ్ళి కూర్చున్నాడు సాండర్స్. బొబ్బర్లతో చేసిన గారె ఒకటి రుచి చూసి ఆశ్చర్యంగా అడిగాడు.

"వీటిని ఎవరు చేశారు?"

రామయ్య చిరునవ్వుతో చెప్పాడు, "అమ్మ"

అతని ముఖంలోని చిరునవ్వుని, మెరుస్తున్న కనుల్ని తదేకంగా చూస్తుండిపోయాడు సాండర్స్. కనీసం జ్ఞాపకం చేసుకోవాలన్నా తన తల్లి రూపం తెలియదు. తనకి అమ్మ వుంటే రామయ్య తల్లి మాదిరిగానే ఏదో ఒకటి చేసి ఇచ్చేది. దూర ప్రయాణం చేస్తున్న కొడుక్కి ఎక్కడ ఆకలి వేస్తుందో తల్లికి తెలిసినట్లు ఇంకెవరికీ తెలియదు. మానవుల్లో తనంత దురదృష్టవంతుడైన వ్యక్తి ఎక్కడా వుండడు. అలా అనుకుని చింతించే స్వభావం కాదు సాండర్స్‌ది. ఎందుకంటే లోకంలో ఎందరో తల్లులున్నారు. వారి ముఖాలలోని నిండుదనం చూసి తృప్తిపడతాడు.

"ఫాదర్! మీరెప్పుడు తిరిగొస్తారు?"

రామయ్య ప్రశ్న ఆలోచనల నుండి బయటపడేసింది.

"చెప్పలేను..." అని, రెండు క్షణాల తరువాత చెప్పాడు. "జీవించే క్రమంలో మేలైన బతుకు కోసం వెళుతున్నాను. అది లభించనప్పుడు మాత్రమే వెనక్కి వస్తాను. నేనెక్కడున్నా మిమ్మల్ని ఎన్నటికీ మర్చిపోను. మీరు చేసిన సాయానికి ఏమిచ్చినా రుణం తీరదు. నిత్యం మీ కుటుంబం కోసం ప్రార్థన చేస్తాను"

రైలు బండి వచ్చింది.

సాండర్స్ ఒక పెట్టెలోకి ఎక్కి తన దేశ ఆచారం ప్రకారం చెయ్యి ఊపాడు. బదులుగా రామయ్య నమస్కరించాడు.

రైలు కూతపెట్టి కదిలింది.

* * *

"మీ పేరు?"

"రెవరెండం సాండర్స్..."

"మీరు మునిపల్లె చర్చిలో ఫాదర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఈ నౌకరీ చెయ్యాలని ఎందుకనుకున్నారు?"

సాండర్స్ కళ్ళల్లోకి చూస్తూ ప్రశ్నించాడు ఆ సభ్యుడు. అది బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పరచిన కమిటీ. పెద్ద టేబుల్ వెనుక ముగ్గురు కూర్చుని వున్నారు.

"ఎక్కువ బాధ్యతలు గల నౌకరీ చెయ్యాలనే కోరికతో దరఖాస్తు పంపాను" తొణక్కుండా జవాబిచ్చాడు సాండర్స్.

"బిషప్ నుంచి అనుమతి తెచ్చారా?"

"అంత వ్యవధి లేకపోయింది. ఇక్కడకు బయలు దేరేముందు అనుమతి కోరుతూ లేఖ రాశాను. నా స్థానంలో పని చెయ్యడానికి మరో ఫాదర్ సంసిద్ధత వ్యక్తం చేసి వున్నారు. కనుక బిషప్ అనుమతి మంజూరు చేస్తారు" నమ్మకంగా చెప్పాడు.

"అంటే మీరు చర్చి బాధ్యతల నుండి తప్పుకోవాలని ముందే అనుకున్నారా?"

"ఒకప్పుడు మానసిక స్థితి డోలాయమానంగా ఉండి అనుకున్నాను"

"ఇప్పుడు?"

"ఆ స్థితి నుండి బయటపడ్డాను."

"ఈ నౌకరీ ఇవ్వకపోతే ఏం చేస్తారు?" మరో సభ్యుడు ప్రశ్నించాడు. అతని మెడలో శిలువ వేలాడుతోంది.

"ప్రభువుకి నా పట్ల దయ కలగలేదనుకుంటాను"

"ఈ నౌకరీ మీకివ్వడం వల్ల బ్రిటిష్ ప్రభుత్వానికి ఎలాంటి లాభం కలుగుతుందో వివరించండి" మూడో సభ్యుడు అన్నాడు.

అది చాలా కీలకమైన ప్రశ్న అని మన సుకి అన్పించింది. అయినా కూడా ఆలోచించడానికి సమయం తీసుకోలేదతను.

"ఈ దేశ ప్రజలు ప్రభుత్వ వ్యతిరేక ఆలోచనలు చెయ్యకుండా నా విధులు నిర్వర్తిస్తాను. వారిలో ప్రభుత్వం మీద విశ్వాసం కలిగేటట్టు నడుచుకుంటాను"

ఆ సభ్యుడు తల పంకించాడు.

కమిటీ కోరిక మీద బయటకు నడిచాడు సాండర్స్. వారికి నచ్చిన జవాబులు ఇచ్చానని నమ్మకం లేకపోవడంతో ముఖం చిన్నబోయింది. సాయంకాలం ఆ భవంతి నుండి బయటకొస్తున్నప్పుడు మాత్రం ముఖం పున్నమి చంద్రునిలా వెలిగిపోతోంది.

డిస్ట్రిక్ట్ పోలీసు అధికారిగా ఉత్తర్వు అందుకోవడమే దానికి కారణం.

## 9



డోక్రీబేడా గ్రామస్థులంతా రచ్చబండ దగ్గర చేరారు. గ్రామ సావోతా జామిరికోదు పక్కన కూర్చున్న చాలుజోడీ గ్రామస్థుని వైపు అందరూ ఆసక్తిగా చూస్తున్నారు. అతను ఆ మధ్యాహ్నం గ్రామానికి వచ్చి సావోతాని కలిశాడు. ఆ సందర్భంగా రచ్చబండ వద్ద సమావేశం ఏర్పాటు చేశాడు సావోతా జామిరికోదు.

"నువ్వు తెచ్చిన కబురు అందరికీ సెప్పు" సావోతా అతనితో అన్నాడు.

అతను గొంతు సర్దుకొని చెప్పసాగాడు.

"మీ గ్రామపు అమ్మాయి పుల్మే మా గ్రామంలో జీవించడానికి వనదేవత సాక్షిగా చాలుజోడీ అబ్బాయి సోభెనా కోదుతో మనసు కలిపి, చెయ్యి అందించి వచ్చేసింది. నేటికి మూడోనాడు ఉదయం లగ్నం నిర్ణయించాడు మా గ్రామపూజారి. ఆ వేడుకకి తరలిరమ్మని పుల్మే వైపు గ్రామస్థులయిన మిమ్మల్ని చాలుజోడీ తరుపున పిలుపుకొచ్చాను. గ్రామం యావత్తూ వస్తే మరింతగా సంతోషిస్తామని మా సావోతా విన్నవించుకున్నాడు. మన రెండు గ్రామాలకి ఇదివరకే బంధుత్వం ఉందని గుర్తు చెయ్యమన్నాడు"

కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దం అలుముకుంది అక్కడ.

"ఎట్టుంది నాబొట్టే?" పుల్మే తల్లి అడిగింది.

"నీ బిడ్డ మా గ్రామంలో అడుగెట్టేక వర్షం రెండు దినాలు ఆగకుండా కురిసింది. బలిసిన దుప్పి ఒకటి వేటలో పడింది. ఈ ఏడు పంటలు ఎక్కువగా పండుతాయని, అన్నీ శుభాలే జరుగుతాయని మా పూజారి సెప్పాడు. పుల్మేని కళ్ళల్లో పెట్టుకుని సూసుకుంటున్నాడు సోభెనా కోదు. ఆమె వచ్చింది లగాయితు గ్రామంలో విందులు, వినోదాలు జరుగుతున్నాయి..."

ఆ మాటలకు పుల్మే తల్లి వదనం ప్రకాశించింది.

అలాంటి సందర్భాలలో మాటలు తెలిసినవాడిని రాజీ కోసం పంపుతారు. అతను మాటలు తెలిసిన వాడేకాక, ఆ మాటలు సమయోచితంగా ఉపయోగించే నేర్పున్నవాడు.

"అవును... నా బొట్టె అదృష్టవంతురాలు" పుల్మే తల్లి పరవశంగా అంది.

"అతిథిగా వచ్చినోడు మా గుంటని లేపుకుపోవడం ఏం న్యాయం?" ఒకతను గొంతు పెంచి అడిగాడు.

చాలుజోడీ గ్రామస్థుడు తొట్రుపడలేదు.

"డోక్రీబేడా గ్రామంలో పిల్లని ఎత్తుకొచ్చి పెళ్ళాడిన వాళ్ళు లేరా?" అడిగాడు.

ఎవరూ సమాధానం చెప్పే ప్రయత్నం చెయ్యలేదు.

"పుల్మేని ఎత్తుకెళుతున్నట్టు తెలిస్తే తల నరికేవాడిని" అన్నాడో యువకుడు ఆవేశంగా.

"నోర్మూసుకో" అరిచాడు సావోతా.

"మన జాతికి రీతి, నీతి అనేవి ఉన్నాయి. పిలుపుకొచ్చిన పెద్ద మనిషితో మర్యాద తప్పి మాట్లాడటం సబబు కాదు. ఇక్కడ పెద్దలు, పుల్మేని కన్నవారు ఉన్నారు. పడుచు ఇష్టపడి వెళ్ళినాక మనం సెయ్యడానికి ఏటీ లేదని మర్చిపోకండి. ఈ కోదు నేల ఆచారం ప్రకారమే పుల్మే పెళ్ళి జరుగుతుంది" ఉద్రేకాన్ని అదుపు చేసుకుని అన్నాడు సావోతా జామిరికోదు.

ఆ యువకుడు మొహం దించుకున్నాడు. అతనికి పుల్మేతో చిన్నప్పటినుంచి స్నేహం. ఎప్పుడూ ఒకరినొకరు వదలకుండా తిరిగేవారు. వయసొచ్చినాక ఆ పిల్లని వశపర్చుకోవడానికి చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఆమె మరో యువకునితో జట్టు కట్టలేదు. అందుచేత పెళ్ళి చేసుకునే అవకాశం తనకే వస్తుందని అనుకున్నాడు.

ఈ సంవత్సరం రెండు గ్రామాల వారు కలిసి పులి వేటకి వెళ్ళారు. అప్పుడు వచ్చిన సోఖెనా కోదుని పుల్మే ఎక్కడ చూసిందో, ఏ క్షణంలో మనసు పడిందో ఎవరూ పసిగట్టలేకపోయారు. ఆ యువకుని మెలితిరిగిన కండలు, వేటలో చూపించిన చొరవ చూసి పుల్మే జతకట్టి ఉంటుందని, ఆమె వెళ్ళిపోయాక డోక్రీబేడా ఆడ వాళ్ళు గుసగుసలు పోయారు.

రచ్చబండ దగ్గర సమావేశం ముగిసింది.

* * *

గ్రామ సావోతా జామిరి కోదు, పుల్మే తల్లిదండ్రులు, కొంతమంది గ్రామపెద్దలు, ఉత్సాహ పడుతున్న యువతీయువకులు డోక్రీబేడా నుంచి ప్రయాణమయ్యారు. ఉదయం అంబలి తాగి నడవడం మొదలెట్టి సూర్యుడు తలమీదకొచ్చేసరికి చాలుజోడీ గ్రామం చేరుకున్నారు. ఆ సమయానికే వారు వస్తారని తెలిసినట్టు కొంతమంది గ్రామం మొదట్లో ఎదురు చూస్తున్నారు.

"రండి... రండి..." ఆహ్వానించాడు చాలుజోడీ సావోతా.

గంభీరంగా తల పంకించాడు జామిరికోదు.

ఆడ పెళ్ళివారు బెట్టుగా ఉండాలనేది కోదు పద్ధతి. అందుకే ఎవరూ మాట్లాడే ప్రయత్నం చెయ్యలేదు. అంతా మౌనంగా జామిరికోదు వెనుక గ్రామంలోకి ప్రవేశించారు. వారందరికీ బస ఏర్పాటు చెయ్యబడింది. కొందరు సోఖెనా కోదుని వెతుక్కుంటూ వెళ్ళారు. గ్రామం మొత్తం తిరిగి చివరికి ఊరు చివర క్షవరం చేయించుకుంటున్న అతన్ని చూశారు. కూడబలుక్కుని రహస్యంగా తలో పక్కకి చెదిరిపోయి సోఖెనా కోదుని గమనిస్తున్నారు.

పాతకాలం నాటి మంగలి కత్తితో సాఖెనా కోదు వెంట్రుకలు

మన జాతికి రీతి, నీతి అనేవి ఉన్నాయి. పడుచు ఇష్టపడి వెళ్ళినాక మనం సెయ్యడానికి ఏటీ లేదని మర్చి పోకండి. ఈ కోదు నేల అచారం ప్రకారమే పుల్మే పెళ్ళి జరుగుతుంది

తొలగిస్తున్నాడు ఒకతను. సోఖెనా కోదు మునగదీసుకుని కూర్చు న్నాడు. గెడ్డం, మీసాలు తీసేసి తల వెనుక పిలకలా కొద్దిపాటి జుట్టు వదిలి చుట్టూ తెల్లగా గొరిగాడు. అక్కడక్కడ గంట్లు పడి రక్తం స్రవిస్తోంది. పని పూర్తయినాక లేచి నిలబడి మెడమీద పడిన వెంట్రుకలు దులుపుకుని గెడ్డవైపు వెళ్ళాడతను. ఆకులతో ఒళ్ళు రుద్దుకుని స్నానం ముగించి గ్రామంవైపు వస్తున్నాడు.

డోక్రీబేడా మనుషులు హఠాత్తుగా సోఖెనా కోదు మీదపడి కొట్టడం ప్రారంభించారు. ముందు కలవరపడినా వారిని గుర్తుపట్టి మాట్లాడకుండా దెబ్బలు భరించాడతను. కొద్దిసేపు కొట్టి అతన్ని వదిలేశారు వాళ్ళు. అదంతా వివాహ వేడుకలలో ఓ భాగం. ఊరి పిల్లని చెప్పాపెట్టకుండా తీసుకుపోయి తమని బాధపెట్టినందుకు ప్రతిచర్య అది. చాలుజోడీ వారు అది చూసి కూడా కల్పించుకో కుండా ఉండటానికి అదే కారణం.

ఆ గ్రామ రచ్చబండ వద్ద రెండు గ్రామాల వారు సమావేశమ య్యారు. సోఖెనా కోదు తండ్రి కన్యాశుల్కం పది రూపాయలు పుల్మే తండ్రికి అందరి సమక్షంలో చెల్లించాడు. పద్ధతి ప్రకారం రెండు డబ్బా లతో విప్ప సారా, ఒక మేకపోతు డోక్రీబేడా వారికి ఇచ్చుకున్నాడు. అప్పటికి చీకటి పడిపోయింది. విందు మొదలయింది.

తెల్లవారితే లగ్నం.

అప్పటికే చాలాసార్లు బయటికొచ్చి తిరిగి గుడిసెలోకి వెళ్ళి, అక్కడ కాలు నిలవక మరోసారి వచ్చి గుమ్మంలో నిలబడింది పుల్మే. తన పుట్టింటివాళ్ళు వచ్చారనే వార్త మధ్యాహ్నం తెలిసింది. అప్పటినుంచి ఆమె అలానే చేస్తోంది. తిండి తినాలనే ధ్యాస లేక పోయింది. రచ్చబండ దగ్గిర సమావేశం మొదలవడం, ముగి యడం గమనించింది. అంతా సజావుగా జరిగిపోయినా ఆమె మాత్రం కాలుకాలిన పిల్లిలా తిరగడం మానలేదు.

ఎదురుగా చీకటిలో రెండు ఆకారాలు చూసి, వాటిని పోల్చుకుని రెప్పవేయడం మరచి చూస్తూ వుండిపోయింది. తనని కని పద హారు సంవత్సరాలు పెంచిన తల్లిదండ్రులు.

పుల్మేని "అమ్మా" అని ప్రేమగా పిలిచేవాడు తండ్రి. పొలం పని నుంచి ఇంటికొచ్చిన మరుక్షణం కూతురి అజా కనుక్కునేవాడు. తండ్రి స్వరం విన్నప్పుడు లేడిలా పరిగెత్తుకు వెళ్ళేది. ఆ తండ్రి ఇప్పుడు చీకట్లో పరాయివాడిలా నిలుచుని ఉన్నాడు. మాట నేర్పి కింది దేశంలో ఆడపిల్లలు పైట ఎలా వేసుకుంటారో చెప్పి, శరీ రంలో వస్తున్న మార్పులు గమనించి నడత మప్పిన తల్లి ఆ తండ్రి పక్కన- తను కూడా పరాయి దానిలా నిలబడింది.

పుల్మేకి దుఃఖం తన్నుకొచ్చింది.

"ఎందుకమ్మా ఏడుస్తున్నావ్?" దగ్గరకొచ్చి గద్గదంగా అన్నాడు తండ్రి.

**ఎదురుగా చీకటిలో రెండు ఆకారాల్ని చూసి, వాటిని పోల్చుకుని రెప్పవేయడం మరచి చూస్తూ ఉండి పోయింది. తనని కని పదహారు సంవత్సరాలు పెంచిన తల్లిదండ్రులు.**

పుల్మే గొంతు నుండే కాకుండా ఆమె తల్లి నుండి కూడా వెక్కిళ్ల శబ్దం వినిపిస్తోంది.

ఇంతలో అక్కడకి సోఖెనాకోదు తండ్రి వచ్చాడు.

"ఏమే! నీ పుట్టింటి వారిని బయటే నిలబెట్టేస్తావా? లోపలికి పిలిచి మర్యాద సెయ్యి. చాలుజోడీ వారికి పట్టింపులెక్కువ. ఎవర్రైనా సూస్తే కన్నవాళ్ళకి మర్యాద సెయ్యడం తెలియని పిల్ల అనుకోగలరు..." అన్నాడు.

అయినా పుల్మే దుఃఖం ఉపశమించలేదు.

కూతురు మాట పడటం ఇష్టం లేనట్టు తల్లిదండ్రులు చొరవగా గుడిసెలోకి నడిచారు. చిన్నగా నవ్వుకుని అక్కడనుంచి వెళ్ళిపోయాడు సోఖెనాకోదు తండ్రి.

ఆ గుడిసె కొడుకు కోసం సోఖెనాకోదు తండ్రి కొత్తగా కట్టింది. లోపల చిన్న నూనె దీపం ఒకటి వెలుగుతోంది. అలికి ముగ్గు పెట్టిన గుడిసె ఆ వెలుగులో శుభ్రంగా కనిపిస్తోంది. కోదు పడుచు ఎక్కడ జీవించాలని అనుకుంటుందో అక్కడ తన ఇల్లు తనే చక్కబెట్టుకోవాలి. ఇల్లు సర్దుకోవడం రాకపోతే తల్లిని నిందిస్తారు. పని, పాటా నేర్పకుండా పెంచిందని.

అన్ని సంవత్సరాలు గుండెల్లో పెట్టుకుని పెంచిన కూతురు బంధాలన్నీ తెంచుకుని ఒక్క గెంతులో ఆ గ్రామం రావడం తల్లిదండ్రులకు కష్టం కలిగించింది. వయసు దేనినైనా తెంచేస్తుందని తెలిసినా కడుపు కోత భరించడం కష్టంగా ఉంది. హఠాత్తుగా కన్న కూతురు పరాయిదైపోయింది. ఇక నుంచి అక్కడే ఉంటుంది. అక్కడే సంసారం చేసి పిల్లల్ని కని పెద్ద చేస్తుంది. అక్కడే చివరికి మట్టిలో కలిసిపోతుంది.

ఆమెకి ఇంక ఎవరూ అక్కర్లేదు.

కోదుల్లో ఆడదానికి ఎంతో విలువ ఉంది. భర్త సరిగ్గా చూడకపోతే, రచ్చబండ దగ్గిర "ఇక నీతో కాపురం చెయ్యను" అని ఒక్క ముక్క అంటే చాలు. వారి బంధం ఎన్ని సంవత్సరాలదైనా పుటుక్కుమని తెగిపోతుంది. ఆడదానికి ఇష్టం లేనప్పుడు ఎవరూ కట్టి పడెయ్యలేరు. ఇష్టపడినప్పుడు ఆపలేరు.

ఆడపిల్లని కన్నవారు అక్కడ మౌన ప్రేక్షకులు.

విందు జరుగుతున్న ప్రదేశం నుంచి అతి ప్రాచీనమైన కోదు గీతాలు వినిపిస్తున్నాయి. గాలితో పాటు అవి నలుదిశల విస్తరిస్తున్నాయి.

ఆ గ్రామాన్ని రక్షిస్తున్న సిపాయిల్లా చుట్టూ కొండలు. వాటికి అందాలు అద్దినట్టు దట్టంగా పెరిగిన పచ్చటి చెట్లు. ఇవన్నీ కడుపులో దాచుకున్న చీకటి. ఆ చీకటి ఆధిపత్యాన్ని తగ్గిస్తూ దూరంగా ఆకాశంలో వెలుగుతున్న బంధువు- గ్రామంలో జరుగుతున్న సందడికి మూగసాక్షులు.

తెల్లవారేసరికి సోఖెనాకోదు గుడిసె ముందు పందిరి వెలిసింది.

అర్ధరాత్రి ఎవరి కంటా పడకుండా గెడ్డకెళ్ళి కుండతో నీరు తెచ్చి, భద్రపరిచి, ఆ జలంతో మంగళ కలశం పెట్టాడు పూజారి. పుల్మే అడవిలోకి వెళ్ళి దుంపలు తవ్వి తెచ్చింది. కాపురం చెయ్యాల్సిన ఆడది ముందుగా దుంపలు తేవాలి. కోదు రాజ్యంలో తరతరాల నుంచి వస్తున్న ఆచారమది.

బాజాలు మోగాయి.

పందిరి ముందు కర్ర పాతి నీడ పరీక్షించసాగాడు పూజారి. సూర్యుడు పైకి లేచే కొద్దీ నీడ పొట్టిదవుతోంది. హఠాత్తుగా అతను అందరికి వినిపించేటట్టు అరిచాడు.

"పెళ్ళి మొదలయింది"

వరుణ్ణి తీసుకుని మగ పెళ్ళివారు, వధువుని తీసుకుని ఆడ పెళ్ళివారు పందిట్లోకి వచ్చారు. పూజారి సైగ చేసిన మరుక్షణం బాజాలు జోరందుకున్నాయి. నీళ్ల కడవకి అరిటాకులు చుట్టి వధువు తల మీద పెట్టాడు పూజారి. అతని సూచన ప్రకారం కడవ మోసుకుంటూ వరుని చుట్టూ ప్రదక్షిణ చేసింది పుల్మే. చుట్టూ చేరిన వారు ఆ

# చతుర భాషితాలు

ప్రపంచాన్ని మనం సరిగా అవగాహన చేసుకోలేక ప్రపంచం మోసగిస్తుందని అనుకుంటాము.
**–రవీంద్రనాథ్ ఠాగూర్**

సంఘంలో ఆచారాలు పరిపాకంచెందిన అనుభవాల ఫలితాలు, కొంత వరకు మనం వాటికి తల ఒగ్గక తప్పదు.
**–ఎ.ఎ. హాడె**

ఒక్క నిముషం ఆత్మపరిశీలన ఒక జీవిత కాలపు అనుభవంతో సమాన మైన విలువగలది.
**– డి.డబ్ల్యు. హోల్‌మన్**

శ్మశానానికి కంచె వేయడం వెర్రితనం. లోపలి వాళ్ళు బయటకు వెళ్ళలేరు. బయటివాళ్ళు లోపలికి వెళ్ళడానికి ఇష్టపడరు.
**– ఆర్థర్ బ్రిస్‌బేన్**

తెలివైనవాడు తన ఉపన్యాసాన్ని, తన మనసును అదుపులో ఉంచుకోవడం అవసరం.
**– ఉపనిషత్తు**

నిజం తెలుసుకోవడం కష్ట సాధ్యమే. అయినా తొందరపాటు నిర్ణయాల కంటే అదే మంచిది.
**–ఒక సామెత**

ఒక వ్యక్తి ఆలోచనలను బట్టి అతణ్ణి అంచనా వేయలేం. బయటకు వ్యక్తం కాకుండా తనలో దాచి ఉంచిన దాన్నిబట్టే అతడే మిటో అంచనా వేయగలం.
**–ఆంద్రే మాల్‌రాక్స్**

పొరుగువాడిని ప్రేమించడం కన్నా మొత్తంగా మానవాళిని ప్రేమించడం ఎంతో సులభం
**– ఎరిక్ హోఫర్**

ఉత్తమ చట్టాల ద్వారా భౌతిక స్థితిగతుల్ని మెరుగు పరచడం కష్టసాధ్యం. కాని దుష్ట చట్టాల ద్వారా వాటిని ధ్వంసం చేయడం ఎంతో సులువు
**– రూజ్ వెల్ట్**

కార్యక్రమాన్ని ఆసక్తిగా చూస్తున్నారు.

పెద్ద కంఠంతో మంత్రాలు చదువుతూ, మధ్యలో వధూవరులకు సూచనల్లు ఇస్తున్నాడు పూజారి.

సోఖెనాకోదు కుడికాలెత్తి పుల్మే ఎడమ పాదంమీద ఆనించి నొక్కిపట్టాడు. కార్యక్రమం చివరి దశకు చేరినట్టు బాజాలు మరింత జోరుగా మోగాయి. రెండు పక్షాల మనుషులు వధూవరుల చుట్టూ తిరిగారు.

పూజారి వధూవరులను ఒకచోట చేర్చి కడవ ఇద్దరి తలల మీద పెట్టి మంత్రాలు చదివాడు. కడవ కిందికి దించి ఆ నీటిని వారి తలల మీద కుమ్మరించాడు. మరుక్షణం ఆడవాళ్ళు గుమికూడి పుల్మేని అమాంతంగా పైకెత్తారు. మగవాళ్ళు సోఖెనాకోదుని ఎత్తుకున్నారు. ఇరు పక్షాల వారు పోటాపోటీగా నాట్యం మొదలెట్టారు.

ఎవరో పాటందుకున్నారు.

అది ఏ కాలం నాటిదో?

ఎవరు కూర్చి పాడారో?

ఎవరికీ తెలియదు.

పెళ్ళి వేడుకలో తమ తల్లిదండ్రులు పాడారు కాబట్టి తాము కూడా పాడుతున్నారు. పెద్దలు చేసిన పనుల్ని గౌరవిస్తారు కోదులు. అవి గుడ్డిగా అనుసరిస్తారు. తమ సంస్కృతి గొప్పదని తలుస్తారు.

ఆటపాటలతోనే పగలంతా గడిచిపోయి రాత్రయింది. ఒక మేకపోతుని నరికి వంట ప్రారంభించారు. సోఖెనాకోదు తండ్రి పనుల్లో మునిగిపోయాడు. అతిథులకు ఎలాంటి లోటు రాకూడదు. వారు ఇతర గ్రామస్థుల ముందు తమని వేలెత్తి చూపకూడదు. అపఖ్యాతి వస్తే పీక తెగినట్టు లెక్క.

అక్కడ కల్లు, సారాయి ఏరులై పారుతోంది. ఆ వాసన ఊరి చివరి వరకూ వ్యాపించింది. కల్లు, సారాయి తాగి కడుపు నిండా మాంసం తిని నాట్యం చేసి చేసి అలసిపోయి ఒక్కొక్కరు నేలకూలుతున్నారు. ఆ జాతిలో ఏకైక శుభకార్యం పెళ్ళి ఒక్కటే. అందుకే అంత ప్రాముఖ్యత.

విప్పసారా తాగి వరుడు, కొద్దిగా కల్లు పుచ్చుకున్న వధువు విందుభోజనం తిని తమ గుడిసె నుంచి బయటకొచ్చి మైదానంలో కలుసుకున్నారు. అక్కడకి గ్రామంలోని సందడి వినిపిస్తూనే వుంది.

అది రాత్రా? లేక పగలా?

ఏం జరుగుతోంది?

గ్రామస్థులు నాట్యం ఆపేశారా?

తుఫాను రాబోతోందా? లేక పులి సంచరిస్తోందా?

అవేమీ పట్టని వారిద్దరూ ప్రకృతి మాత సాక్షిగా ఒక దగ్గర కలిశారు.

సోఖెనాకోదు కండలు తిరిగిన బలమైన ఛాతీ బలిసిన పుల్మే గుండెల్ని గట్టిగా అదుముకుంది. ఆమె అతన్ని తోసిందో లేక అతనే ఆమెని నెట్టివేశాడో కాని ఇద్దరూ కూడబలుక్కున్నట్టు కింద పడిపోయారు.

ఆకాశంలో చుక్కలు కనిపిస్తున్నాయి పుల్మేకి.

* * *

**కోదు** సమాజంలో మొగుడు పెళ్ళాం పిల్లలు పుట్టేవరకూ ఒకరినొకరు విడవకుండా తిరుగుతారు. వేటకి పోతున్నప్పుడు కూడా పెళ్ళాన్ని వెంట తీసుకుపోతాడు మగవాడు. ఇద్దరూ కలిసి చెట్ల వెనుక అదృశ్యమవుతారు. ఆకలి, అలుపు వారికి గుర్తుండవు. వారి చేష్టల్ని గ్రామం అంతా మౌనంగా చూస్తుంది. ఒంటరిగా చిక్కినప్పుడు మగవాళ్ళు అతణ్ణి, ఆడవాళ్ళు ఆమెని ఆట పట్టిస్తారు.

అప్పుడే వయసు మళ్ళినవారితో జ్ఞాపకాలు కదిలేది.

తల్లిలాంటి అడవి లేకపోతే తమకి బతుకు లేదని తలుస్తారు కోదులు. అడవిలో సంచరించడానికి ఎల్లప్పుడూ ఉత్సాహం చూపుతారు. కలపకోసం, వేట కోసం, విప్పపువ్వు ఏరడం కోసం అడవిలో తిరుగుతారు. తెలియని ప్రదేశాలు చూడటా

నికి ఆసక్తి కనపరుస్తారు. జంతువులు దాడి చేస్తాయని ఏమాత్రం సందేహించరు.

ప్రతి కోడూ అడవిలో ఓ రహస్య జాగా ఎంపికచేసి చుట్టు పక్కల పరిశీలించి అక్కడ శుభ్రం చేస్తాడు. దాని గురించి ఎవరికీ చెప్పడు. పెళ్ళి చేసుకుని భార్యని అక్కడికి తీసుకొస్తాడు. ఎంత మంచి జాగా అయితే పడుచు అంతగా సంతోషపడుతుంది. తమ రాసక్రీడ ఎవరి కంటా పడకూడదనుకుంటుందామె. పాపమని, అపవిత్రమని సృష్టికార్యాన్ని తలచరు. గెలిచేవరకూ పోరాడాలి. పోరాడినప్పుడే గెలుపు, ఓటములు నిర్ణయమయ్యేది. అందుకు సరిపడే జాగా కావాలి. దాని కోసమే అడవిలో తిరిగి రహస్య ప్రదేశం కనిపెడతాడు.

అలాంటి తరుణం కోసం పుల్మే మనసు తహతహలాడుతోంది. పెళ్ళయిన మూడోనాడు ఆమె బంధువులు గ్రామానికి తిరిగి వెళ్ళారు. ఒంటరిగా దిగులుగా కూర్చున్న భార్యని అడిగాడు సోకెనాకోదు.

"నాతో వేటకి వస్తావా? "

ఆమె మెరిసే కళ్ళతో తలూపింది.

"నీకు భయం వెయ్యదా? " అడిగాడు. నవ్వును పెదాల చాటున నొక్కిపట్టి పుల్మే ఆశ్చర్యంగా చూసింది.

"నువ్వున్నావుగా"

"నేనంటే అంత నమ్మకమా? "

"నమ్మకం లేకపోతే చెయ్యందుకుని వెంట వస్తానూ..."

వారికి తెలుసు ఆ సంభాషణ పర్యవసానం.

సోఖెనా కోదు బాకు మొలలో దోపుకుని ఈటె అందుకున్నాడు. పైటని రొమ్ములు కనపడకుండా కప్పు

## స్వీట్లు తగ్గించండోయ్...

'ఇప్పుడే స్వీట్లు తింటే ఇక అన్నం ఏం తింటారు?' అని అమ్మ చేతిలో తిట్లు తినని వారుండరు. ఎందుకంటే, స్వీట్లు కనబడితే అన్నం లేకున్నా ఫరవాలేదు అని స్వీట్లమీదకు ఎగబడటం పిల్లలకూ పెద్దలకూ అలవాటే. ఇటీవల జరిపిన పరిశోధనల ప్రకారం ఇది నిజమేనని తేలింది. స్వీట్ల వల్ల ఆకలి చచ్చిపోతుంది. యేల్ యూనివర్సిటీకి చెందిన డాక్టర్లు ఓ ఇరవై నాలుగు మందిని ఎంచుకున్నారు. వారిలో కొందరికి అన్నం తినటానికి అరగంట ముందు తియ్యటి పానీయం ఇచ్చారు. మరికొందరికి నిమ్మకాయ రసం ఇచ్చారు. మిగిలిన వారితోటి మంచి నీళ్ల తాగించారు. అరగంట తరువాత అన్నం తినమంటే నిమ్మనీరు, మంచినీరు తాగిన వారు మామూలుగానే అన్నం లాగించేశారట. కానీ తీపి ద్రవం తాగిన వారు మాత్రం సరిగ్గా తినలేకపోయారట. పైగా వారు తిన్నవి కూడా కేలరీలు పెంచని, కొవ్వు తక్కువగా ఉన్న పదార్థాలేనట. ఆ తరువాత వారు డ్రింకులు మార్చి మార్చి ఇస్తూ ఓ నాలుగు వారాలు వరుసగా పరిశోధనలు జరిపి 'ఇది నిజం' అని తేల్చారు. డైటింగ్ చేయాలనుకున్న వారు అన్నం తినేందుకు అరగంట ముందు స్వీట్లు తింటే వారు తినే అన్నం పరిమాణం తగ్గుతుందని తేల్చిచెప్పారు. అరగంట ముందు వారానికి సరిపడ స్వీట్లు లాగించేసి 'డైటింగ్' అని ఎవరైనా అంటే! వాళ్లేం చెబుతారో మరి.



కుంది పుల్మే. అయినా కండ పట్టిన గుండ్రటి భుజాలు కనిపిస్తూనే ఉన్నాయి. ఒకరి వెనుక ఒకరు గ్రామం దాటుతుంటే ఆడవాళ్ళు ముసిముసిగా నవ్వుకుంటూ చూడని వారికి రహస్యంగా పిలిచి చూపెడు తున్నారు. పిల్లలు గెంతుతూ ఆ ఇద్దరి వెనుక కొంతదూరం వెళ్ళి ఎవరో కేక వెయ్యడంతో వెనక్కి తిరిగారు.

పుల్మే సిగ్గుపడిపోయింది. ముందు నడు స్తున్న భర్తని పిలిచి నెమ్మదిగా చెప్పింది.

"ఆడంగులు నవ్వుతున్నారు"

"నవ్వనీ"

"వారి ముందు ఎలా తలెత్తుకోనూ..."

"తల దించుకోవడం దేనికి?"

"వేట నుంచి వచ్చినాక నన్నేడిపిస్తారు. వేటలో కొట్టిన జంతువులు ఏవీ అని అడు గుతారు. అడవిలో ఏటి చేశారో చెప్పమని నిలేస్తారు. అప్పుడు కళ్ళు మూసుకున్నావా, తెరిచి జరుగుతున్నది చూశావా అని అడు గుతారు"

సోఖెనాకోదు నవ్వాడు.

"అవన్నీ అడుగుతారని నీకెలా తెలుసు"

పుల్మే మొహం ఎర్రనై అందం రెట్టింప యింది. గ్రామంలో పడుచు జంటల్ని ఏడి పించిన వారిలో తను ఉన్నాననే విషయం చెప్పలేకపోయింది.

"పోనీ చెప్పేసేయి. ఏం పోతుంది" తిరిగి అన్నాడతను.

ఆమె తుళ్ళిపడింది.

"ఏం చెప్పమంటావూ?"

"చేసిందే చెప్పు, బొంకు దేనికి? అడిగిన వారంతా మొగుడుతో అడవికి పోయి వచ్చిన వాళ్ళే. పిల్లలు పుట్టి, ఇంటి పని పెరిగి, శరీరంలో చావ తగ్గిపోయింది. నీ లాంటి పడుచులు చెప్పే కబుర్లు విని ఆనం దిస్తారు. వారిని సంతోష పెడితే తొందరగా పిల్లలు పుడతారు"

పుల్మే మాట్లాడలేదు.

సోఖెనాకోదు లేని సమయం కనిపెట్టి ఆడవాళ్ళు బిలబిలా ఇంట్లోకి దూరిపో యారు. చుట్టూ కూర్చుని ముచ్చట్లు ప్రారం భించారు.

"గుంటా! రాత్రి ఏటయిందే" వయసు మళ్ళిన ఒకామె అడిగింది.

ఉలిక్కిపడింది పుల్మే. రాత్రి మొగుడు వెంట బయటకు వెళ్ళిన బోగట్టా తెలిసిపో యిందేమోనని సందేహించింది. మాటలు రాని మూగ దానిలా ఉండిపోయింది.

రాత్రి ఏమయిందో వారికెందుకు?

ఏం చెప్పాలి?

ఎన్నో ఏళ్ళ బట్టి కాపురాలు చేస్తున్నవా రికి ఒక్క రాత్రి తను మొగుడుతో గడిపితే ఆ సంగతులు చెప్పాలి. సిగ్గులేకుండా ప్రతిదీ అడుగుతారు. కుడి చేత్తో జబ్బ పట్టు కున్నాడంటే, ఎడమ చెయ్యి ఏం చేస్తోందీ అని ప్రశ్నిస్తారు. నీ చేతులు ఊరికే ఎందు కుంచావు అంటారు. ఆమైకంలో ఏం గుర్తుంటుంది చెప్పడానికి?

ఈ రాతి మనిషికి అవేమీ తెలియదు అనుకుంది.

బాటలో నడుస్తూ అడవిలోకి ప్రవేశిం చారు. మాటలు చెప్పుకుంటూ, తర్కించు కుంటూ సాగిపోతున్నారు. దారిలో అడవి రేగిపళ్ళు చెంగు నిండా ఏరింది పుల్మే. వాటిని తింటూ ఎగుడు దిగుడు నేలమీద ఏటవాలుగా నడిచి కొండపైకి చేరుకున్నారు.

ఒక చోట అలుపు తీర్చుకోవడానికి ఆగారు.

"మనం ఎక్కడకెళుతున్నాం?" పుల్మే అడి గింది.

"చెప్పను"

"మరి?"

"చూపిస్తా"

"గంధం చెట్టు?"

"కాదు"

"పుట్ట తేనె?"

"ఊహూ..."

"భూమి పనస?"

"అదిక్కడ లేదు..."



అతని కళ్ళల్లోకి ప్రేమగా చూసింది పుల్మే. ఆమె కళ్ళల్లో కనీకనపడనట్టు ఎర్రజీరలు పారాడుతున్నాయి. అసలే ఎత్తయిన ఎద. మనసులోని కోరికకి అనుగుణంగా మరికొంచెం ఎత్తయింది. వక్షాన్ని నామ మాత్రంగా వుంచిన పైట నిస్సహాయతను వ్యక్తం చేస్తోంది.

మనసు వశం తప్పి ఆమె వైపు వంగాడు సోఖెనాకోదు. రెండు క్షణాలన్నా గడవక ముందే చప్పున తల వెనక్కి తీసుకున్నాడు. అతని కింద పెదవి మీద పంటి గాటు ఉంది.

అక్కడ నుంచి కదలడానికి చాలా సమయమే పట్టింది వారికి. అడవిలో మరింత ముందుకి వెళ్ళిన తరువాత ఓ పొద తప్పించుకుని ఆగాడతను. ఒక్క క్షణం ఆలస్యంగా వచ్చిన ఆమె ముందుకి దృష్టి సారించింది.

దట్టమైన చెట్ల మధ్య విశాలమైన ఖాళీ ప్రదేశం. శ్రద్ధ తీసుకుని పెంచినట్టు నేల మీద పచ్చటి గడ్డి తివాచీ పరచినట్టుంది. ఎడమ పక్క కొండ పగులు నుండి నీటి చుక్కలు పడి కింద చిన్న మడుగు ఏర్పడింది. దానిపైన ఏటవాలుగా వంగిన చెట్టుకి అల్లుకున్న తీగనిండా ఎరుపు రంగు పూలు. గుబురుగా పెరిగిన వృక్షాల కొమ్మలు. ఒక దానితో ఒకటి పెనవేసుకుని నింగి మూసుకుపోయింది. ఆకుల నడుమ ఖాళీల నుండి సూర్యకాంతి వెండి తీగల్లా విడిపోయి నేలపైకి ప్రసరిస్తోంది. నీటి మడుగులో పడి కొన్ని కిరణాలు పరావర్తనం చెంది చెట్లమీదకి పాకుతున్నాయి.

పుట్టి బుద్దెరిగాక అలాంటి రమణీయ సుందర ప్రదేశం చూడలేదు పుల్మే. అడవిలో ప్రతి చోటు అందంగానే ఉంటుంది. కాని దీని ప్రత్యేకత వేరు. జతగాడు తనతో



ఏకాంతంగా గడపడం కోసం ఆ ప్రదేశం వెదికి వుంచాడనే ఊహ వల్ల మరింత శోభ చేకూరింది. అతని సాన్నిహిత్యం వాంఛిస్తు న్నట్లు కొద్దిగా జరిగి తల భుజంపైన వాల్చింది. రాళ్ళలాంటి వక్షద్వయం స్పర్శకి ఉత్తేజితుడయ్యాడతను.

ఇద్దరూ ముందుకి నడిచారు.

బాకు, ఈటెలతో పాటు మొల గుడ్డ కూడా పక్కన పడేశాడు సోఖెనాకోదు. ఆ నగ్న రూపం చూసి సిగ్గుతో తల తిప్పుకుందామె. అతను పుల్మే కోక పట్టుకున్నాడు. ఆమె అడ్డు చెప్పేలోపు ముడి ఊడిపోయింది. ఆమెని అలాగే నేల మీద పడుకోబెట్టాడతను. ఇద్దరి శరీరాలు నిప్పుతో కాల్చి తీసినట్టు తయార య్యాయి.

అప్రయత్నంగా కళ్ళు మూసుకుంది పుల్మే. ఇంతకాలం తెలియని ఆ సుఖం మనసుని పరవశంతో ముంచెత్తుతోంది. దానికోసమే తప్ప ఈ జీవితం మరెందుకూ కాదనిపించింది.

చెట్టుమీద కూర్చున్న ఓ పసుపు రంగు పిట్ట వారినే దీక్షగా చూస్తోంది. అక్కడ జరుగుతున్నది అర్థం చేసుకోవడానికి ప్రయ త్నించింది. రెండు శరీరాలు వేరుపడే వరకూ చూసి ఎగిరి తూర్పు దిక్కు సాగిపో యింది.

సోఖెనాకోదు లేచి మడుగుని సమీపించి నీటిలో దిగాడు. అతని ఛాతీ వరకూ నీళ్ళు రావడం చూసి ఉత్సాహంగా తను కూడా నీళ్ళల్లోకి దిగింది పుల్మే. అలసిన శరీరాలు చల్లని నీటితో సేద తీరాయి.

సూరీడు తల మీదకొచ్చి వెలుగు తిన్నగా పడుతున్నప్పుడు తుప్పల్లోకి దూరి ఒక కుందేలుని పట్టుకొచ్చాడతను. బాకుతో చర్మం వలిచి, పొట్ట తొలగించి నీటితో కడి గాడు. నిప్పు చేసి మంట మీద దోరగా కాల్చాడు.

ఇద్దరూ ఆ మాంసం తిన్నారు.

మరికొంతసేపు అక్కడ గడిపి సూరీడు వాలిపోతున్నప్పుడు తియ్యటి అనుభవం మూట గట్టుకుని గ్రామం చేరుకు న్నారు.



## 10

పదెకరాల స్థలంలో నాలుగు పలకలుగా చెక్కిన కొండ రాళ్ళతో నిర్మించిన విశాలమైన బంగ్లా అది. దానికి చుట్టూ ఎత్తైన ప్రహరీ ఉంది. లోపల రకరకాల చెట్లు. పూల మొక్కలు ఉన్నాయి. దర్జాని సూచిస్తున్న బల మైన ఇనుప గేటు బార్లా తెరిచివుంది.

ఆ గేటు పక్కనే గుడారం ఒకటి కనిపి స్తోంది. ఆ గుడారానికి కుడివైపు నేల మీద ముగ్గుతో వేసిన గీతపైన తుపాకులు పట్టు కున్న జవాన్లు వరుసగా నిలుచున్నారు. గంజి పెట్టి సాపు చేయించిన ఖాకీ నిక్కర్లు మోకాళ్ల వరకూ ఉన్నాయి. ఎండపడి నల్లటి బూట్లు మెరుస్తున్నాయి. ఏదో ప్రత్యేక సందర్భంలో వాళ్ళక్కడ ఉన్నట్టుంది పరిస్థితి.

వారందరి దృష్టి రహదారి మీద వుంది.

నిక్కరు నిటారుగా ఉంటే అంతకంటే నిటారుగా నిలుచుని ఉన్నాడు ఆ నిక్కరు తొడిగిన సర్కిలు. మెరుస్తున్న బూట్లపైన ఖాకీ రంగు పట్టీలు కాలి పిక్కల మీదుగా మోకాలి వరకూ బిగించి కట్టాడు. నడుము కున్న తోలు బెల్టు ఎండలో జిగేల్మంటోంది. పిస్తోలు పోచ్‌తో బెల్టుకి ఎడమ పక్క వేలా డుతోంది.

తల చుట్టూ వెంట్రుకలు తీసేసి టోపీ పెట్టుకోవడం వల్ల గుండు చేయించుకున్నా డనే సందేహం కలుగుతోంది. వెంట్రుకలు లేనిచోట చర్మం నునుపుగా ఉంది. తీక్షణ

మైన కళ్ళకి హిట్లర్ మీసాలు జతకట్టాయి. అతణ్ణి చూసి పిల్లలే కాదు పెద్దలు కూడా జడుసుకుంటారనడంలో ఎలాంటి అతిశయోక్తి లేదు.

మోటారు కారు శబ్దం వినవచ్చింది.

ఒక్కసారిగా అందరూ సర్దుకున్నారు. కారు గేటులోంచి వెళ్ళి బంగ్లా ముందు ఆగింది. ముందు డోరు తెరుచుకుని ఒక జవాను మెరుపులా కిందకు దిగి వెనుక డోరు తెరిచాడు. లావాటి పొట్ట కదుపుతూ పరిగెత్తుకొచ్చి అటెన్షన్‌లో నిలుచున్నాడు సర్కిలు.

మల్లెపువ్వు లాంటి దుస్తుల్లో తెల్లటి వ్యక్తి ఒకతను కారు దిగాడు. సర్కిలు సెల్యూట్ చేశాడు. ఆ వ్యక్తి సెల్యూట్ అందుకుని జవాన్లు నిలుచున్న వైపు కదిలి వారికెదురుగా గుర్తుపెట్టిన చోట అటెన్షన్‌లో నిలుచున్నాడు.

"గార్డ్! జనరల్ సెల్యూట్ ప్రెజెంట్ ఆమ్" ఉరుములాంటి గొంతుతో అరిచాడు గార్డు కమాండర్.

జవానులు భుజాల మీదున్న తుపాకులు ముందుకి తెచ్చి ఉన్నతాధికారికి ఇచ్చే గౌరవ వందనం చేశారు. ఆ వ్యక్తి బదులుగా సెల్యూట్ చేసి తుపాకులు దించేవరకూ ఆగి ఫార్మాలిటీస్ ముగించి గుడారంలోకి నడిచాడు. పడుకోవడానికి ఉపయోగించే కంబళ్ళు ఒక క్రమంలో ఉన్నాయి. గుడారం చుట్టూ గడ్డి మోకాలు ఎత్తు పెరిగి ఉంది. వర్షం పడితే నీరు లోపలికి వచ్చేస్తుంది.

"గార్డు ఎప్పుడూ ఇక్కడే ఉంటాడా?" ప్రశ్నించాడతను సర్కిల్ని.

"యస్ సార్!"

"వారి కోసం ఇక్కడ ఒక గది ఎందుకు నిర్మించలేదు? వర్షం వస్తే ఎక్కడికి పోతారు?"

బంగ్లాలోకి అడుగుపెట్టక ముందే తనని నిలదీసేసరికి సర్కిలు కాళ్ళల్లో సన్నటి వణుకు మొదలయింది. ఓ చక్కటి ఆలోచన బుర్రలో కదిలింది.

"బదిలీపైన వెళ్లిన దొరగారు డబ్బు మంజూరు చెయ్యలేదు సార్" చెప్పాడు.

"నువ్వు ప్రతిపాదన పంపావా?"

సమాధానం లేదు సర్కిలు వద్ద. అవునంటే ప్రతిపాదన కోసం వెదుకుతాడు. లేదంటే అబద్ధం చెప్పినట్టు గ్రహిస్తాడు. ఎటూ పాలుపోక నీళ్ళు నమిలాడు.

"డోంట్‌సే యూస్‌లెస్ ఎక్స్‌ప్లనేషన్స్ మాన్! నువ్వు రాత్రి ఇంటికెళ్ళి ఇలాంటి నేల మీదనే నిద్రపోతున్నావా? కనీసం నీరు నిలువ చేసుకోవడానికి కుండ లేదు. సిబ్బందికి సౌకర్యాలు కల్పించని వాడు వారితో పని చేయించుకోవడానికి పనికిరాడు. వెంటనే కుండ పెట్టించు. నువ్వు ఏం చేస్తావో నాకు తెలియదు. పది రోజుల్లో ఇక్కడ గార్డు సిబ్బంది పడుకోవడానికి వీలుగా ఒక గది తయారు కావాలి. ఒక విషయం గుర్తుపెట్టుకో, ఇక ముందెప్పుడూ నాతో అబద్ధాలు చెప్పకు" కటువుగా హెచ్చరించి బయటి కొచ్చాడు దొర.

"గుడ్" గార్డు కమాండర్ భుజం తట్టి బంగ్లా వైపు నడిచాడు.

చెమటతో సర్కిలు బట్టలు తడిసిపోయాయి. మెదడు పని చెయ్యడం మానుకుంది. సాండర్స్ అనే బ్రిటిష్ వ్యక్తి సూపర్నెంట్‌గా వస్తున్నాడని తెలిసినప్పుడు వెకిలిగా నవ్వాడు. ఎవరొచ్చినా తన మాట వింటాడనే నమ్మకంతో కాని ఇప్పుడు ఇదీ అని చెప్పడానికి వీలుకాని దడ గుండెల్లో మొదలయింది. ఇలాంటి అధికారి తనకి మరిన్ని సమస్యలు సృష్టిస్తాడనే సందేహం మనసులో అంకురించింది.

సర్కిలు తేరుకోవడానికి కొంత సమయం పట్టింది. గుండె దిటవు చేసుకుని బంగ్లాలోకి నడిచాడు. సాండర్స్ హాలులో కూర్చుని ఉండటం చూసి ద్వారం వద్ద నిలిచిపోయాడు.

"కమాన్" పిలిచాడు సాండర్స్

అతన్ని సమీపించి మరోమారు విన యంగా సెల్యూట్ చేశాడు సర్కిలు.

"ఇక్కడ శాంతి భద్రతలు ఎలా ఉన్నాయి? " అడిగాడు.

"అదుపులో ఉన్నాయి సార్!"

"ఈ ఏడాది ఎన్నిహత్యలు జరిగాయి? "

"రెండు సార్!హంతకుల్ని పట్టుకున్నాం"

"గుడ్... దారి దోపిడీలు? "

"పది సార్"

"ఎంత మంది పట్టుబడ్డారు? "

"దోపిడీలన్నీ అడవి మార్గాల్లో జరిగాయి సార్! ఆటవికులు నేరాలకు పాల్పడుతున్నట్టు అనుమానించాం. దర్యాప్తు కోసం అడవిలోకి వెళితే ప్రాణాలతో తిరిగి వస్తామనే నమ్మకం లేక సిబ్బంది వెళ్ళడం లేదు సార్. అందువల్ల దర్యాప్తు పూర్తిచెయ్యలేక పోయాం"

సర్కిలు కళ్ళల్లోకి సూటిగా చూశాడు సాండర్స్.

"సిబ్బంది భయపడుతుంటే మీరెందుకు దర్యాప్తుకి పూనుకోలేదు? "

అతని ముందు మరికాసేపు నిలబడితే తన గుండె ఆగిపోతుందని అనుకున్నాడు సర్కిలు.

"సరే... సాయంకాలం మీ కార్యాలయం పరిశీలనకి వస్తాను. మీరు వెళ్ళి రికార్డులు సిద్ధంగా ఉంచండి. సిబ్బందిని నా ముందు హాజరు పెట్టాలి.."

సెల్యూట్ చేసి బతుకు జీవుడా అనుకుంటూ నిష్క్రమించాడు సర్కిలు.

బంగ్లాలో పనిచేసే వారిని పిలిచి వివరాలు తెలుసుకున్నాడు సాండర్స్. వంట మనిషితో చెప్పాడు.

"పండా! నాకు టీ కావాలి.."

టీ తాగి మొత్తం బంగ్లా పరిశీలించి, చుట్టూ వున్న ఖాళీ ప్రదేశం చూశాడు సాండర్స్. తన వెంట వస్తున్న పనివాడిని మాటల్లోకి దించి ఎన్నో వివరాలు సేకరించాడు. గతంలో పని చేసిన అధికారి మీద





అతడు అభిప్రాయం వెలిబుచ్చకపోవడం గమనించాడు. తోటలో కొన్ని మార్పులు సూచించి తిరిగి బంగ్లాలోకి వచ్చేశాడు.

ట్రైనింగ్ పూర్తిచేసి కొంతకాలం ఓ సీనియర్ అధికారి వద్ద పని చేశాడు. సాండర్స్ ప్రజా సమస్యలు, నేరాలు పరిష్కరించే విధానం వంటపట్టించుకుని నిద్రాహారాలు మాని శ్రమించి అనుభవం గడించాడు. జాతీయవాదుల్ని నేరస్థుల్లా చూడకూడదని అప్పుడే గ్రహించాడు. నాయకులపట్ల గౌరవం చూపడం, సహనం పాటించడం అలవర్చుకున్నాడు.

పని చెయ్యడంలోను, ఎదుటి వారికి సాయపడటంలోను అనిర్వచనీయమైన తృప్తి పొందసాగాడు. తనని తను సంస్కరించుకునే ప్రయత్నంలో అశాంతి దూరమయింది. మాటకి, చేతకి - మనసులోని భావానికి మంచి అద్దడం చేత దేవుని వాక్యాలు మరింత స్పష్టంగా బోధపడసాగాయి.

ఇప్పుడతని ప్రార్థన తృప్తిగా ముగుస్తోంది. ప్రార్థన పూర్తి చేశాక మరింత శక్తి సామర్థ్యాలు సమకూడిన భావన కలుగుతోంది. దైవ ఆరాధనలోని విశిష్టత అనుభూతి కాసాగింది. మానవుడే మహనీయుడనే సత్యం అవగతమవుతోంది.

ఆ రోజు సాయంకాలం సర్కిలు కార్యాలయం సందర్శించాడు సాండర్స్. అక్కడ సర్కిలు పని తీరులో నిర్లక్ష్యం చోటుచేసుకోవడం గమనించి హెచ్చరించాడతన్ని! ప్రజలతో క్రూరంగా ప్రవర్తించవద్దని జులుం చెయ్యడం సహించనని చెప్పాడు. సిబ్బందితో మాట్లాడి వారి కష్టసుఖాలు, కుటుంబ విషయాలు చనువుగా అడిగి తెలుసుకున్నాడు.

సాండర్స్ బంగ్లాకి తిరిగొచ్చేసరికి రాత్రయింది. వంట మనిషి తయారు చేసిన గోధుమ రొట్టెలు ఆరగించి, ఓ కప్పు టీతో డిన్నర్ ముగించాడు. తన పడక గది చేరు

కుని సర్కిల్ కార్యాలయం నుంచి వచ్చిన రికార్డులు చూడడం మొదలుపెట్టాడు. అవన్నీ పరిశీలించేసరికి అర్ధరాత్రయింది. బయట నుంచి సెంట్రీ బూట్ల చప్పుడు విని పిస్తోంది.

దోపిడి జరిగిన ప్రదేశాలన్నీ ఒక కాగితం మీద రాసుకున్నాడు. ప్రతి దోపిడీలో పది మంది దృఢకాయులు పాల్గొంటున్నారు. ప్రయాణికుల్ని భయభ్రాంతుల్ని చెయ్యడా నికి నాటు తుపాకులు, కత్తులు వాడుతు న్నారు. డబ్బు, బంగారంతో పాటు గుర్రాలు కూడా దొంగిలించుకుపోతున్నారు. భయ పెట్టి పని పూర్తి చెయ్యడం తప్ప ఇంత వరకూ ఎవర్నీ గాయపర్చలేదు. నిర్మానుష్య మైన మల్కనగిరి మార్గంలో దోపిడీలు జరి గాయి. ఇప్పుడు ఆ మార్గంలో పగలు కూడా రాకపోకలు నిలిచిపోయాయి.

సాండర్స్‌ని ఆలోచనలు చుట్టుముట్టాయి.

ఆ వివరాల ప్రకారం దొంగల స్థావరం కొండల్లో ఉండి ఉండాలి. ఎలాగైనా ఆ ముఠాని పట్టుకుని దోపిడీలు నివారించాలి. ఆ రహదారి తిరిగి ప్రయాణానికి అ నుకూలం చెయ్యాలి.

ఎలా?

అది తన సామర్థ్యానికి పరీక్షగా తలచాడు సాండర్స్.

## II

"మంత్రగత్తె చచ్చిపోయింది" ఎవరో అరిచారు.

పిడుగుపాటు తిన్నట్టు గ్రామం నివ్వెరబోయింది.

అందరూ గ్రామం చివర పాడుపడిన గుడిసె ముందు గుమికూడారు. ఆ గుడిసె పైకప్పు చెదలు పట్టి చాలా వరకూ శిథిలమైంది. వర్షం కురిస్తే సారంతా లోపలే ఉంటుంది. ఎండ ఎంత తీవ్రంగా కాసినా గుడిసెలోని తడి ఆరడం అంత తేలిక కాదు. మంత్రగత్తె ఆ గుడిసెలో ఎలా బతికిందోనని ఆశ్చర్యపో యారు అక్కడ గుమికూడిన వారు.



నిజానికి ఆ గుడిసె పరిస్థితి ఎప్పటి నుంచో అలా వుంది. ఎన్నడూ పరీక్షగా చూడకపోవడంతో కలిగిన ఆశ్చర్యం అది. కొందరు గుడిసెలోకి తొంగి చూసి చప్పున తలలు వెనక్కి లాక్కున్నారు. లోపల నేల మీద ఓ వృద్ధురాలి శవముంది. ఆమె డోక్రీ బేడా గ్రామానికి మంత్రగత్తె. ఎప్పుడు ప్రాణం వదిలిందో తెలియదు. ఒకతను ఆమెని పిలవడానికొచ్చి విగత శరీరం చూసి భయంతో కేకపెట్టాడు.

ప్రాణం లేని శరీరం వెల్లకిలా పడుంది. గుడిసె పై కప్పు రంధ్రాల నుంచి ఆకాశం లోకి చూస్తున్నట్టున్నాయి తెరిచిన కళ్ళు. ఎప్పుడూ ఏవో శబ్దాలు వెలువరిస్తూ కదిలే పెదవుల మీద ఈగలు ముసిరాయి. ఆమె తనలో తను మాట్లాడుకుంటూ గ్రామం అంతా సంచరించేది.

ఆ మంత్రగత్తె ఎన్ని సంవత్సరాలు బతి కిందో అంచనాకి అందదు. ఆమె ఈడు వారెవ్వరూ గ్రామంలో జీవించిలేరు. ఎము కల పోగువంటి శరీరంతో పెదాలు కది లిస్తూ కనిపించేది. తరుచుగా రెండు చేతులు ఆకాశం వైపు సాచి ఎవరినో పిలుస్తున్నట్టు అభినయించేది. గుడిసెలో మట్టితో చేసిన విచిత్ర రూపాల ముందు కూర్చుని అర్థం కాని పదాలు ఉచ్చరిం చేది. ఎన్నడూ చూడని పూలు ఆ రూపాల ముందు ఉండేవి. ఆమె కళ్ళు రంగు అద్ది నట్టు ఎర్రగా కనిపించేవి.

ఆ మనిషి జీవితం అర్థం కాని ప్రశ్న.

గుడిసెలోపల మట్టి పాత్రలు, చిరిగిన గొంగళి, పిచ్చి రూపాల మట్టి విగ్రహాలు, ఓ

వెదురు బెత్తం తప్ప ఏమీ లేవు. ఆ గుడిసె లోకి ప్రవేశించి పరీక్షగా చూసే అవకాశం మొదటిసారి కొందరికైనా వచ్చిందప్పుడే. పిల్లలు ఆటల్లో పడి ఆ గుడిసెవరకూ వచ్చి ఎక్కడ కొచ్చామో తెలుసుకుని వణికిపోతూ దూరంగా పారిపోతారు.

ఆ మంత్రగత్తె అమాయకురాలైన ఆడదని తెలిసింది సావోతా జామిరి కోదు ఒక్కడికే!

యవ్వనంలోకి అడుగుపెట్టి ఎన్నో కలలు కన్నదామె. వయసు ఎగసిపడుతుంటే కళ్ళు దేనికోసమో అమాయకంగా వెదికేవి. అడవి లోని కొండలు తన స్వంతమన్నట్లు స్వేచ్ఛగా లేడిపిల్లలా సంచరించేది. అప్పుడే తారసపడ్డాడు జాని కోదు.

అతనిది అరడుగుల పొడవు విగ్రహం. క్రూరమృగాలు సైతం జడుసుకునే కండలు తిరిగిన దేహం. వెనుకా ముందు చూడ కుండా ఒంటిచెత్తో పులిని ఎదిరించే పాటి ధైర్యమున్నవాడు. అలాంటి వాడు ఆమె తనకెదురైనప్పుడు పిల్లిలా అయిపోయి చేతి లోని ఈటె జారవిడిచాడు. అది చూసి వెక్కిరించి తీగలా పరిగెత్తిందామె. అతను తేరుకుని లేడి వెంటపడిన పులిలా అనుస రించాడు.

ఇద్దరూ ఓ ఘడియలో గెడ్డ వద్ద కలి శారు.

జానికోదు కుడిచెయ్యి సాచి ఆమె నడుము చుట్టూ పోనిచ్చి దగ్గరకు లాక్కు న్నాడు. ఆ పట్టు విడిపించుకునే ప్రయత్నం చెయ్యలేదామె. ఉప్పెనలా కోరిక కమ్మే సింది. ఆ కోరిక ఇద్దర్నీ ఒక్కటిగా చేసింది. ఆమె, అతన్ని ఆహ్వానించలేదు. అయినా ఆహ్వానం అందుకున్న వాడిలా ఆక్రమించు కున్నాడు. స్వర్గద్వారాలు తెరుచుకుని ఇద్దరూ అందులో ప్రవేశించారు. కన్ను తెరిస్తే ఆ స్వర్గం దూరమవుతుందేమోననే చింతతో రెప్ప తెరవలేదామె.

జాని కోదు అందిస్తున్న సుఖం బాహ్య స్మృతిని పోగొట్టింది. దేహం ఆ కేళీ విన్యా సంలో తేలియాడుతోంది.

"అమ్మా..." బాధగా మూలిగాడతను.

మైకం నిండిన కనులను బలవంతంగా తెరిచిందామె. జతగాడు బాధతో మెలి తిర గడం కంటపడి చప్పున లేచింది. అతన్ని చూస్తూనే విషనాగు కాటేసిందని గ్రహిం చింది.

దిశమొలతో తుప్పలకి అడ్డంపడి గబగబ కొన్ని ఆకులు తుంచి తెచ్చి నలిపి పసరు గొంతులో పోసింది. ఆ పసరు నిలువునా విషాన్ని విరిచేస్తుంది. కాని నోటి నుంచి వస్తున్న నురుగతో పాటు పసరు బుగ్గల మీద జారి సమయం మించి పోయింది. మనువాడాల్సిన మనిషి గిలగిలా కొట్టు కుంటూ ప్రాణాలు విడుస్తుంటే కన్నీరు మున్నీరుగా విలపించసాగింది. అతను తన కేమీ కాకపోయినా అలా అనుకోలేదు. సర్వస్వం కోల్పోయిన దానిలా రోదించింది.

ఆ ఘటన అనంతరం ఆమె సరదాలు, గెంతులు ఆగిపోయాయి. గుడిసె నుంచి బయటకు రావడం మానుకుంది. ఎప్పుడైనా వచ్చినా ఒంటిన గుడ్డ ఉందో జారిపో యిందో పట్టించుకోకుండా అడవిలోకి పోయేది. జానికోదు ప్రాణాలు విడిచిన చోట మోకాళ్ళమీద కూలబడి గుండెలు పగి లేటట్టు విలపించేది.

"నన్ను కూడా తీసుకుపో" చెట్లను చూస్తూ ప్రకృతితో అనేది. బుద్ధి తిన్నన యితే గ్రామానికి వచ్చేది. లేకపోతే అక్కడే సొమ్మసిల్లి నిద్రపోయేది. తల్లిదండ్రులు కూతురు కోసం వెదికేవారు. నడవలేని స్థితిలో కూడా ఆమె తండ్రి సంతకిపోయి తాయెత్తు తెచ్చి కట్టాడు. వనదేవతకి మొక్కుకున్నారు. వారి ప్రయత్నాలు ఫలిం చక ముందే తల్లిదండ్రులు కూతుర్ని వదిలి మరో లోకాలకు వెళ్ళిపోయారు.

ఏళ్ళు గడిచాయి.

చింపిరి జుట్టుతో, కాపు సారా మత్తులో జోగుతూ వెళ్ళే ఆమెని చూసి, "మంత్రగత్తె

వస్తోంది" అని అరుస్తూ పిల్లలు దూరంగా పారిపోయేవారు. చివరికి ఆ మాటే స్థిరపడి పోయింది. ఆమెకి కోరికలు, అభిరుచులు లేవు. ఎవరు పిలిచినా వెళ్ళి ఆడుతుంది. ఆమెకు భూత, భవిష్యత్, వర్తమానాలు తెలియకపోయినా తెలుసుకుని మంత్రాలతో రోగాలు నయం చేయగలదని కోదు గోష్టి నమ్మింది. మతి చలించిన ఆడదాన్ని పట్టుకుని మంత్రగత్తె అంటున్నామనే తెలివి వారికి లేదు. గ్రామస్థుల దైనందిన జీవితం మంత్రగత్తె పెదవుల నుండి వెలువడే అస్పష్ట శబ్దాలతో ముడివడింది. బిడ్డ పుట్టి బొడ్డూడితే ఆడాలి. పెళ్ళయితే సాంప్రదాయ గేయాలు పాడాలి. జబ్బులొస్తే నాట్యం చెయ్యాలి. ఎవరూ ఆమెకి జీతం, బత్తెం ఇవ్వడం లేదు. అయినా గ్రామ ప్రజలు తన కుటుంబమనుకుని కష్టసుఖాలకు హాజరయ్యేది.

అటువంటి ఆమె నేడు తనువు చాలించింది.

గుడిసె నుంచి ఎముకల పోగు వంటి శరీరం తెచ్చి బయట ఉంచారు. ఆడవాళ్ళు శవం చుట్టూ వలయంలా కూర్చుని మరణగీతాలు ఆలపిస్తూ శోకించడం ప్రారంభించారు.

మృత్యువు నిన్ను పీల్చేసిందా.
మృత్యువు నిన్ను తినేసిందా.
అయ్యో, అయ్యో.

పెద్దాళ్ళు, కుర్రాళ్ళు కూడా శవాన్ని చూస్తూ విచార వదనాలతో నిలుచున్నారు. వారందరికీ ఊహ తెలిసేనాటికి గ్రామంలో మంత్రగత్తె ఉంది. అందులో చాలా మందికి పేరు పెట్టినప్పుడు ఎండుపుల్లలాంటి చేతులు ఊపుతూ గెంతింది. ఆమె ఆడితే రోగాలు నయమవుతాయని నమ్మేరు. సారా తాగి ఆడేదని, పెదాల నుండి వెలువడే శబ్దాలు పిచ్చిదాని గొణుగుడుతప్ప మంత్రాలు కావని ఎవరూ అనుకోలేదు.

గోష్టి తనని మంత్రగత్తె అంటే ఆమె కూడా నిజమనుకుంది. చీకటితో స్నేహం చేసి గాలిని ప్రేమించింది. విషాద పూరిత జీవితాన్ని మంత్రగత్తె అనే ముసుగు కప్పేసింది. ఆమెకు ఆ జీవితం సంతోషం కలిగించేది అనడానికి ఎలాంటి నిదర్శనాలు లేవు. జానికోదు గుర్తున్నాడో లేదో తెలియదు. ఏ భావనలు మనసులో సుడులు తిరిగాయో బోధపడదు.

గ్రామ సావోతా జామిరి కోదు వచ్చి

## మేలు చేయకున్నా హాని చేయడు

సినిమా రంగానికి కొత్తగా వచ్చిన ఒకాయన మంచి సలహాల కోసం చక్రపాణిని కలుసుకున్నాడు. అవీ ఇవీ చెప్పి 'ఫీల్డ్‌లో కాస్త పెద్ద తలకాయలు కన్పిస్తే ఓ నమస్కారం పడేస్తుండు' అన్నారు చక్రపాణి. అతను అలాగే అన్నాడు. కొద్దిరోజుల తర్వాత మళ్ళీ వాళ్ళిద్దరూ మాటల్లో మునిగి ఉండగా ఓ పెద్దాయన అటుగా వెళ్ళాడు. కొత్తవ్యక్తి ఆయనకు నమస్కారం పెట్టలేదు.

ఆయన అటువెళ్ళగానే చక్రపాణి 'ఏమయ్యా మొన్న చెప్పిన పాఠం మర్చిపోయావా?' అన్నారు. వెంటనే అతను కూడా 'పోనిద్దురూ ఆయనకు నమస్కారం పెడితే ఏం ఒరగబెడతాడు లెండి' అన్నాడు.

'నమస్కారం పడేస్తే ఇలాంటివాళ్ళు మేలుచేయకపోయినా కనీసం కీడు చేయరు. ఇది తెలుసుకోవాలి నువ్వు' అన్నారు చక్రపాణి సీరియస్‌గా.



మంత్రగత్తె నిర్జీవ దేహాన్ని చూసి బాధగా నిట్టూర్చాడు. వారం వారం మిలియా పుట్టి సంత నుండి సరుకులు తెప్పించి ఆమె గుడిసెకి పంపే వాడతను. అతని తండ్రి నుంచి సాహోతా పదవితో పాటు ఆ బాధ్యత సంక్రమించింది. అతను దానిని ఎన్నడూ అతిక్రమించలేదు.

పూజారికి కబురు వెళ్ళింది. అతను వచ్చి, అగ్గిలా మండిపోతున్న సూర్యుని వంక చూశాడు.

"చుక్కలొస్తే కాని ముహూర్తం నిర్ణయం కాదు" చెప్పేడు.

శోకాలతో ఆడవారి గొంతులు ఒక్కటిగా వినిపించాయి. మగవాళ్ళు కాస్త ఎడంగా కూర్చున్నారు. అందరి మొహాల్లోను విషాదం గూడు కట్టింది. మంత్రగత్తె స్థానాన్ని భర్తీ చేసేవాళ్ళు గ్రామంలో లేరు. ఆ లోటు ఎప్పుడు పూడుతుందో తెలియదు. అంత వరకూ ఏదైనా అక్కరొస్తే పక్క గ్రామంలోని మంత్రగత్తె వద్దకు పోవాలి.



క్రమంగా సూర్యుడు అస్తమించి చీకటి పడింది. శవం దగ్గర ఆడవాళ్ళు అలాగే కూర్చుని ఉన్నారు. మరణ గీతంలో తీవ్రత తగ్గింది. ఆకాశంలో చుక్కలు పొడిచాయి. వాటిని చూస్తూ మాట పలుకుతూ ఉన్నాడు పూజారి. గ్రామం నుంచి శవం వెళితే తప్ప ఎవరూ పొయ్యి ముట్టించరు.

నడిరేయి దాటింది.

"వేళయింది..." పూజారి అరిచాడు.

నలుగురు మనుషులు శవాన్ని లేపితే, గ్రామం అంతా కాగడాలతో వెనుక కదిలింది. కొంతదూరం వెళ్ళి బాట పక్కన అన్నం, విరిగిన కుండ వదిలి ముందుకి సాగారు. ఒక చోట పేర్చి వున్న ఎండు పుల్లల మీద శవాన్ని పడుకోబెట్టారు. తల దగ్గర చింకి బుట్ట వుంచి, తలమీద ఆముదం పోసారు.

సాహోతా కాగడా అందుకుని ముట్టించాడు.

అందరూ ఒక్కసారిగా వెనక్కి తిరిగి గెడ్డలో స్నానాలు చేసి గ్రామంలోకి వచ్చారు. మంత్రగత్తె కాలుతున్న శబ్దం అక్కడకు వినిపిస్తోంది. ఆ వెలుతురు ఆకాశంలో దీపం ముట్టించినట్టు కనిపిస్తోంది.

మంత్రగత్తె భౌతికంగా గ్రామం నుంచి అదృశ్యమైంది. కాని గ్రామస్థుల హృదయాలలో మాత్రం సజీవంగా ఉంది. పిల్లకి గాలి పట్టిందంటే ఎంత రాత్రయినా వచ్చేది. తన చేష్టలతో ధైర్యం కలిగించేది. అలాంటి మనిషిని ఎవరు మర్చిపోగలరు?

## 12

వ్యాపారి ఇంటి నుంచి మూడు ఎడ్ల బళ్ళు బయలుదేరాయి. తెల్లటి సిల్కుదుస్తులు వేసుకుని ముందు బండిలో హుందాగా కూర్చుని ఉన్నాడు ఆ వ్యాపారి. అతని చేతి వేళ్ళకి పగడం, ముత్యం, కెంపు వంటి ఖరీదైన రాళ్ళు పొదిగిన ఉంగరాలు మెరుస్తున్నాయి. మెడలో పులిగోరు వేలాడుతోంది. దుస్తుల నుంచి మేలైన పరిమళ ద్రవ్య సువాసన వెలువడుతోంది. మహారాష్ట్ర నుంచి వచ్చిన మార్వాడి మాదిరిగా కనిపిస్తున్నాడతను. దిళ్ళ మీద వెనక్కి వాలి సుఖంగాను, దర్జాగాను కూర్చున్నాడు. ముఖం ప్రకాశవంతంగా వుంది.

వ్యాపారి బండి వెనక వున్న బండిలో టేకు పెట్టెలున్నాయి. పది మంది దృఢకాయులు ఆ బండి వెంట నడుస్తున్నారు. సాము గరిడీలు తెలిసిన వారిలా ఆరడగుల పొడవు కర్రలు పట్టుకున్నారు.

మందగమనంతో బళ్ళు సాగిపోతున్నాయి. సూర్యుడు తలపైకి వచ్చిన మధ్యాహ్న వేళ ఘాటు రోడ్డులో కొంత మేరకు వెళ్ళి బళ్ళు నీడ పట్టున ఆగాయి. ఎడ్లు విప్పేసి గడ్డి వేశారు సేవకులు. అక్కడి వారి హడావిడి తప్ప ఎలాంటి మనుష్య సంచారం కానరావడం లేదు.

వెండి పళ్ళెంలో పెట్టిన ఆహారపదార్థాలు ఆరగించాడు వ్యాపారి. సేవకులు గుంపుగా కూర్చుని తిళ్ళు తిన్నారు. ఎడ్లను దగ్గరలోని గెడ్డకి తీసుకుపోయి నీరు తాగించి తీసుకొచ్చారు. కొద్దిసేపు అక్కడ విశ్రాంతి తీసుకుని తిరిగి ప్రయాణం ప్రారంభించారు. కొండల మధ్య నుంచి వీస్తున్న గాలి చెట్లను రాసుకుని శబ్దాలు చేస్తోంది.

అతను బంగారం, వజ్రాలు విక్రయించే ధనవంతుడైన వ్యాపారి. జమిందార్లు, సంస్థానాధీశులు అతనితో ప్రత్యేకంగా నగలు చేయించుకుంటారు. దేశ వ్యాప్తంగా నగల తయారీలో పేరున్న వ్యక్తి అతను. ఏడాదికోమారు పురమాయించిన వస్తువులు అప్పగించి, కొత్త వస్తువులకి ఖజానా పుచ్చుకుని వెళతాడు. ఇతర దేశాల నుంచి సరికొత్త నమూనాలు సేకరించి కొనుగోలుదారుల్ని ఆకర్షిస్తాడు. అతని వ్యాపారం దేశం నలుమూలలా విస్తరించడానికి అదే కారణం.

పదిరోజుల క్రితం పిఠాపురం రాజావారిని కలిసి, అసాధారణ పనితనం కలిగిన ఓ నగ విక్రయించి వారి మెప్పు పొందాడా వ్యాపారి. ఈసారి మల్కనగిరిలో వ్యాపారం చెయ్యాలని బయలుదేరాడు.

ఏ సేవకుడ్ని కదిలించినా ఈ వివరాలు వెల్లడిస్తాడు.

బళ్ళ వెంట నడుస్తూ వారిలోని ఒకతను, తన సహచరులు ఉత్సాహంగా లేకపోవడం గమనించి ఓ పల్లెపదం అందుకున్నాడు.

"సందులో లచ్చమ్మ సూడే"

మిగిలినవారు అప్రయత్నంగా గొంతు కలిపారు.

"సూడే..."

"నన్ను మిండగాడన్నది సూడే..."

"సూడే..."

"దాని ఒళ్ళే రాయంటే నమ్మే"

"నమ్మే..."

"దాని రుణం ఏటిచ్చినా తీరదోలమ్మే"

"అమ్మే..."

అలా సాగి శృంగారంలో తారాస్థాయికి చేరి ముగిసిందా పల్లెపదం. అంత వరకూ ఆసక్తిగా విన్న వ్యాపారి చివరి పదం విని దానర్థం తెలుసు కనుక చిన్నగా నవ్వుకున్నాడు.

సూర్యుడు ఆకాశం నుంచి దిగిపోయే వేళకి ఓ పల్లె చేరుకున్నారు. వ్యాపారి అనుమతి తీసుకుని ఇద్దరు వెళ్ళి బస గురించి విచారించి వచ్చారు. ఒక పాక ముందు బళ్ళు ఆగాయి. వ్యాపారి బండి దిగి ఒళ్ళు విరుచుకున్నాడు. అక్కడ ప్రశాంతంగా ఉంది వాతావరణం. పల్లెవాసులు గుమికూడి వ్యాపారిని, అతని వెంటవున్న వారిని ఆసక్తిగా చూస్తున్నారు.

సేవకులు బళ్ళల్లోని బరువైన పెట్టెలు పాకలోకి జాగ్రత్తగా చేర్చారు. ఒక వృద్ధురాలు అందరికీ వంట చేసి పెట్టింది. పాక ముందున్న నులక మంచం మీద నడుము వాల్చాడు వ్యాపారి. స్వచ్ఛమైన చల్లగాలికి క్షణాలలో నిద్రపట్టిందతనికి.

పల్లె సద్దుమణిగాక ఊరు చివరనున్న ఇంటి వెనుక నుంచి గుర్రమొకటి అడవి వైపు సాగిపోవడం ఎవరూ గమనించలేదు.

సూర్యుడు కర్తవ్య నిర్వహణకి సన్నాహాలు ప్రారంభించక ముందే నిద్రలేచాడు వ్యాపారి. అక్కడి వాతావరణంలోనే తన మనసు ప్రశాంతంగా ఉండటం గుర్తించాడు. ఆ చిన్న పల్లె చుట్టూ ఉన్న ప్రకృతి సౌందర్యం తిలకించి తన్మయత్వం చెందాడు. సేవకుల్ని పేరు పేరున పిలిచి మేల్కొలిపాడు. కాలకృత్యాలు తీర్చుకుని

పెట్టెల్ని బళ్ళల్లో సర్ది పయనమయ్యారు.

చల్లని వాతావరణంలో ఎడ్లు చురుగ్గా అడుగులు వేస్తున్నాయి. కొండల మధ్య దారి కొండ చిలువ నిద్రిస్తున్నట్టు మెలితిరిగి సాగిపోతుంది. ఆరేడు మైళ్ళ ప్రయాణం అనంతరం అల్పాహారం తినడానికి అనువైన చోటు చూసుకుని ఆగిందా బృందం.

ఒకతను రెండు జంతికలు, ఓ లడ్డు విస్తర్లో పెట్టి తలొకటి అందించాడు. వ్యాపారి కూడా అవే తిని ఆనప బుర్రలోని నీరు తాగాడు.

హఠాత్తుగా ఏదో అలికిడి వినిపించింది. వ్యాపారి బృందం తేరుకోక మునుపే కొన్ని గుర్రాలు వారిని చుట్టుముట్టాయి. సేవకులు కర్రలు అందుకున్నారు. పెద్దపెద్ద అరుపుల వెంట నాటు తుపాకులు గర్జించాయి. ఆ శబ్దాలకు భయపడి ఎడ్లు అడ్డదిడ్డంగా తిరిగాయి.

సేవకులు వెనకడుగు వెయ్యకుండా దొంగల్ని ఎదుర్కొన్నారు. ఒక దొంగ తన గుర్రాన్ని వ్యాపారి బండి వద్దకు నడిపించి తుపాకి గురిపెట్టాడు.

"మీవాళ్ళని కర్రలు పారేసి పిక్క బలం చూపించమని చెప్పు. అనవసరంగా మా చేతుల్లో ప్రాణాలు పోగొట్టుకోవద్దు" కటువుగా హెచ్చరించాడు.

ఆమాటలకు భయపడాల్సిన వ్యాపారి తొణకలేదు.

"ఎవరు మీరు? " అడిగాడు.

కోపంతో దొంగ కనులు ఎర్రనయ్యాయి.

"నీ తల తిరుగుతోందా? ముందు చెప్పిన పని చెయ్యి" అరిచాడు. అతని చూపుడు వేలు ట్రిగ్గర్ మీదకు చేరింది.

"ఢాం..."

ఆశ్చర్యంగా శబ్దం వచ్చిన వైపు చూశాడు వ్యాపారి.

బండితోలే మనిషి చేతిలో పిస్తోలు ఉంది. వ్యాపారి చూపులోని తీవ్రత గమనించి ఆ మనిషి అన్నాడు.

"మిమ్మల్ని కాలుస్తాడని భయపడ్డాను"

వ్యాపారి తిరిగి చూసేసరికి దొంగ గుర్రం పైనుంచి కిందపడిపోయి ఉన్నాడు. గుర్రం పెద్దగా సకిలించి చెట్లలోకి పరిగెత్తింది. తమ నాయకుడు పిస్తోలు దెబ్బకి పడిపోయేసరికి ఒకరినొకరు హెచ్చరించుకుని గుర్రాలని అదిలించి తలోదిక్కు అదృశ్యమయ్యారు మిగిలిన దొంగలు.

పిస్తోలు పేల్చిన మనిషిని మరోసారి తీవ్రంగా చూసి, బండి దిగి గాయపడిన దొంగని సమీపించాడు వ్యాపారి.

అప్పటికే అతని ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.



## 13

"బుర్ర ఇడగొట్టేస్తాన్రోయ్. ఎవడు అడ్డం వస్తాడో రమ్మను" తొడ చరిచాడతను.

"సేతకానోడికి గెంతులెక్కువట. నీ సత్తా ఎరికేలే" తేలిగ్గా తీసిపారేశాడు ఇవతలి వ్యక్తి.

"నీ బాబు దేంట్రా నేల? కంచేస్తే ఊరుకోడానికి నేను బండ పరజాలావాడిని కాను"

గిరిజనుల్లో బండా పరజా అనే జాతి ఒకటి వుంది. ఆ జాతిలో మగవాళ్ళు పని చెయ్యరు. ఆడవాళ్ళు వ్యవసాయ పనులు చేసి మొగుణ్ణి, పిల్లల్ని పోషిస్తారు. అందుచేత మిగతా జాతులు ఈ బండా పరజా వారిని తేలిగ్గా చూస్తాయి. 'గాడిదకొడకా' అన్నట్టు 'బండాపరజా నా కొడకా' అనడం కోదుల్లో పరిపాటి.

"నువ్వొచ్చిన్నేల నే ముట్టలేదు. ఈ భూమి దున్ని మూడేళ్ళయింది. ఈ జాగాలో ఒక్క చోడి గింజ కూడా పండించ

ఇది ఏ ముప్పైనలభై ఏళ్ళనాడో కట్టిన బ్రిడ్జి కాదు. అక్షరాలా రెండు సహస్రాబ్దుల (రెండువేల సంవత్సరాలు) క్రితం కట్టిన ఈ బ్రిడ్జి నాటి సివిల్ ఇంజనీరింగ్ నైపుణ్యానికి మచ్చుతునక. ఫ్రాన్స్ దక్షిణాదినగరం నైమ్స్‌కు నీటి సరఫరా కోసం గార్డన్ నది మీద 'పాంట్‌డు గార్డ్' అనే ఈ మూడంతస్తుల వంతెనను క్రీ.పూ.19లో నిర్మించారు. రోమన్ చక్రవర్తి అగస్టస్‌కు మిత్రుడు, జనరల్ అగ్రిప్ప దీనిని నిర్మించాడని ఆధారాలు వెల్లడిస్తున్నాయి. దీని మొదటి అంతస్తులో 6, రెండో అంతస్తులో 11, మూడో అంతస్తులో 35 ఆర్చ్‌లు ఉన్నాయి. దీని ఎత్తు 49 మీ. పొడవు 274 మీ. దీనినుంచి 30 మైళ్ల దూరంలో ఉన్న నైమ్స్ నగరానికి నీటి సరఫరా జరిగేది. ఆ నగరంలో నాడు నీటి నిల్వకోసం నిర్మించిన 20 అడుగుల వలయాకారపు ట్యాంక్‌ను నేటికీ చూడవచ్చు. ఆ ట్యాంక్‌నుంచి ఐదు జతల పైపుల ద్వారా వివిధ ప్రాంతాలకు నీటి సరఫరా జరిగేది.



లేదు. నీదెలా అవుద్ది? "

"నాది హనుమంతుని వంశం. నేను దున్నిన భూమి మరొకడు అంటుకుంటే ఒప్పను"

ఆంజనేయుడు తమ జాతివాడని, అతని సహకారం వల్లనే రాయుడు రాజ్యం జయించుకున్నాడని కోదుల నమ్మిక. కొంతమంది కోదులు హనుమంతుని వంశంగా చెప్పుకుంటారు.

"ఒప్పకపోతే ఏట్రా సేత్తావు? "

"సెప్పేను కదా బుర్ర ఇడగొడతానని"

"కొట్టు సూద్దాం"

వెంటనే ఫట్‌మనే చప్పుడు వెలువడింది.

"సంపేసినాడు బాబోయ్! రచ్చించండి" అక్కడే ఉన్న ఓ స్త్రీ అరిచింది.

గొడవ పడిన ఇద్దరూ కోడిపుంజుల్లా కలియబడ్డారు. కర్రలతో ఒకరినొకరు కొట్టుకోవడం ప్రారంభించారు.

పెద్దగా అరిచిన స్త్రీ గ్రామం వైపు పరిగెత్తింది. కొంతమంది గ్రామస్థులు వచ్చి ఇద్దర్నీ విడదీసి రచ్చబండ వద్దకు తీసుకుపోయారు.

గ్రామ సావోతా జామిరికోదు వారిద్దర్నీ నిశితంగా చూశాడు.

ఇద్దరికీ దెబ్బలు గట్టిగానే తగిలాయి. నిజానికి భూమికోసం తగువు పెట్టుకోవాల్సిన అవసరం కోదులకి లేదు. ఓపిక ఉంటే ఎంత భూమి అయినా బాగు చేసుకుని వ్యవసాయం చెయ్యవచ్చు. ఒకడు భూమి బాగు చేసి స్తోమతు లేక మూడు ఏళ్ళుగా పంట వెయ్యలేదు. ఆ పక్కన వ్యవసాయం చేస్తున్న మనిషి ఆ భూమిలో చోడిగింజలు జల్లి కంచె పెట్టుకున్నాడు. అక్కడ వచ్చింది ఇద్దరికీ జగడం. తప్పెవరిదో తేల్చి శిక్ష వెయ్యాలి. విషయం తెలిసిన గ్రామస్థులు సావోతా జామిరి కోదునే చూస్తున్నారు.

"ఈ నేల ఒకడి సొత్తు కాదు. పంట పండించేవాడికే ఆ భూమి సెందుతుంది. వ్యవసాయం సెయ్యకుండా భూమి బాగు చేసి ఒగ్గేసి నాదేనని సెప్పడం కోదు గోష్టి ఒప్పదు. తప్పు కింద పంచాయితీకి ఐదు రూపాయిలు సెల్లించు" మొదటి వ్యక్తికి చెప్పాడు సావోతా.

సావోతా మాటకి ఎదురులేదు కనుక అతని మొహం మాడిపోయింది. అయినా ఉక్రోషం ఆగలేదు.

"ఆడు నీ సుట్టం కాబట్టి నాకు తప్పే సావు" కసిగా అన్నాడు.

చిన్నగా నవ్వాడు సావోతా.

"నువ్వు సుట్టం కావా? "

ఆ కోదు చప్పున తల దించుకున్నాడు. గ్రామంలో ఉన్నవారంతా ఒకరికొకరు ఏదో రకంగా బంధువులే అవుతారు. అన్నదమ్ముల్లో ఒకడు సావోతా, మిగతావారు గ్రామస్థులు అది వారిమధ్య అనాదిగా వున్న బంధుత్వం.

జామిరి కోదు రెండో వ్యక్తితో అన్నాడు.

"భూమిలో పంట వెయ్యనోడికి దాని మీద హక్కుండదు కానీ అభిమానం ఉంటుంది. అది తెలిసి ఆడు శ్రమతో మొక్కలు, మోడులు పీకి వ్యవసాయానికి అనువుగా సేసిన నేలలో చోడి గింజలు చల్లి కంచేసావు. వ్యవసాయం సెయ్యాలంటే భూమి బాగుసెయ్యాలి. ఎవడో బాగుసేసిన నేలలో పంట వేసే హక్కు నీకు లేదు. అందుకని ఐదు రూపాయలు పంచాయితీకి తప్పు కట్టు"

"ఇద్దరికీ సిచ్చేత్తావా? " నిలదీశాడతను.

"తప్పు ఇద్దరూ సేసారు. మీకెవరికన్నా నట్టం కలిగితే పంచాయితీకి పిర్యాదు సెయ్యాలి. కర్రలు తీసుకుని తలలు ఇడగొట్టుకుంటే న్యాయం ఎలా జరుగుద్ది? గ్రామానికి నీతి, రీతి ఉన్నాయని గుర్తెట్టుకోకుండా మసిలితే తప్పు సెల్లించాలి".

అక్కడ నిశ్శబ్దం పేరుకుంది.

చప్పట్లు చరిచిన శబ్దమొకటి వినిపించి ఉలిక్కిపడి అటు చూశారు. ఎప్పుడు అక్కడికి వచ్చారో నలుగురు వ్యక్తులు, వారి

మధ్య వున్న తెల్లటి వ్యక్తి చప్పట్లు చరిచి నట్లు అర్థం చేసుకున్నారు.

కొత్త మనుషుల్ని గమనించిన మరు క్షణం చాలా మంది గ్రామస్థులు తలో దిక్కు పరిగెత్తారు. తెల్లటి వ్యక్తి ఆగమని సైగ చేస్తున్నా వారు పట్టించుకోలేదు. సావోతాతో పాటు కొందరు అక్కడ ఉండి పోయారు. వారి ముఖాల్లో ఆందోళన స్పష్టంగానే కనిపిస్తోంది.

తెల్లటి మనిషి రచ్చబండ సమీపించి కూర్చుని అడిగాడు.

"సావోతా ఎవరు? "

"నేనే దొరా!" భయంగా జవాబిచ్చాడు జామిరి కోదు. దట్టమైన అడవిలోని డోక్రీ బేడా గ్రామానికి బయటి మనుషులు రావడం చాలా అరుదు. అందుచేత వీరె వరో, ఎందుకొచ్చారో అర్థం కాలేదతనికి.

"దాహమిస్తావూ? "

జామిరి కోదు గబగబా ఓ గుడిసె వద్దకు వెళ్ళి మట్టి ముంతతో నీరు తీసు కుని తెచ్చి ఇచ్చాడు. తెల్లటి మనిషి ఆ నీరు తాగాడు. చాలా దూరం నుంచి వస్తు న్నట్టు వారి బట్టలు చెమటతో తడిసి ఉన్నాయి.

పోలీసు అధికారి సాండర్స్ దొర ఆ తెల్లటి మనిషి అని సావోతాకి తెలిసిన మరుక్షణం ఆ వార్త గ్రామం అంతా పాకి పోయింది. అటువంటి పెద్ద అధికారిని చూడటం వారి జీవితాల్లో అదే మొదలు. గ్రామాన్ని నిశ్శబ్దం ఆవరించుకుంది. గు డిసెల నుంచి బయటకొచ్చే ప్రయత్నం చెయ్యకుండా నక్కి నక్కి చూస్తున్నారు గ్రామస్థులు.

ఫారెస్టు వాళ్ళు కానీ, పోలీసు వాళ్ళు కానీ వచ్చేముందు గ్రామానికి మిరపకాయి కపా వస్తుంది. గ్రామస్థులు వెళ్ళి వారిని పోలీల్లో తీసుకురావాలి. ఈ లోపు వారి కోసం ఏర్పాట్లు జరుగుతాయి. ఈ అధి కారి మాత్రం చడీచప్పుడు లేకుండా వచ్చి

## అమ్మ కడుపులో అల్లరి పిల్లలు

"పిల్లలు కాదండీ బాబూ! వీళ్ళు... పిడుగులు... పుడుతూనే బుద్ధులు పట్టుకొస్తున్నారు"

"కంప్యూటర్ కాలం గదండీ.. వీళ్ళ బుద్ధులూ... కంప్యూటర్లలానే ఫాస్టుగా ఉంటు న్నాయి."

ఓపలేనంతగా అల్లరి చేసే పిల్లల్ని చూసి ఈ మాటలు అందరూ అనేవే. అయితే పుట్టాక మాత్రమే కాదు. పుట్టక ముందు తల్లి గర్భంలోనే ఉండగానే శిశువులు గడుగ్గాయిలుగా, చిచ్చర పిడుగులుగా ఉంటారని వైద్య పరిశోధకులు తేల్చి చెబుతున్నారు. వాళ్ళు చెప్పే వివరాల ప్రకారం తల్లి గర్భంలో శిశువు పెద్దవాళ్ళలాగే నిద్రబోతూ కలలు కంటుంది. తల్లి గర్భంలో ఉండే చివరి నెలలో వినికిడి శక్తి కల్గిఉంటుంది. ఇది వింటుంటే మనం అభిమన్యుణ్ణి గుర్తు తెచ్చుకోక తప్పదు సుమా. అంతేనా!... శిశువుకి 13 నుండి 14 వారాలకే రుచిని తెలిపే టేస్ట్ బడ్స్ పుట్టుకొ స్తాయట. గర్భంలో శిశువు చూస్తుందట కూడా.

తొమ్మిది వారాల శిశివు ఎక్కిళ్ళు పెడ్తుంది. తల్లి గర్భంలో శిశువు తన చుట్టూ వాతావరణాన్నీ గుర్తు పడ్తుందట. గంటకి యాభైసార్లు కదుల్తుం దిట.

ఇప్పుడు చెప్పండి.. పిల్లల్ని చిచ్చర పిడుగుల నటంలో హాశ్చర్యం ఏమీ లేదు కదండీ.





ఈ దొర ఎందుకిలా అంటున్నాడు?

ఆ ప్రశ్న మనసులో ఉదయించిన మరుక్షణం వారికి సదుపాయాలు చూడాలనే విషయం బుర్రకి తట్టింది.

"తమ కోసం గుడిసె వెయ్యడానికి మనుషుల్ని పురమాయించి వస్తాను దొరా!" అని, అనుమతి కోసం ఆగాడు సావోతా.

"అక్కర్లేదు"

సావోతాకి మతిపోయింది. ఆ విషయం గ్రహించి అన్నాడు సాండర్స్.

"నా కోసం నువ్వు దిగులు పడకు..."

"సంత నుండి పట్టుకొచ్చిన సన్న బియ్యం పారాస్టి వాళ్ళు తినిపోయారు దొరా! వంటకి బియ్యం లేవు" భయపడుతూ గొంతు పెగుల్చుకుని చెప్పాడు సావోతా. దొర తమని బతకనివ్వడనే శంక తినేస్తోందతన్ని.

"బియ్యం లేకపోతే ఏం తింటారు? "

"చోడంబలి తాగుతాం దొరా!"

"అదే నాకూ ఇవ్వండి" తేలిగ్గా అన్నాడతను.

"మీకు సయించదు దొరా!"

"చోడంబలితో మీ కడుపులు నిండుతుంటే నా కడుపెందుకు నిండదు? "

అతని తత్వం బోధపడక పిచ్చిచూపులు చూశాడు సావోతా.

"మీరు ఆ అంబలి తాగలేరు సార్!" ఒక జవాను సావోతాకి వత్తాసు పలికాడు.

తీవ్రంగా చూశాడు సాండర్స్.

"వరి పండని చోట అన్నం ఎలా దొరుకుతుందనుకుంటున్నావు? కావాల్సినవి చేయించుకుని తినడానికి అత్తవారింటి కొచ్చామనుకుంటున్నావా? అది కావాలి, ఇది కావాలి

పడ్డాడు. ఏం చెయ్యాలో పాలుపోక చేతులు కట్టేసినట్టు నిలుచుండిపోయాడు జామిరి కోదు.

"నాలుగుదినాల క్రితం కొందరు దొంగలు అడవిలోకి పారిపోయి వచ్చారు. మీ గ్రామానికి ఎవరైనా వచ్చారా? " అడిగాడు సాండర్స్.

ఆ మాటలు అర్థం చేసుకోవడానికి కొంత సమయం పట్టింది జామిరికోదుకి.

"ఎవళ్ళూ రాలేదయ్యా! మిరపకాయ టపా పంపితే తమర్ని డోలీలో తీసుకొచ్చే వాళ్ళం దొరా!"

సాండర్స్ చిన్నగా నవ్వాడు.

"జబ్బు చేసిన వారిని, నడవలేని గర్భిణీ స్త్రీలని మొయ్యాలి. బాగా తిని తెగ బలిసిన వారిని కాదు. అయినా మమ్మల్ని మీరెందుకు మోసుకురావాలి? "

జీవితంలో మొదటిసారి విన్న ఆ ప్రశ్నకి జవాబు లేదు జామిరికోదు వద్ద. అధికారుల్ని గ్రామానికి తీసుకురావడం తమ బాధ్యత అనుకుంటారు. అది ఎప్పుడు, ఎక్కడ ప్రారంభమైందో వారికి తెలియదు.

అని గ్రామస్థుల్ని ఇబ్బంది పెట్టకండి" చెప్పాడు.

ఆ జవాను బిక్కచచ్చిపోయాడు.

సావోతాని తీసుకుని గ్రామం అంతా తిరిగి, పంట భూములు చూసొచ్చాడు సాండర్స్. ఏ ఏ పంటలు పండించారు, ఆదాయం ఎంత వచ్చేది అడిగి తెలుసుకున్నాడు. సంవత్సరానికి ఓసారి వచ్చి ముందుగా డబ్బిచ్చి పండిన పంట తీసుకుపోయే వ్యాపారులు అక్కడ వరకూ వస్తున్నారని అర్థమయింది. తిండికోసం ప్రకృతితో పోరాడి సహజీవనం చేసే కష్టజీవులు కోదులని అనుకున్నాడు.

ఆ రాత్రి రచ్చబండ వద్ద కూర్చున్నాడు సాండర్స్. చుట్టూ చేరిన గ్రామస్థుల ద్వారా కోదుల కష్టసుఖాలు విన్నాడు. చోడంబలి తాగి చెట్టు కింద పడుకున్నాడు. రాత్రంతా జంతువుల అరుపులు వినిపిస్తున్నా చలించలేదు. చలిగాలినీ, కారు చీకటినీ లెక్క చెయ్యలేదు. అతనికి రక్షణగా రచ్చబండ చుట్టూ నేలమీద గ్రామస్థులు పడుకున్నారు.

ఉదయం తన సిబ్బందితో అక్కడ నుంచి బయలుదేరాడతను.

సగం పండిన ఎరుపు రంగు అరటి గెల తెచ్చాడో కోదు. మరొకతను కర్రపెండలం దుంపలు కాల్చి పట్టుకొచ్చాడు. ఇంకొకడు ఆనప బుర్రతో పుట్టతేనె ఇచ్చాడు. అవి మార్గమధ్యంలో ఆహారంగా ఉపకరిస్తాయని వారి ఆలోచన.

సాండర్స్ వెళుతుంటే పిల్లలతోసహా అందరూ గుడిసెల నుంచి బయటకొచ్చి నిలుచున్నారు. తమ జాతి చరిత్రలో ఎలాంటి ఇబ్బందులు సృష్టించకుండా, కష్టాలు తెలుసుకుని సానుభూతి చూపిన ఆ అధికారి వెళుతుంటే మౌనంగా వీడ్కోలు ఇచ్చారు.

* * *

అర్ధరాత్రి కావస్తోంది.

బంగ్లా చుట్టూ ఆవరించుకున్న నిశ్శబ్దాన్ని టకటకమనే సెంట్రీ బూట్ల చప్పుడు చెల్లాచెదురు చేస్తోంది. చీకట్లోని బంగ్లాలో ఒకే ఒక్కదీపం వెలుగుతున్న జాడ కనిపిస్తోంది.

సాండర్స్ గదిలో ఉందా దీపం.

బల్ల దగ్గర చెక్కకుర్చీలో కూర్చుని అతడు దీర్ఘాలోచనలో మునిగి ఉండటం వల్ల ఆ దీపం ఇంకా వెలుగుతోంది. ఇరవై దినాలు పట్టువిడవకుండా అడవి అంతా గాలించి కొండల్లో ఉన్న రహస్య స్థావరం కనుగొని దొంగల్ని పట్టుకున్నాడు. వారిని తీసుకొస్తుంటే పౌరులు బారులు తీరి చూశారు. ప్రభుత్వం అతని సేవల్ని ప్రశంసిస్తూ వర్తమానం పంపింది. పురప్రముఖులు ఎందరో వచ్చి మెచ్చుకున్నారు. అతనంటే సిబ్బం



దిలో గౌరవం పెరిగింది. జిల్లా కలెక్టర్ ప్రత్యేకంగా డిన్నర్‌కి ఆహ్వానించాడు.

అయినా కూడా సంతోషంగా లేడతను.

అడవిలో గాలించినప్పుడు ఎన్నో గిరిజన గ్రామాలు సందర్శించాడు. అక్కడ గిరిజనుల జీవన విధానం అతణ్ని కదిలించివేసింది. మనిషిని మనిషి మోసుకెళ్ళే డోలీ పద్ధతి గురించి తెలిసినప్పుడు ఆశ్చర్యపడలేదు కానీ - ఏ గ్రామం వెళ్ళాలంటే ఆ గ్రామం వారు వచ్చి ఉద్యోగుల్ని ఉచితంగా తీసుకెళ్ళడం, అక్కడ వారు ప్రవర్తించే తీరు తెలుసుకుని మాత్రం ఆశ్చర్యపోయాడు. గిరిజనుల సమస్యలు సానుభూతితో అర్థం చేసుకోవాల్సిన ఉద్యోగులు వారిని పశువుల కంటే హీనంగా చూస్తున్నారు.

ఈ దేశాన్ని పాలిస్తున్నదెవరో తెలియని అమాయకులు గిరిజనులు. ప్రభుత్వం అనేది ఒకటి వుందని కూడా వారికి తెలియదు. ముందుగా రూపాయలు ఇచ్చి పంట తీసుకుపోయే వ్యాపారుల గురించి చింతించని వాళ్లు, ఫారెస్టు వాళ్ళు దయగా ఉంటే చాలునని కోరుకునే నిర్భాగ్యులు. శరీరం నిండా బట్ట కప్పుకునే స్తోమతు సంపాదించుకోలేని గోచీ పాత రాయుళ్ళు వారు.

వారికి తనేం చెయ్యగలడు?

అదీ సాండర్స్‌ని వేధిస్తున్న ప్రశ్న. గిరిజనులకు సాయపడుతూ, వారి జీవన విధానంలో మార్పు తీసుకురావాలి. అది ఒక్కసారిగా చప్పున అయ్యే పని కాదు కాబట్టి ఏదో ఒక దానితో మార్పుకి శ్రీకారం చుట్టాలి. ఎక్కడి నుంచి ప్రారంభించాలి? ఎంతకీ ఆలోచనలు తెగక అర్ధరాత్రి దాటినా నిద్రరావడం లేదు.

మరికొంత సమయం గడిచిపోయింది.

చప్పున కదిలి సొరుగులాగి కాగితాలు అందుకుని కలం మూత తీశాడు. ముత్యాల వంటి అక్షరాలతో పదాలు పేర్చి వాక్యాలు నిర్మించడంలో నిమగ్నమయ్యాడు. మనసులో సుడులు తిరుగుతున్న భావాలు ఆ వాక్యాలలో నిక్షిప్తమవుతున్నాయి. రెండు కాగితాలు నిండుగా రాసి ఓసారి చదివి కింద సంతకం చేశాడు. అప్పటికి కాని గుండె తేలిక పడలేదు.

దీపం ఆరిపోయింది.

బయట సెంట్రీ బూట్ల చప్పుడు ఎప్పటిలానే నిశ్శబ్దాన్ని చెదరగొడుతోంది. కాటుక అద్దినట్టు చీకటి నిశ్చింతగా వుంది.

* * *

సర్ స్టాపర్ట్ క్రిప్సు రాయబారం విఫలమైంది.

ఈ నేపథ్యంలో బ్రిటిష్ వారిని దేశం నుండి తరిమేసి, స్వరాజ్యం సాధించాలని కాంగ్రెస్ కార్యవర్గం బొంబాయిలో ఆగస్టు ఎనిమిదిన సమావేశమయింది. సుదీర్ఘచర్చల అనంతరం ఆ రోజు రాత్రి "డూ ఆర్ డై" అనే కార్యక్రమం రూపొందించారు.

అదే క్విట్ ఇండియా!

ఈ ఉద్యమం అహింసా మార్గంలో నిర్వహించాలని తీర్మానించారు. చివరిసారిగా వైస్రాయితో సంప్రదింపులు జరపాలనే గాంధీజీ ఆలోచన సాగలేదు. బ్రిటిష్ గూఢచారులు క్విట్ ఇండియా తీర్మానం గురించి తెలియజేసిన మరుక్షణం గాంధీజీతోసహా అనేక మంది నాయకుల్ని అరెస్ట్ చేసి జైళ్ళలో నిర్బంధించింది ప్రభుత్వం.

మరునాడు ఆ వార్త తెలుసుకుని ప్రజలు ఉగ్రులై ఒక్కసారిగా విరుచుపడ్డారు. జాతీయ గీతాలు, ఊరేగింపులు, సమావేశాలు, అలజడులు హఠాత్తుగా - అప్రయత్నంగా మొదలయ్యాయి. ముందు శాంతియుతంగా ప్రారంభమైనా క్రమంగా హింసాయుత సంఘటనలు చోటు చేసుకున్నాయి. ప్రజా చైతన్యానికి భయపడి ఢిల్లీలో నిరాయుధుల మీద కాల్పులు జరిపించింది ప్రభుత్వం. 76 మంది చనిపోగా, 100 పైగా ఉద్యమకారులు గాయపడ్డారు. దీనితో దేశంలో పలు ప్రాంతాల్లో పోలీసు కాల్పులు, దౌర్జన్యాలు, అరెస్టులు జరిగాయి.

"క్విట్ ఇండియా" నినాదం ప్రజల మనస్సుల్లోకి దూసుకుపోయి మహోధృతంగా ప్రతిధ్వనించసాగింది. ఉద్యమకారులు ప్రవాహంలా పోలీస్‌స్టేషన్, రైల్వేస్టేషన్, పోస్టాఫీస్ వంటి ప్రభుత్వ యంత్రాంగంపై దండెత్తారు. ప్రభుత్వ పాలన దాదాపుగా నిలిచిపోయింది.

సాండర్స్ పని చేస్తున్న ప్రాంతంలో కూడా ఉద్యమం తీవ్ర స్థాయిలో చెలరేగింది. పోలీసుస్టేషన్ మీద కొందరు దాడి చేశారు.

ఉద్యమ కారులు అటుగా రావడం పసిగట్టి స్టేషన్‌లోని పోలీసులు ప్రాణ భయంతో తలో దిక్కు పారిపోయారు. ఆవేశంతో ఉన్న ప్రజలకి అడ్డు, అదుపు లేకుండా పోయింది. స్టేషన్‌లోని రికార్డులు మొత్తం నేలమీద కుప్పగా పోశారు. దాని మీద కుర్చీలు, బెంచీలు వంటి కలప సామాగ్రి పడేశారు. తలుపులతోసహా చేతికి చిక్కిన ఏ వస్తువు వదల్లేదు. ఎవరో రికార్డు ముట్టించారు. నెమ్మదిగా మంట ప్రారంభమై కలప అంటుకుంది.

అంతా స్టేషన్ ముందు నిలుచుని చూడసాగారు.

ఆ సమయంలో సిపాయిల్ని తీసుకుని స్టేషన్ రక్షణ నిమిత్తం వచ్చాడు సర్కిలు. అప్పటికే సమయం మించిపోయింది. ఉవ్వెత్తున ఎగసిన మంటలు స్టేషన్ పై కప్పుని ఆక్రమించాయి. పెద్ద ఎత్తున పొగ పరిసరాలని చుట్టుముట్టింది.

ఆ దృశ్యం చూసి ఆవేశంతో ఊగిపోయాడు సర్కిలు. ఉద్యమ కారులకి వెనుక కాస్త దూరంలో ఆగిపోవడం వల్ల తమనెవరూ గమనించలేదని అర్థం చేసుకున్నాడు. తను ఎదగడానికి ఇది చక్కని అవకాశంగా భావించాడతను. సిపాయిల్ని రెండు వరుసల్లో నిలబెట్టి చెప్పాడు.

"ఎయిమ్"

అంతా తుపాకులు ఎత్తి గురిపెట్టారు.

"గుర్తుపెట్టుకోండి, కాల్చిన తూటా వృథా కాకూడదు. ఒక తూటాకి ఇద్దరు పడిపోవాలి" చెప్పి ఊపిరి తీసుకుని కమాండ్ పాస్ చేసాడు.

"లోడ్ అండ్ ఫైర్"

"స్టాప్, నో ఫైర్..." పిడుగులా వినవచ్చిందో గొంతు.

సర్కిలుతోసహా అందరూ అటు చూశారు. వారికి సాండర్స్ కనిపించాడు.

అప్పుడే సిపాయిల్ని గమనించి ఎవరో




పెద్దగా అరిచారు. మరుక్షణం ఒకరినొకరు తోసుకుంటూ ఉద్యమకారులు పలాయనం చిత్తగించారు. కన్ను మూసి తెరిచేంతలో అక్కడ కాలిపోతున్న పోలీసుస్టేషన్ ఒక్కటే ఉంది.

"ఫైరింగ్ ఆర్డర్సు ఎందుకిచ్చావు?" సర్కిల్‌ని తీవ్రంగా చూస్తూ ప్రశ్నించాడు సాండర్స్.

"బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు సార్. పోలీసు స్టేషనుకి నిప్పు పెట్టి చట్టాన్ని అతిక్రమించారు. కఠిన చర్యలు తీసుకోకపోతే ఉద్యమం ఆగదని ఫైరింగ్ ఆర్డర్స్ ఇచ్చాను..." చెప్పాడు సర్కిలు.

"కఠిన చర్య అంటే కాల్చి చంపడమా?"

సర్కిల్ మౌనంగా ఉండిపోయాడు.

"ఉద్యమంలో పాలు పంచుకుంటున్న వారిని చంపుతూపోతే ఈ దేశంలో ఎంత మంది మిగులుతారో ఆలోచించావా?

ఉద్యమం అదుపు చెయ్యాలంటే వారు చేస్తున్న పనులు తప్పని అర్థమయ్యేటట్టు చెప్పాలి. అప్పుడే నువ్వు అనుకున్నది సాధించగలవు. ఇక్కడ కాల్పులు జరిపి కొంత మందిని హతమారిస్తే, ఆ విషయం పాకి నగరం మొత్తం అల్లకల్లోలమవు తుంది. అప్పుడు జరిగే విధ్వంసకాండని ఆపడం మనతరం కాదు. ఈ నగరంలోని జనాభాకి సరిపడే తూటాలు మనవద్ద లేవని మర్చిపోకు"

సిగ్గుతో మొహం వాల్చేశాడు సర్కిలు.

"సిగ్గుపడకు, స్థిమితపడి ఆలోచించి పని చెయ్యి. మనం ఉన్నది ప్రజల ప్రాణాలు హరించడానికి కాదు. వారిని రక్షించడానికి"

ఆ మాటలు బోధపడినట్టు సెల్యూట్ చేశాడతను.

## 14



గోపాలపురం చాలా చిన్నరైల్వే స్టేషన్ ఉదయం రావాల్సిన రైలు బండి కాస్త ఆలస్యంగా స్టేషన్‌కి చేరుకుంది. ఆ రైలు ఎక్కడానికి స్టేషన్‌లో ఒక్క మనిషి కూడా ఎదురు చూడటం లేదు. ముగ్గురు ప్రయాణీకులు మాత్రం బండి దిగారు. అందులో ఇద్దరు రైలు చివరకు వెళ్లి పట్టాలు దాటి అవతలివైపున ఉన్న గ్రామం దిశగా సాగిపోయారు.

స్టేషన్ మాష్టర్ని చిరునవ్వుతో పలకరించి, టిక్కెట్ అందించి, తోలు సంచితో బయటకొచ్చాడు సాండర్స్. గంట కొట్టిన చప్పుడుతో పాటు రైలు పెద్దగా కూతపెట్టి బయలుదేరింది. రెండు సంవత్సరాల క్రితం రైలు ఎక్కడానికి వచ్చినప్పటిలాగే ఉన్నాయి పరిసరాలు.

స్టేషన్ ముందు ఒంటెద్దు బండి ఒకటి ఉంది. తన ముందున్న ఎండు గడ్డి పరకల్ని నములుతోంది ఎద్దు. దానికి కాస్త ఎడంగా రాయిమీద కూర్చుని చుట్ట కాలుస్తున్నాడో మనిషి. సాండర్స్‌ని గమనించి చుట్ట ఆర్పేసి చెవి వెనుక పెట్టుకుని గబగబా వచ్చాడు.

"తమకోసం ఫాదర్ బండి పంపారు..." చెప్పాడతను.

"నువ్వొచ్చి ఎంతసేపయింది? " అడిగాడు సాండర్స్

"తొలికోడి కూసేక బండి కట్టి చద్దన్నం ఏళకి వచ్చాను దొరా!"

"వెళదాం పద..."

ఆ మనిషి క్షణాలలో బండి సిద్ధం చేశాడు. సాండర్స్‌ని ఎక్కించుకుని బయలు దేరింది. దారికి ఇరువైపులా కోతకొచ్చిన వరి చేను నేలపైకి వాలి కనిపిస్తోంది. మకర సంక్రాంతికి ముందు ఆ పంట రైతు చేతికి అందుతుంది. అప్పటి నుంచి సంబరాలు మొదలవుతాయి. కోడి పందేలు, ఎడ్ల పందేలు,పొటేలు పందేలు- అన్న సరదాలే! కొత్త బట్టలు తొడిగిన పల్లె పడుచుల ముఖాల్లో, కాలి గజ్జెల మువ్వల సవ్వడుల్లో సంక్రాంతి రాక సంపూర్ణంగా దర్శనమిస్తుంది.

ఏ ఇంటి ముందు రిక్తహస్తాలతో నిలుచున్నా పిండి వంటలు అందుకోవడానికి దోసిలి చాలదు. భూమిలేని రైతు కూలీలు సైతం సంతోషంగా కనిపిస్తారు. సంక్రాంతి మూడు దినాల పండుగే అయినా ఐదు రోజులు జరుపుకుంటారు. ఇంటికొచ్చిన అల్లుళ్ళు తిరిగి వెళ్ళడానికి పది రోజులు పడుతుంది. వీధుల్లో వెళుతుంటే ముగ్గుల్లో గొబ్బెమ్మలు స్వాగతిస్తాయి. ఇళ్ళ నుంచి పిండి వంటల ఘుమ ఘుమలు నాశికను తాకి జిహ్వా చాపల్యాన్ని రెచ్చగొడతాయి.

మునిపల్లెలో ఫాదర్‌గా పని చేసినప్పుడు

ఇవన్నీ గమనించాడు సాండర్స్. ఆ గ్రామం వెళ్ళిరావాలని చాలా కాలం నుంచి అనుకుం టున్నాడు. ఇన్నాళ్ళకి తీరిక చిక్కింది.

"నీ పేరేమిటి?" బండి తోలుతున్న వ్యక్తిని అడిగాడు సాండర్స్.

"అప్పన్న..."

"నీకెంత పొలం ఉంది?"

"రెండెకరాల పొలం దొరా!"

"ఈ ఏడాది పంటలు ఎలా పండాయి?"

జవాబుగా తలూపడంతోనే ఊరుకోకుండా అన్నాడు.

"బాగా పండాయి..."

పచ్చటి పొలాలతో కనిపించే గ్రామాల్లో పేదరికం ఉంది. గ్రామస్థుల్లోని సంఘీభావం వల్ల ఆ పేదరికం ఛాయా మాత్రం గానే కనిపిస్తుంది. సాటి మని షిని ఆదరించి అక్కున చేర్చు కునే లక్షణం గ్రామస్థుల్లో చూశాడు సాండర్స్. మునిపల్లె అతన్ని ఎంతో ఆకట్టుకుంది. అంతే కాదు, ఓ మనిషిగా తీర్చి దిద్దింది కూడా!

"క్విట్ ఇండియా ఉద్య మంలో మీ గ్రామస్థులు పాల్గొన్నారా?"

బండి అతను వెనక్కి తిరిగి చెప్పాడు.

"చాలా మంది జైలుకి వెళ్లారు..."

"నిజమా?"

"ఇందులో ఆశ్చర్యప డాల్సింది ఏమీ లేదు దొరా! మేము ఇత రుల సొత్తు కావా లని పోరాటం చెయ్యడం లేదు. మా రాజ్యాన్ని మేము పరిపాలించుకోవాలని మాత్రమే ఉద్యమం చేస్తున్నాం. గాంధీ వల్ల భారతీయులు సంఘటితమయ్యారు. మీరు చూస్తూ ఉండండి... స్వరాజ్యం సాధించడానికి



ఎక్కువ రోజులు పట్టదు" అన్నాడు. అతని గొంతులో అంతులేని విశ్వాసం ఉంది.

అప్పన్న మాటలు ఒకింత ఆశ్చర్యం కలిగించాయి సాండర్స్‌కి. అతని అభిప్రాయంతో ఏకీభవిస్తున్నట్టు అప్రయత్నంగా తల ఊపాడు.

ఈ మధ్యనే ఓ సభలో గాంధీని చూశాడు. ముతక బట్ట చుట్టుకున్న బక్కపలచటి ఆ నాయకుడు తన వాక్కుతో దేశ ప్రజల్ని ఎలా ప్రభావితం చెయ్య గలుగుతున్నాడో ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. చేతిలో కర్ర, కళ్లకి సులోచనాలు, మొలలో గడియారం తప్ప ఏమీ లేవు. కాని అతనిలో కంటికి కనిపించని శక్తి ఏదో ఉందని మనసు పసి గట్టింది.

భారతదేశంలోని ఓ మారుమూల గ్రామానికి కూడా ఉద్యమం ప్రాకి కొందరు జైలుకి వెళ్ళారంటే గాంధీ వద్ద ఏమీ లేదని అనుకోవడం వెర్రితనం అవుతుంది.

సాండర్స్ ప్రవృత్తి, వృత్తి పరస్పర విరుద్ధమైనవి. అయినా ఎలాంటి ఆటంకం లేకుండా పని చెయ్యగలుగుతున్నాడంటే అతనికున్న విశాల దృక్పథమే కారణం. ఈ దేశం నాది కాదు, ఈ ప్రజలు నా వారు కారు అనుకునే స్వభావం కాదతనిది. మానవత్వం ప్రపంచ ప్రజల సొత్తు. అతను మునిపల్లె రావడానికి కారణం కూడా ఆ మానవత్వమే. ఉద్యోగంలో క్షణం తీరిక లేకపోయినా పనిగట్టుకుని బయలుదేరాడు.

భోజనం వేళకి చర్చిముందు బండి ఆగింది. ఎద్దు మెడలోని గంట చప్పుడుకి ఫాదర్ బయటకొచ్చి సాండర్స్‌ని సాదరంగా లోపలికి ఆహ్వానించాడు. అప్పన్నకి కృతజ్ఞతలు చెప్పి ఫాదర్‌ని అనుసరించాడు సాండర్స్.

"గ్రామస్థులు ఇప్పటికీ మిమ్మల్ని తలుస్తున్నారు" ఫాదర్ అన్నాడు.

"అంతా ప్రభువు దయ..."

"మీ నౌకరీ ఎలా ఉంది? "

"అసంతృప్తి ఏమీ లేదు. ప్రభువు దయగలవాడు కనుకనే ప్రజలకు సేవ చేసే అవకాశం నాకిచ్చాడు" అరమోడ్పు కనులతో చెప్పాడు సాండర్స్.

"స్వాతంత్ర్యోద్యమం ఉధృతం కావటం వల్ల మీకు ఇబ్బందులు కలగడం లేదా? "

నవ్వాడు సాండర్స్.

"అతిగా స్పందిస్తే ఇబ్బందే. నేను కర్తవ్యం నెరవేర్చే క్రమంలో క్రూరత్వానికి దూరంగా ఉండి అవసరమైతే కఠినంగా పని చేస్తాను. ప్రజల్ని శత్రువులుగా పరిగణించి అణిచి వేయాలనుకోను"

"అలా అయితే ప్రభుత్వానికి సమాధానం చెప్పుకోవాలేమో? "

"ఇంతవరకూ నాకలాంటి సమస్య ఎదురు కాలేదు" చెప్పాడు సాండర్స్.

ఇద్దరూ కలిసి భోజనానికి కూర్చున్నారు. ప్రత్యేకంగా తయారు చేయించిన మాంసం వంటకాన్ని వదిలి పప్పు మాత్రమే కలుపుకున్నాడు సాండర్స్. అది చూసి ఆశ్చర్యపోయాడు ఫాదర్. సాండర్స్ స్థానంలో గ్రామానికి వచ్చిన తరువాత అతని గురించి ఎన్నో విషయాలు విని ఉన్నాడు. అవన్నీ అతిశయోక్తులుగా భావించాడు. ఆ వ్యక్తిని నేడు ప్రత్యక్షంగా చూస్తుంటే గ్రామస్థుల మాటల్లో నిజం ఉందనిపించింది.

కాసేపు విశ్రాంతి తీసుకుని టీ తాగాడు సాండర్స్. అదే సమయంలో అతణ్ణి చూసి పలకరించి వెళ్ళడానికి గ్రామ పెద్దలు వచ్చారు. వాళ్ళ ద్వారా గ్రామ విశేషాలు తెలుసుకుని, అక్కడ బడి పెట్టడానికి తన వంతు సహకారం అందిస్తానని వారికి వాగ్దానం చేశాడు.

సాయంకాలం ఫాదర్‌ని వెంటపెట్టుకుని గ్రామాన్ని సందర్శించాడు సాండర్స్. గ్రామస్థులు గుర్తు పట్టి నమస్కరిస్తుంటే ప్రతి నమస్కారం చేస్తూ యోగక్షేమాలు అడిగి తెలుసుకుంటున్నాడు. ఒకచోట దారి పక్కన ఓ దృశ్యం చూసి ఆగాడు సాండర్స్.

## అయితే తప్పేంటి?

'అప్పుచేసి పప్పుకూడు' సినిమాకు మ్యూజిక్ రిహార్సల్స్ చేస్తున్నారు. గీతరచయిత పింగళి రాసిన 'సుందరాంగులను చూసిన వేళల కొందరు ముచ్చట పడనేలా? కొందరు పిచ్చను పడనేలా?' పాటకు రాజేశ్వరరావుకడుతున్న బాణీలు ఏవీ చక్రపాణికి నచ్చడంలేదు. చివరికి ఆయనే అంతకుముందు తాముతీసిన 'మిస్సమ్మ' సినిమాలో 'బృందావనమది అందరిదీ.. గోవిందుడు అందరివాడేలే' స్టైల్లో చెయ్యమని సలహా ఇచ్చారు.




'మళ్లీ అదే బాణీయా? ఏంబాగుంటుంది? ఎవరు చూస్తారు?' అన్నారు రాజేశ్వరరావు.

'ఎందుకు చూడరు? అదే ఎన్టీఆర్, అదే సావిత్రి, అదే రేలంగి, అదే ఘంటసాల, అదే పింగళి, అదే నువ్వూ కాగాలేనిది.. అదేబాణీ అయితేతప్పేంటి?' అన్నారు చక్రపాణి.

ఆయన అలా అన్నాక ఇంకా ఎవరేం మాట్లాడతారు? మౌనంగా పనికానిచ్చేశారు. అందుకే ఆ రెండు పాటలూ ఇంచుమించు కొద్దిపాటి తేడాతో ఒకేలా వినబడతాయి.

నాలుగు సంవత్సరాల పసివాడిని ఒకతను బెత్తంతో కొడుతున్నాడు. దెబ్బతగులుతుంటే ఆ బాలుడు ఎగిరిపడుతూ చేతులతో దెబ్బల్ని కాసుకోవడానికి ప్రయత్నిస్తున్నాడు. అప్పటికే నగ్న శరీరం మీద వాతలు కనిపిస్తున్నాయి.

తల్లిదండ్రులు పిల్లల్ని దండించడం సాధారణ విషయమే కాబట్టి, సాండర్ ఎందుకు చూస్తున్నాడో అర్థం కాలేదు ఫాదర్‌కి. అతను ఆలోచిస్తుండగానే ఆ వ్యక్తిని సమీపించి బెత్తంతో పైకి లేచిన చెయ్యి పట్టుకున్నాడు సాండర్స్.

"పసివాడిని ఎందుకు కొడుతున్నారు?" శాంతంగా అడిగాడు.

"నన్నడగడానికి మీరెవరు?" విసురుగా ఎదురడిగి చెయ్యి విడిపించుకునే ప్రయత్నం చేశాడతను.

"శాంతించండి మహాశయా! పిల్లల్ని శిక్షించడానికి ఓ హద్దుంది. ఆ కుర్రవాడి శరీరం ఇక దెబ్బలు భరించే స్థితిలో లేదు..." సౌమ్యంగా అన్నాడు.

"వీడు ఛస్తే పీడాపోతుంది. ఎన్నిమార్లో చెప్పాను, తక్కువ వర్ణం వారితో తిరగొద్దని. అక్షరాలు దిద్దమంటే పశువుల కాపరుల వెంట పోయాడు. ఏటిలో మురికి నీటిలో మునిగి వచ్చాడు. వీడి ఆగడాలు ఇక తట్టుకోలేకపోతున్నాను" తన గోడు వెళ్ళబోసుకున్నాడతను.

బెత్తం లాక్కుని దూరంగా విసిరేశాడు సాండర్స్.

"ఈ బిడ్డ పుట్టక ముందు పిల్లలకోసం మీరు భగవంతుణ్ణి ప్రార్థించారా?" అడిగాడు. ఆ వ్యక్తి ఆశ్చర్యంగా చూశాడు.

"నుదుటిన తిలకం ఉందంటే మీరు భక్తిపరులని, నిత్యం దేవుణ్ణి పూజిస్తారని అర్థమవుతోంది. పసివాళ్ళు దైవంతో సమానమని పెద్దలు అంటారు. దేవుణ్ణి పూజించిన చేతులతోనే భగవంతుని ప్రతిరూపాన్ని శిక్షించడం న్యాయమా చెప్పండి? మీ శరీర వర్ణం మిమ్మల్ని గొప్పింటి వ్యక్తిగా చెప్పకనే

కష్ట
సమయంలో
కొడుకుని
పంపి సహాయ
పడిందా
వృద్ధురాలు.
ఆమె చూపిన
తెగువ,
సహృదయత
నేను సూపరిం
టెండెంట్‌ని
కావడానికి
దోహదం
చేశాయి

చెబుతోంది. కాని మీ ప్రవర్తనలో మాత్రం ఆ గొప్పతనం లేదు. పిల్లల్ని విచక్షణారహితంగా దండించేవాడు, ఆ పిల్లల ప్రేమని పొందలేడు" అని ఆ వ్యక్తి విస్మయం నుండి తేరుకోక ముందే అక్కడ నుంచి కదిలాడు సాండర్స్.

అతన్ని గ్రామస్థులు గుర్తుంచుకుని గౌరవించడానికి కారణం ఏమిటో కొంత వరకూ అర్థం చేసుకుని, అంత వరకూ పక్కన నడిచిన వాడు ఇప్పుడు వెనుక వినయంగా అడుగులు వేశాడు ఫాదర్.

అలా వెళ్ళి గ్రామం చివర ఓ పాక వద్ద ఆగారు.

బయట పిండి దంచుతున్న వృద్ధురాలు వారిని చూసి చేస్తున్న పని ఆపి, కళ్ళు చిట్లించి చూసి సాండర్స్‌ని గుర్తుపట్టింది.

"దయచేయండి ఫాదరీ బాబూ" ఈ రోజు నా ఇల్లు పావనమైంది" అంటూ నులక మంచం వాల్చింది. వారిద్దరూ కూర్చున్న తరువాత పాకలోకి వెళ్ళి రెండు గళాసులతో చిక్కటి మజ్జిగ తెచ్చింది.

"ఎలా ఉన్నావమ్మా? " సాండర్స్ అడిగాడు.

"తమ తోటి సహృదయుల ఆశీర్వాద బలంతో క్షేమంగానే ఉన్నాం ఫాదరీ బాబూ! మీరు వెళ్ళిన తరువాత గ్రామానికి కళలేకుండా పోయింది. అర్థరాత్రి పిలిస్తే పలికే దిక్కుని పోగొట్టుకున్నాం"

"నీ కొడుకు ఏడమ్మా? " సాండర్స్ మాట తప్పించాడు, పక్కన ఉన్న ఫాదర్ మొహం వాడిపోవడం గమనించి,

"ఊరెళ్ళాడు బాబూ!"

"వివాహం చేశావా? "

"నా భర్త మాట తప్పడం, తప్పనే వాడు ఫాదరీ బాబూ!"

"నీ కోడల్ని చూపించవా? "

"ఆమె మనవణ్ణి తీసుకుని పుట్టింటికి వెళ్ళిందయ్యా. నా కొడుకు వచ్చేటప్పటికి తిరిగొస్తుంది"

"నీ కొడుకు వచ్చాక భార్యని, పిల్లవాణ్ణి తీసుకుని చర్చికి రమ్మని చెప్పమ్మా! ఎంత రాత్రయినా చూస్తుంటాను. ఈ గ్రామం చూడాలనుకోవడానికి మీరు కూడా కారణమని మర్చిపోకమ్మా"

వృద్ధురాలు తలూపి, వెళుతున్న సాండర్స్‌కి నమస్కరించింది.

"సాండర్స్! ఆమె కొడుకుతో ఏదైనా పని ఉందా? " దారిలో అడిగాడు ఫాదర్.

కొన్ని క్షణాలు ఆలోచించి తల అడ్డంగా ఊపాడు సాండర్స్.

"ఎవరికైనా రుణపడితే మరో జన్మ ఎత్తి దానిని తీర్చుకోవాల్సి ఉంటుందని ఇక్కడి ప్రజలు నమ్ముతారు. కష్ట సమయంలో కొడుకుని పంపి సహాయపడిందా వృద్ధురాలు. ఆమె చూపిన తెగువ, సహృదయత నేను సూపరింటెండెంట్‌ని కావడానికి దోహదం చేశాయి. మంచి వారిని, సహాయం చేసిన వారిని విస్మరించడం ఏ సమాజం హర్షించదు. నా అంచనా ప్రకారం, భారతీయులు త్వరలో

స్వరాజ్యం సాధించుకుంటారు. ఈ లోపు రుణ విముక్తుణ్ణి కావడం శ్రేయస్కరమని భావించి వచ్చాను"

సాండర్స్ హృదయం పూర్తిగా అర్థమయింది ఫాదర్‌కి.

చీకటి పడిన చాలా సేపటికి రామయ్య వచ్చాడు. వారి కోసం ప్రార్థన చేశాడు సాండర్స్. తిరిగి వెళ్ళుతున్నప్పుడు రామయ్య కొడుకు మెడలో బంగారు గొలుసు ఉంది.

దానికి శిలువ వేలాడుతోంది.

## 15



వేసవి ప్రవేశించింది.

మామిడి చెట్లు చిగిర్చి పిందె కట్టాయి. చలి గాలి తగ్గి, వేడెక్కుతున్న కొండలతో గాలి జత కట్టింది. ప్రకృతిని చూసి కాలాన్ని అంచనా కట్టే కోదులు, ఆ మార్పు పసిగట్టి తమకి నాలుగు మాసాల పాటు పని లేదని ఆయుధాలు వెలికి తీశారు. డోక్రిబేడా వారిలో యుద్ధానికి సమాయత్తమవుతున్నట్టు హడావిడి నెలకొంది.

వానాకాలం, చలికాలం జంతువుల వేట సాగదు. వేసవి వచ్చిందంటే మాంసం సమృద్ధిగా చిక్కుతుంది. ఏడాదిలో వేట లేని దినాల కోసం మాంసం ఎండబెట్టేది అప్పుడే. అందుకే వేసవి ప్రారంభమైన తరువాత ఎన్నో ఏర్పాట్లు చేసుకుని దాదాపుగా గ్రామం అంతా వేటకి వెళుతుంది.

పులి సంచారం తెలిస్తే మిగతా గ్రామాలకు మిరపకాయ టపా ద్వారా వర్తమానం పంపుతారు. నాలుగైదు గ్రామాలవారు ఒక దగ్గర చేరి పులి కోసం అడవి మొత్తం గాలిస్తారు. పులిని మట్టుబెట్టకపోయినా మరో చోటికి తరిమితే చాలునని అనుకుంటారు. ఈ ఏడు పులి గురించి ఎలాంటి కబురూ రాలేదు. అందువల్ల డోక్రిబేడా కోదులు వేటకి వెళ్ళి మాంసం సంపాదించాలని నిర్ణయించుకున్నారు.

చూరుల్లో దాచిన ఈటెలు బయటకి లాగి తుప్పు పట్టిన మొనలకు పదును పెట్టారు. కొందరు అడవి నుంచి అరుదుగా లభించే మొక్కల వేర్లు సేకరించుకుని వచ్చారు. ఆ వేళ్ళ రసం కుళ్ళిన మాంసానికి కలిపి విషం తయారు చేసి బాణాల మొనలకు పూశారు. ఉప్పు, మూత్రం, ఎండు చేపలు, మెంతులు మొదలైనవి కలిపి ముద్దలా నూరి జంతువులు సంచరించే మార్గంలో ఉంచుతారు. దాని వాసన పసిగట్టి వస్తుంది జంతువు. ఆ పదార్థం ముట్టిన వెంటనే మైకం కమ్మి పడిపోతుంది. ఆ పనిలో కొంత మంది నిమగ్నమయ్యారు.

గ్రామంలో ఇలాంటి సందడి నెలకొని ఉంటే అదేమీ పట్టనట్టు తన గుడిసె ముందు మౌనంగా కూర్చుని ఉన్నాడు సోనా కోదు.

అతని ఆలోచనలు జాగిలీ చుట్టూ పరిభ్రమిస్తున్నాయి. ఆమెని వశం చేసుకోవడానికి చేసిన ప్రయత్నాలు ఏవీ ఫలించలేదు. ఈ మధ్యనే తన మనసులోని మాట నేరుగా ఆమెతో చెప్పాడు. ఈ ఏడు వేటకి వెళ్ళినప్పుడు ఎవరు పెద్ద జంతువుని కొడితే, ఆ మొనగాడిని మనువాడతానని తెగేసి చెప్పిందామె. వేటకి పోయిన మగవారందరికీ ఆ మాట వర్తించదు. సోనా కోదు, చాచిరి కోదు ఇద్దరిలో ఎవరు కొడితే వారి వెంట వెళుతుంది.

సోనా కోదు, చాచిరి కోదు రెండు పొద్దుల తేడాతో పక్కపక్క గుడిసెల్లో పుట్టిన పిల్లకాయలు. ఊహ తెలియని

వయసు నుంచి ఇద్దరూ కలిసి ఆడుకున్నారు. మట్టిలో పొర్లడం, వర్షంలో గెంతడం, గెడ్డలోచేపలు పట్టడం కలిసే చేసేవారు. వయసు వచ్చిన జాగిలీ, యువ స్నేహితులైన వారిద్దరితో పరాచికాలాడేది కానీ, ఎవర్నీ దగ్గరకు రానివ్వలేదు.

జాగిలీ తన నిర్ణయాన్ని ఒక రోజు వారికి తెలియజేసింది. ఆమెని పెళ్లాడటం ముఖ్యమనుకున్న స్నేహితులు కలిసి తిరగడం మానేశారు.

రచ్చబండ వద్ద వేట ముహూర్తం ప్రకటించినప్పటి నుంచి ఆలోచించడం ప్రారంభించాడు సోనా కోదు.

అతనికి వేట కొత్త కాదు. తండ్రితో జంతువుల్ని వేటాడటానికి వెళ్ళిన అనుభవం ఉంది. వేటలోని మెలకువలు తెలుసుకున్నాడు. హఠాత్తుగా ఎదురు పడిన జంతువుని వేటాడటం కంటే మాటు వేసి కొట్టడం వేటగానికి సులువు. వేసవిలో జంతువులు నీటి కోసం తహతహలాడతాయి. అడవిలో నీళ్ళు ఎక్కడ ఉంటే అక్కడకు వెళతాయి. నీళ్లున్న చోటు కనుక్కోగలిగితే వేట విజయవంతమవుతుంది.

వెంటనే పొద్దున్న అంబలి త్రాగి అడవి గాలించడం మొదలెట్టేడు. ఎన్నడూ పోని ప్రదేశాలు కూడా చూశాడు. మరో వ్యాపకం పెట్టుకోకుండా పిచ్చి పట్టినట్లు కలియతిరిగి వచ్చాడు. ఆయుధాలు సిద్ధం చేసుకుని గుడిసె ముందు మౌనంగా కూర్చున్నాడు.

అతని గుడిసెకి ఎదుటి వరుసలో చివర ఉంది జాగిలీ ఇల్లు. ఆమె గుడిసె నుంచి బయటకొస్తుందని పరిసరాలు మర్చిపోయి ఆశగా చూస్తున్నాడు.

"ఏరా! మతిగాని పోనాదేంటి? " తల్లి బిగ్గరగా అరవడం వినిపించింది.

తుళ్ళి పడి వెనక్కి చూశాడతను. గంజి నీళ్ళు తాగడానికి తల్లి పిలుస్తోందని గ్రహించి అయిష్టంగానే లోపలికి వెళ్ళాడు.

అక్కడ చాచిరి కోదు తీసి పారేయాల్సిన మనిషేమీ కాదు. సోనా కోదుతో పోలిస్తే వేటలో అతనికే ఎక్కువ అనుభవం ఉంది. మందు పెట్టి జంతువుని కొట్టడంలో సిద్ధహస్తుడు.

జాగిలీ నిర్ణయం చెప్పిన తరువాత వేట వార్త తెలియడానికి రెండు దినాల ముందు అడవిలో ఒక దగ్గర పులి సంచరించిన జాడ చూశాడు. ఆ విషయం ఎవరికీ చెప్పకుండా మనసులో ఉంచుకున్నాడు. అక్కడ మందు పెట్టి పులిని కొట్టాలని నిశ్చయించుకున్నాడు. పులిని మించిన జంతువు అడవిలో లేదు. ఒంటరిగా దానిని చంపే సాహసం కలలో కూడా ఎవరూ చెయ్యరు. పులిని కొట్టగలిగితే, సోనా కోదు ఎలాంటి జంతువుని వేటాడి తెచ్చినా అది పులితో సమానం కాదు. కనుక జాగిలీ తనకే దక్కుతుంది.

అదీ అతని ఆలోచన!

ఒకనాడు సూర్యుడు ఆకాశంలోకి జొరబడకముందు ముసలివాళ్ళని, పిల్లల్ని, పెద్ద వయస్సు ఆడవాళ్ళని గ్రామంలో వదిలి మిగతా వాళ్ళంతా వేట పనిమీద అడవిలోకి ప్రవేశించారు. ఆడ జట్టుతో నడుస్తున్న జాగిలీని వారగా చూశాడు సోనా కోదు. కనులు కలియతిప్పుతూ పక్కనున్న జతగత్తెతో మాట్లాడుతోంది. అంత మందిలో ఆమె ప్రత్యేకంగా కనిపించింది.

ఓ మలుపులో నీడలా చెట్టు వెనక్కి జరిగాడతను. గ్రామస్థులు కనుమరుగయ్యేంత వరకూ ఆగి బయటకొచ్చి ఎడమ పక్క తుప్పలకు అడ్డంపడి నడవసాగాడు. చకచకా చెట్లు దాటి సాగిపోతున్నాడు. అతని మనసుని జాగిలీ పూర్తిగా ఆక్రమించింది. బుర్రలో మరో ఆలోచనంటూ లేదు. కొండెక్కి లోయలోకి దిగేసరికి బరువైన కండరాలకు చెమటపట్టి మరింత బరువెక్కాయి.

ఒక చోట ఆగిపోయి పరిసరాలని పరిశీలనగా చూశాడు. ఎక్కడా ఎలాంటి అలికిడి లేదు. అక్కడ తనొక్కడే ఉన్నాడనే భావం

కలగలేదు. ఓ రాయి వెనుక మోకరించి కూర్చున్నాడు. ఈటె, విల్లు పక్కన పెట్టి పది గజాల దూరంలోని మడుగు వైపు దృష్టి సారించాడు.

కొండ దిగువున లోయలో ఉందా మడుగు. దానికి చుట్టూ జంతువులు సంచరించిన అడుగు జాడలున్నాయి. అక్కడ అడవి దట్టంగా ఉండటం వల్ల దూర ప్రాంతాల నుంచి కూడా జంతువులు దాహం తీర్చుకోవడానికి నిర్భయంగా వస్తాయి. అడవి అంతా గాలించి ఆ మడుగు జాడ తెలుసుకున్నాడు. జంతువుల కాలి గుర్తుల్లో కణుజు అడుగులు కనిపించాయి. ఇరవై మంది కలిసినా ఎత్త లేని శరీరం గల జంతువు అది. దానిని వేటాడితే గ్రామానికి ఆహారంగా సరిపోతుంది. జాగిలీని పొందడానికి అతను ఎన్నుకున్న మార్గమది!

ఆకులు కదిలిన అలికిడి. చురుగ్గా అటు చూశాడు. తుప్పల మధ్య నుంచి బయటకొచ్చింది ముళ్ళ పంది ఒకటి. మడుగు సమీపించి నీళ్ళు తాగబోతూ ఏదో ఉపద్రవం కనిపెట్టినట్టు జానెడు పొడవు గల ముళ్ళు తెరిచి తలెత్తి కోరగా చూసింది. అది మనిషి వాసన పసిగట్టిందని గ్రహించి మరి కొంచెం వంగాడతను. చిన్న చిన్న జంతువుల్ని వేటాడి అక్కడ అలజడి సృష్టించే ఉద్దేశ్యం లేదు సోనా కోదుకి. అందుకే నిశ్శబ్దంగా చూస్తూండిపోయాడు.

కాసేపు పరిసరాలు పరికించి సందేహానికి తగిన కారణం కనిపించకపోవడంతో నీళ్ళు తాగి తుప్పల్లో అదృశ్యమైందా ప్రాణి. క్రమంగా సూర్యుడు తలపైకి వచ్చాడు. ఓపిగ్గా, అప్రమత్తంగా వేచి ఉన్నాడు. సోనా కోదు. వేటగానికి సహనం అవసరమని, తనను వేటకి తీసుకెళ్ళిన తొలినాడే తెలుసుకున్నాడు.

ఇంతలో కుందేళ్ళ మంద వచ్చింది. కాసేపు అటు ఇటు గెంతి మడుగులో మునిగి కడుపు నిండా నీళ్ళు తాగి వెళ్ళిపోయింది.

పక్షులు అరచుకుంటూ హడావిడిగా ఆకాశంలోకి ఎగిరాయి. ఏదో జంతువు అటుగా వస్తోందని గ్రహించి రాయి మీద వాలిపోయి ఊపిరి బిగపట్టి చూస్తున్నాడు.




అతని గుండె ఉద్వేగంతో కొట్టుకుంటోంది.

పొదవాటి తోక కదిలిస్తూ, తీక్షణమైన కనులు కలియదిప్పుతూ అక్కడకు ఠీవిగా వచ్చిందో వ్యాఘ్రం. దానిని చూసి గుండె ఆగినంత పనయింది సోనా కోదుకి. ఆ మడుగు చుట్టూ ఉన్న జాడల్లో పులి సంచరించిన జాడలు లేవు. అందుకే ఒంటరిగా అక్కడికి వచ్చాడు. మరి... మరి ఇదెక్కణ్ణుంచి వచ్చింది? ఎలా వచ్చింది? మడుగు చుట్టూ జాడల్ని తను సరిగా కనిపెట్టుకోలేకపోయాడా? లేక... అది మొదటిసారిగా మడుగు దగ్గరకు వచ్చిందా? ... ఏమీ అర్థం కాలేదతడికి. ఒక్కసారిగా నిలువెల్లా ముచ్చెమటలు పట్టాయి. నరనరాన్ని అంతులేని భయం ఆక్రమించింది. ఆ మడుగు వద్ద మాటువేసి తానెంత తప్పు చేశాడో తెలిసివచ్చింది.

భయాన్ని అణుచుకోవడానికి ప్రయత్నిస్తూ బిత్తర చూపులతో అటే చూడసాగాడు.

పులి అక్కడకు వచ్చిందంటే మిగతా జంతువులు అటు తిరిగే ప్రయత్నం చెయ్యవు. తను అనుకున్నట్టు కణుజుని కాదుకదా కుందేలుని కూడా కొట్టలేనని అర్థ

మయింది. వేట అదృష్టం మీద ఆధారపడి ఉంటుందని పెద్దలు చెప్పిన మాట గుర్తొచ్చింది.

పులిని వేటాడటం అంత తేలికైన పని కాదు. పది మంది ఒకేసారి బాణాలతో గాయపర్చి, అది తేరుకునే లోపు ఈటెలతో దాడి చేస్తే తప్ప చావదు. ఏ మాత్రం ఏమరుపాటు చూపినా ప్రాణాల మీద ఆశ వదులుకోవాల్సిందే. ఒంటరిగా పులిని కొట్టిన మొనగాడు కోదు జాతి చరిత్రలో లేడు. ఈ కారణాల వల్ల తను ఓడిపోవడం ఖాయమని జాగిలీని చాచిరి కోదు ఎగరేసుకుపోతాడని నిశ్చయించుకున్నాడు. అతనికి ఎక్కడ లేని విచారం కలిగింది. దానితో పాటు జీవితం మీద విరక్తి పుట్టింది.

అతని ఆలోచనలతో పనిలేనట్లు నిశ్చింతగా నీటిలోకి దిగింది పులి. అడుగులు ముందుకు వేసే ముందు ఎందుకో గంభీరంగా అటూ ఇటూ పరికించింది. ఆ తర్వాత మడుగులో కొంత ముందుకు వెళ్ళి కాసేపు నీటిలోని చల్లదనం అనుభవించి, కడుపు నిండా నీళ్లు తాగి, ఒడ్డు మీదకొచ్చింది. మోర పైకెత్తి ఆకాశం వంక చూసి ఒళ్లంతా కదల్చి దులుపుకుని ముందు కాళ్లు చాపి నేలను తన్నిపెట్టి ఒళ్లు విరుచుకున్నట్లు చేసి మళ్లీ పరిసరాలను గమనించింది. పెద్దగా ఆవులించినట్లు నోరు తెరచి మూసుకుంది. అడుగు అడుగు కూడదీసుకున్నట్లు నెమ్మదిగా ముందుకు నడుస్తోంది.

జాగిలి లేకుండా బతకడం కంటే, పులిని సంహరించే ప్రయత్నంలో ప్రాణాలు వదలడమే మంచిది" అనే ఆలోచన హఠాత్తుగా సోనా కోదు బుర్రలో పుట్టింది.

వెంటనే



అప్రయత్నంగా ఎడమ చెయ్యి విల్లు అందుకుంది. కుడి చెయ్యి విల్లుకి బాణం సంధించి వింటినారి చెవి వరకూ లాగింది. ఎడమ కన్ను గురి చూసింది. ఆ బాణంతో పులిని చంపడం అసాధ్యమని, అది తగిలితే దానికి ముల్లు గుచ్చుకున్నట్టు ఉంటుందని వివేకం హెచ్చరిస్తున్నా అప్పటికే కుడి చెయ్యి బాణం వదిలిపెట్టింది.

గాలి నుంచి దూసుకు పోతున్న బాణం నుండి రివ్వుమనే చప్పుడు వెలువడింది. అతి సున్నితమైన ఆ శబ్దానికి తల తిప్పింది పులి. మరుక్షణం శక్తికొద్దీ ప్రయోగించిన అమ్ము దాని ఉదరంలోకి చొచ్చుకుపోయింది.

బాధ తెలియక ముందే, ఓ మనిషి రాయి వెనుక నుండి నెమ్మదిగా లేవడం కంటపడింది. పూర్తిగా ఇటు వైపు తిరిగింది. అతను తన మీద దాడి చేస్తాడని అనుకోకపోవడం వల్ల ఆశ్చర్యపడినట్లు ఒక్క క్షణం నిదానంగా సోనా కోదుని చూసింది. అప్పటికి గాయం కలిగించిన బాధ దాని నషాళానికి చేరింది. భీకరంగా గాండ్రించి మెరుపులా అతడున్న వైపుకి ఒక్కుదుటున దూకింది.

అందుకు సిద్ధంగా ఉన్నట్టు మొండి పట్టుదలతో ఎడమకాలు వెనక్కి తన్ని పెట్టి ఈటెని బలంగా ముందుకి దూశాడు సోనా కోదు. మీద పడుతున్న పులి కంఠం నుండి ఈటె దూసుకుపోయి ఆ బరువుకి కర్ర విరిగిపోయింది. పులితో పాటు వెనక్కి పడిపోయాడతను.

కడుపులోని బాణం, గొంతు చీల్చిన ఈటె విపరీతంగా బాధిస్తుంటే కోపంతో రెచ్చిపోయి సోనా కోదు మీదకు లంఘించింది పులి.

అది చూస్తూనే శరీరాన్నంతా బిగించి అతి లాఘవంగా అమిత వేగంతో పక్కకి దొర్లాడు. పులి ఒక్కుదుటున దూసుకుపోయి బొక్కబోర్లా పడినట్లుగా



నాలుగు కాళ్లు చాచుకుని పడింది. అంతలో నే కాళ్ళు కూడదీసుకుని బంతిలా గిర్రున తిరిగి అతడి మీదకురికింది. దాని కళ్లు అమిత రౌద్రంగా ఉన్నాయి. ఆ చూపు అతి భయంకరంగా ప్రాణాలు తోడేసేలా ఉంది.

దాని కదలికలో వేగాన్ని పసిగట్టిన సోనా కోదు క్షణం ఏమారితే తన ప్రాణాలు గాలిలో కలిసిపోతాయని గ్రహించాడు. క్షణంలోనే అతడి చూపు పరిసరాల్ని గమనించింది. అయిదడుగుల దూరంలో ఎండిపోయిన మొద్దుపడి ఉండడం చూశాడు. అంతే శరవేగంతో కదిలి తన మీద పడబోయేంతలోనే దాన్నందుకున్నాడు. శక్తినంతా కూడదీసుకుని రెండు చేతుల్తో దాని పట్టుకుని గిరగిరా తిప్పి బలం కొద్దీ మీద పడబోతున్న పులిని చాచి కొట్టాడు. ఆ మొద్దు సూటిగా పులి ముఖానికి తగిలింది. దాన్ని దిమ్మతిరిగిపోయింది. ఒక్కసారిగా తల విదిల్చింది. కసి రెండింతలు పెరిగిపోయింది. గిరుక్కున పక్కకి తిరిగి పంజా విసిరింది. సోనా కోదు భుజం ఆ పంజాకి చిక్కినట్లే చిక్కి జారుకుంది. అతడి భుజం చీరుకుపోయి వెచ్చటి నెత్తురు జివ్వున చిమ్మింది. అతడికి పై ప్రాణాలు పైనే పోయినట్లనిపించాయి.

ఆ పంజా దెబ్బకి బొక్కబోర్లా పడిపోయాడు. చాచుకున్న చేతులు అక్కడ ఉన్న పెద్దరాతికి కొట్టుకున్నాయి.

అంత బాధలోనూ ఆ రాయిని పట్టుకుని గిరుక్కున వెల్లికిలా తిరిగాడు.

పులి భీకరంగా మీదకు విరుచుకు పడింది. దాని పంజా అతడి గుండెల మీద పడేలోగానే రెండు చేతుల్తో పట్టుకున్న రాయిని దాని ముఖం కేసి ఈడ్చిపెట్టి కొట్టినట్లు కొట్టాడు.

ఈ దెబ్బకి పులి నుదురు చిట్లింది.

సోనా కోదు వెల్లకిలా పడిపోయాడు. పక్కనే ఉన్న మరో రాయికి అతడి తల బలంగా కొట్టుకుంది.

ఒక్కసారిగా నక్షత్రాలు కనిపించినట్టుందతడికి. క్షణంలో శరీరం అచేతనమయింది.

మళ్లీ లంఘించబోయిన పులి అతడి శరీరం నిశ్చలంగా ఉండడం చూసి ఆగింది. అతను లేస్తాడనీ, పంజాతో గుండె చీల్చాలనీ వెనుక కాళ్ళ మీద కూర్చుని నిరీక్షించసాగింది. నెమ్మదిగా సమయం గడుస్తోంది. గాయాల నుండి రక్తం కారి, పులి డొక్కలు, ఎగిరెగిరి పడుతున్నాయి. సోనాకోదు సాహసానికి తల వంచినట్టు నెమ్మదిగా పక్కకి ఒరిగిపోయింది.

అడవి చీమలు శరీరాన్ని పట్టి పీకుతుండడంతో కనులు తెరిచాడు సోనాకోదు. తలకి తగిలిన దెబ్బ బాధ కలిగిస్తుంటే చేత్తో తడుముకున్నాడు. రక్తం వేళ్లకి అంటుకుంది. యధాలాపంగా తల తిప్పి పక్కనే పడున్న పులిని చూసి తుళ్ళి పడ్డాడు. దాని శరీరంలో ప్రాణం లేదని గ్రహించడానికి కొన్ని క్షణాలు పట్టింది. జరగరానిది జరిగినట్టు కొంతసేపు విగ్రహంలా ఉండిపోయాడు.

ఒక సంతోష తరంగం గుండెల్ని క్రమంగా అలుముకుంది. ఆ గొప్ప సంగతిని ఎవరితో పంచుకోవాలో తెలియక ఆకాశం వైపు రెండు చేతులు ఎత్తి పెద్దపెట్టున అరిచాడు.

"నెగ్గేశాను..."

సొను కోదు తేరుకునేసరికి చాలా సమయం గడిచింది. సూర్యుడు వాలిపోతున్న దృశ్యం చూసి మడుగుని సమీపించి నీళ్ళు మొహం పైన జల్లుకుని, రక్తాన్ని కడుక్కున్నాడు. మొలలో దాచిన కొమ్ము బూరా బయటకు తీసి గుండెల నిండా గాలి నింపుకుని ఊదాడు. గుంపులు గుంపులుగా విడిపోయిన గ్రామస్థులు, జంతువు చిక్కినప్పుడు మిగతా వారికి సమాచారం అందజేసేందుకు ఉపయోగించే బూరా అది.

ఆగి ఆగి వినిపిస్తున్న బూరా శబ్దం ఆధారంగా డోక్రీబేడావారు అక్కడికి చేరుకున్నారు. అక్కడి దృశ్యం చూసి తమ కళ్లని

తాము నమ్మలేనట్లు స్థాణువులైపోయారు. ఒక్కసారిగా సంభ్రమాశ్చర్యాలు వాళ్ళని కమ్మేశాయి. పులిని సంహరించిన సోనా కోదుని భుజాలకు ఎత్తుకుని తమ హర్షం ప్రకటించారు.

జాగిలీ కళ్ళు మెరుస్తున్నాయి.

వేట అదృష్టంపైన ఆధారపడి ఉంటుందని, తను మందు పెట్టి ఎదురు చూస్తున్న పులి సోనాకోదు మాటు వేసిన మడుగు వైపు వెళ్లిందని, అతను ప్రాణాలను తెగించి ఒంటరిగా పులిని చంపాడని గ్రహించిన మరుక్షణం చాచిరి కోదు ముఖంలో నీలి నీడలు కదిలాయి. అతను తిరిగి మామూలు మనిషి కావడానికి చాలా సమయం పట్టింది. జాతికి పేరు తెచ్చిన నేస్తాన్ని మనస్ఫూర్తిగా అభినందించి, తను వేటాడిన కొండ గొర్రెని ఓ యువకునికి అప్పగించి దూరంగా వెళ్ళిపోయాడు చాచిరి కోదు.

ఆ రోజు బాగా రాత్రయిన తరువాత జాగిలీ పసరు తీసుకెళ్ళి సోనా కోదు గాయానికి పూసి వచ్చింది. గుండెల్లో తనని దాచుకున్న ఆ సాహసికి ఓ కానుక సమర్పించిందని ఎవరికీ తెలియదు.

వెలుగు విరజిమ్ముతున్న చంద్రునికి తప్ప!

## 16



రెండు దినాలు గడిచాయి.

ఉదయం ఇంటి ముందున్న జాగాని తుడవడానికి బయటికొచ్చింది జాగిలీ. అప్పటికి తెల్లగా తెల్లవారిపోయినా సూర్యుడు కొండ వెనుక నుంచి బయటకు రాలేదు. వాతావరణం చల్లగా, ఆహ్లాదకరంగా ఉంది. గ్రామస్థులు తమ పనుల మీద అటూ ఇటూ పోతున్నారు.

"ఒలే గుంటా! సీపురట్టుకున్నావేంటే? " ఎక్కడ లేని ఆశ్చర్యంతో అడిగింది, ఎదురు గుడిసె ముందు నిలుచున్న స్త్రీ.

ఆమెకు తెలిసినంతవరకూ ఆ పిల్ల ఎన్నడూ గుమ్మం శుభ్రం చెయ్యలేదు. ఆ సమయానికి లేచి రమ్మని జాగిలీ తల్లి అరుస్తూ ఉండాలి. గుడిసె నుంచి బయట పడింది మొదలు మగరాయుడులా గ్రామం అంతా చక్కబెట్టుకుని వస్తుంది. పిల్లలతో చేరి ఆడటమే కాదు, వయసొచ్చిన కుర్రాళ్లని ఏడిపిస్తుంది కూడా. అలాంటి అమ్మాయి రాత్రికి రాత్రి తను ఆడదాన్నని తెలిసినట్టు తెల్లారగట్ల చీపురుతో కనిపించేసరికి ఆశ్చర్యం దాచుకోలేక పోయిందా ఎదురు గుడిసెలోని ఆవిడ.

జాగిలీ సమాధానం చెప్పలేదు.

"మొగుడొస్తానన్నాడేంటే? " హాస్యమాడింది.

మామూలుగా అయితే మాటకి మాట అంటిస్తుంది. కాని ఎందుకనో ఆ సమయంలో మాట్లాడాలనిపించలేదు జాగిలీకి. రెచ్చగొట్టినా బదులు చెప్పకపోయేసరికి విస్మయంగా చూసి లోపలికి వెళ్ళిపోయిందా స్త్రీ. ఆటంకం తొలగి పోవడంతో తిరిగి ఆలోచనలు చుట్టుముట్టాయి జాగిలీని.

సోనా కోదు గుర్తొస్తే ఆమె బుగ్గలు ఎర్రబడుతున్నాయి. తల పైన తగిలిన గాయానికి పసరు రాయడానికి వెళ్ళినప్పుడు, వెన్నెల్లో ఒడిలో తలపెట్టి పడుకుని పులిని ఎలా వేటాడింది చెబుతుంటే ఊపిరి బిగబట్టి వింది.

అప్పుడు ఇద్దరి నడుమ జరిగిన వ్యవహారం తలుపుకొచ్చి బుగ్గల్లో సిగ్గులు విరబూస్తున్నాయి.

ఎప్పుడూ కంటికి మామూలుగానే కనిపించే సోనా కోదు, తను లేకపోతే జీవితం లేదనుకునేటట్టు చేశాడు. ఆడవాళ్ళు గెడ్డలో

స్నానం చేస్తున్నప్పుడు ఎవరైనా తమని దిశ మొలతో చూసినా పట్టించుకోరు. నగ్నత్వం మనిషిలో ఓ భాగమే కానీ, ప్రత్యేకమైంది కాదనుకుంటారు కోదులు. వెన్నెల్లో ఆ నగ్నత్వాన్ని సోనా కోదు చేత్తో తడుముతుంటే సిగ్గుతో మెలి తిరిగిపోయింది. ఆరిన నెగడు లోని నిప్పు ముద్దలా తయారయింది శరీరం.

తలకి తగిలిన గాయం గుర్తు చేసినా లక్ష్యపెట్టలేదు. ఆ ఒక్క రాత్రి తనని సమూలంగా మార్చివేసింది. ఇప్పుడు సోనా కోదు వచ్చి తన చెయ్యి అందుకుని ఇంటికి తీసుకుపోతే తప్ప మనసు శాంతించదు. కోదు జాతిలో చెయ్యందుకునే విధానం పెళ్లికి పునాది. ఇందులో ఆడ పిల్ల ప్రమేయం పైకి కనిపించదు. మనసు పడినవాడు తీసుకుపోయాడంటుంది లోకం. కాని ఆడపిల్ల అంగీకారం లేకుండా తీసుకెళ్లడం జరగదని అనుకోదు.



**తుఫానుకి జంకని కోదు, అధికార్ల ఆగమనం తుఫానుకంటే తీవ్రమైనదని - అప్పుడు జరిగే నష్టం నుంచి తేరుకోవడం కష్టమని తలుస్తాడు. ఈ భావన ఈ నాటిది కాదు. తరతరాల నుండి వెన్నాడుతున్నది**

సోనా కోదు వస్తాడని, చెయ్యి పట్టుకుని తీసుకుపోతాడని చీపురుతో గుడిసె ముందు నిలుచుంది. దూరంగా వీధి చివర అతని గుడిసె కనిపిస్తోంది. అక్కడ మనుషుల అలికిడి లేదు.

గుడిసెల నుంచి బయటకొచ్చిన స్త్రీలు, గుమ్మం ముందు చీపురు పట్టుకుని నిలుచున్న జాగిలీని కాసేపు చూసి, ఆమె మనసులోని ఆలోచన కనిపెట్టినట్టు ముసిముసిగా నవ్వుకున్నారు.

అదేమీ పట్టించుకోని జాగిలీ ఆలోచిస్తోంది.

పోయిన ఏడు జతగత్తె ఒకామె చిలిశంకా గ్రామ సావోతా కొడుకు వెంట వెళ్ళిపోయింది. ఆ పెళ్ళికి పెద్దల వెనుక జాగిలీ కూడా వెళ్లింది. అక్కడ జరిగింది చూసి మనువు మీద మక్కువ కలిగింది. అయినా తొందరపడలేదు. తల్లిదండ్రులను వదిలి వేరే గ్రామపు యువకుని వెంట వెళ్లే ఆలోచన లేకపోవడంవల్ల మిన్నకుండిపోయింది.

అప్పుడే డోక్రీబేడా యువకులు సోనా కోదు, చాచిరి కోదు మీద ఆమె దృష్టి పడింది. ఇద్దరూ మంచి వారే! వారిలో ఎవరితో జత కట్టాలో తేల్చుకోలేక పోయింది. చివరికి వేట సందర్భాన్ని ఉపయోగించుకుంది.

పులిని వేటాడి గ్రామానికి కీర్తి తెచ్చాడు సోనా కోదు. మనసు పడిన పడుచుకి అంత గొప్ప కానుక ఇచ్చిన వారు కోదు జాతి చరిత్రలో లేరు. చచ్చిన పులిని, చంపిన మనిషిని చూసేందుకు సంతకి బయలు దేరినట్టు చుట్టుపక్కల గ్రామాలవారు వచ్చిపోయారు. ఫారెస్టోకి తెలిస్తే ప్రమాదమని హెచ్చరించాడు సావోతా. గోళ్ళు, చర్మం తీసేసి పులి కళేబరాన్ని తగులబెట్టారు. అప్పుడు కనిపించిన సోనా కోదు మళ్ళీ కనిపించలేదు.

కాలు నిలవక రాత్రి అతని గుడిసెకి పోయింది. సోనా కోదు తల్లి అంబలి తాగమని బలవంతం చేసింది. ఎండబెట్టిన మాంసం వండిన వాసన వస్తోంది. అది తన ప్రియుడు వేటాడిన జంతువు మాంసమని గ్రహించింది. సోనా కోదు తల్లితో కబుర్లు చెబుతూ ఉండిపోయింది. అయినా అతగాడు రాలేదు. ముసల్ది కొడుకు గురించి చెప్పలేదు.

ఆలోచనల్లో పడి పరధ్యాన్నంగా వాకిలి ఊడ్చకుండా ఊడుస్తున్నట్టు ఉన్న జాగిలీ, తన పక్కన ఎవరో నిశ్శబ్దంగా కదిలినట్టు

తోచి ఉలిక్కిపడింది. ఎడమ చేతిని మరో చెయ్యి బలంగా పట్టుకోవడంతో కుడిచేతి లోని చీపురు జారిపోయింది. చెయ్యందు కున్న మనిషిని చూసి చప్పున తల వాల్చే సింది. గ్రామం నడుమనుంచి తీసుకు పోతుంటే మరి కొంచెం తలవాల్చి అడు గులు వేసింది.

అదీ అక్కడి సంప్రదాయం.

పులి చర్మం, గోళ్ళు షావుకారుకి ఇచ్చి వస్తున్న సోనా కోదుకి గుడిసె ముందు పరి సరాలు మరచి నిలబడిన జాగిలీ కంట పడింది. చప్పున చెయ్యి అందుకుని గుడిసెకి తీసుకొచ్చాడు. ఈ విషయం అత్త గుడిసెలోకి కాలు పెట్టిన కాసేపటికి తెలిసింది జాగిలీకి.

* * *

డోక్రీబేడా గ్రామానికి మైలు దూరంలో కాలి బాటకి ఎడంగా చెట్ల మధ్య కట్టెలు పోగుచేస్తోందో స్త్రీ. కట్టెలు పోగు చేసి తొందరగా గ్రామానికి తిరిగి పోవాలని ఆశించి గబగబా ఏరుతోంది.

రేపు జాగిలీ, సోనా కోదుల పెళ్ళికి ముహూర్తం పెట్టాడు పూజారి. ఊపిరి సల పని పనుల్లో మునిగిపోయారు గ్రామస్థులు. పెళ్ళి ఉందంటే అందరికీ పనే. ఆ పనుల్లో పడితే కట్టెలు తెచ్చుకోవడం కుదరదని ఒంటరిగా వచ్చిందామె. బూడిద రంగు కుందేలు ఒకటి ఆమెని రాసుకుంటూ బాణంలా దూసుకుపోయింది. ఆ చప్పుడుకి తలెత్తి చూసిందా స్త్రీ.

అప్పుడే దూరంగా మనుషుల అలికిడి వినిపించింది. ఇతర గ్రామాల నుండి పెళ్ళికి తరలి వస్తున్న బంధువులుగా భావించి ఆసక్తిగా చూడసాగింది. నలుగురు మనుషులు ఒకరి వెంట ఒకరు జోరుగా అడుగులు వేస్తూ రావడం కనిపించింది.

చప్పున కట్టెలు మోపుగా కట్టి తలకెత్తు కుని చెట్ల వెనుక అదృశ్యమైంది. వారి కంటే ముందుగా గ్రామం చేరుకుంది.

రచ్చబండ వద్ద గ్రామస్థులతో పిచ్చాపాటి మాట్లాడుతున్నాడు సోహోతా. సోనా కోదు గుడిసె ముందు పెళ్ళి పందిరి వేస్తున్నారు కొందరు.

ఆమె సాహోతా వద్దకు గబగబా వెళ్ళి చెప్పింది.

"సాండర్స్ దొర ఒస్తున్నాడు..."

"నిజమా? " నమ్మలేనట్టు ఆశ్చర్యంగా అడిగాడు సాహోతా. సాండర్స్ పేరు వినేస రికి అక్కడున్నవారి ముఖాల్లో సంతోషం ప్రత్యక్షమయింది.

"కట్టెలేరుతూ చూసా..."

జామిరి కోదు మరి ఆలస్యం చెయ్యలేదు. అక్కడున్న వారిని వెంటపెట్టుకుని తూర్పు వైపు కాలిబాటలో ఎదురు వెళ్లాడు. కోదు లకు మల్లే పెద్ద పెద్ద అడుగులు వేస్తూ వస్తున్న సాండర్స్‌ని కలిశాడు. వారిని చూసి చిరునవ్వులు చిందించాడు దొర.

"సాహోతా బాగున్నావా? " ఆదరంగా పల కరించాడు.

వినయంగా తలూపాడు జామిరి కోదు.

"ఏమిటి బోగట్టా? "

సాండర్స్ వెనుక అడుగులు వేస్తూ గ్రామంలో జరిగిన విశేషాలు చెప్పసాగేడు జామిరి కోదు.

"మిరపకాయ టపాలు వస్తున్నాయా? "

"ఒస్తున్నాయి దొరా..."

"మీ కష్టాలు తీరే రోజు వచ్చింది. ప్రభుత్వం ఆర్డరు ఇచ్చేసింది. ఇక దాని అమలే జరగాలి..."

సాండర్స్‌ని చూస్తుంటే ఓ ఆప్తుడు వచ్చి నట్టనిపిస్తోంది వారికి. కోదుల గుండెల్లో సాండర్స్ పేరు స్థిరనివాస మేర్పరచుకుంది.

అందరూ గ్రామంలోకి వచ్చారు.

రచ్చబండ వద్ద అలసటగా కూర్చుండి పోయాడు సాండర్స్. అతని దుస్తులు చెమ టతో తడిసిపోయాయి. శ్రమ వల్ల తెల్లటి ముఖం ఎరుపు రంగు సంతరించుకుంది. సాహోతా ముంతతో అందించిన మంచి నీళ్ల తాగాడు. తన తోలు సంచి నుండి పొగాకు,

## నువ్వెందుకు వెయ్యడం?

'భీష్మ'లో ఎన్టీఆర్ బ్రహ్మాండంగా నటించారు. ఆ సినిమా రిలీజైన కొత్తల్లోనో లేక షూటింగ్ పూర్తయ్యాకో ఆయన ఒకసారి చక్రపాణిని కలిసి 'అన్నగారూ.. ఆ సిన్మాలో బ్రహ్మాండంగా నటించాను. అసలు ఆ మేకప్‌లో నన్నెవరూ గుర్తించడం లేదంటే నమ్మండి' అంటూచెప్పబోయారు. ఆయన వెంటనే 'ఏంటీ..? నిన్ను ఎవరూ గుర్తించ లేకపోయారా? అయితే ఆ సిన్మాలో నువ్వు వేయడమెందుకు? ఎవరేసినా సరిపోతుంది కదా? ' అన్నారట అర్థోక్తిగా.




మిఠాయి పొట్లం తీసి సాహోతాకిచ్చాడు.

"గ్రామంలో అందరికీ పంచు.."

సాండర్స్ అభిమానానికి చలించిపోయాడు జామిరి కోదు. కోదు జాతి పట్ల ప్రేమ, అభిమానం ప్రదర్శించిన మనుషులు అతనికి తెలిసినంత వరకూ లేదు. రాబోయే కాలంలో తారసపడతారో లేదో తెలియదు. ప్రస్తుతం కళ్ళ ముందు ఓ వ్యక్తి ఉన్నాడు. ఎందుకనో భోరున విలపించాలనే కోరిక కలిగింది జామిరికోదుకు. బలవంతంగా నిగ్రహించుకున్నాడు. అయినా గుండెల్లోని భావాలు వెల్లడిస్తున్నట్లు కళ్ళు చెమర్చాయి.

ఆ రాత్రి గ్రామస్థులందర్నీ సమావేశపర్చాడు సాండర్స్.

"మీకో శుభవార్త చెప్పాలని వచ్చాను"

కాగడాల వెలుగులో తమ కోసం వనదేవత పంపిన మనిషిలా కనిపిస్తున్న సాండర్స్ దొరవైపు అంతా ఆసక్తిగా చూశారు.

"ఇక నుంచి మీరు డోలీలు మొయ్యాల్సిన అవసరం లేదు"

"అదెలా కుదురుతుంది దొరా? " వెంటనే అడిగాడు సాహోతా.

"డోలీ కట్టడం, కట్టించుకోవడం నేరమని ప్రభుత్వం అర్డరేసింది"

"పారెస్టి వాళ్ళు ఊరుకోరు దొరా! డోలీ కట్టమంటే మా వీపులు చీరేస్తారు. పారస్టీకి కోపం లావు" సాహోతా అన్నాడు.

"పారస్టీ వాళ్ళే కాదు, మరెవర్కికైనా సరే డోలీ కట్టకూడదు" స్థిరంగా బదులిచ్చాడు సాండర్స్.

అతను చెబుతున్న విషయం ఒక పట్టాన జీర్ణం కాలేదు వారికి. డోలీ మొయ్యడం తప్పనీ, దానిని అడ్డుకోవచ్చుననీ లీలగానైనా ఎప్పుడూ అనుకోలేదు. అందుచేత మతిపోయినట్లు తెల్ల ముఖాలు వేసుకుని చూశారు.

డోలీ విధానం గురించి వివరంగా ప్రభుత్వానికి నివేదించి స్వయంగా వెళ్ళి దగ్గరుండి ఆర్డరు తెచ్చిన వాడు సాండర్సేనని గ్రహించే పరిణతి వాళ్లలోలేదు.

"ప్రతీ గ్రామంలో రచ్చబండ వద్ద ఆర్డరు కాగితం నమూనా అంటిస్తాను. సంతలో డోలీ విధానం రద్దయిన సంగతి చాటింపు వేయిస్తాను. ఎవరైనా మిమ్మల్ని డోలీ కట్టమని అడిగితే ఆర్డరు కాగితం చూపించండి" చెప్పాడు.

ఆ రాత్రి చాలాసేపు అక్కడ సమావేశం జరిగింది. గ్రామస్థులు వెల్లడించిన సందేహాలకు ఓపిగ్గా జవాబులు చెప్పాడు సాండర్స్. వాళ్లకి అన్ని వేళలా తన సహాయం ఉంటుందనీ, అధైర్యపడొద్దనీ నూరిపోశాడు. అయినా కూడా వారు సంతృప్తి చెందలేదని గ్రహించాడు.

సాహోతా బలవంతం మీద జాగిలీ సోనా

కోడుల పెళ్ళికి ఉండిపోయాడు సాండర్స్. వాళ్ళ వివాహ వేడుకని ఆసక్తిగా గమనించాడు. మేరీని చర్చిలో పెళ్ళి చేసుకున్న నాటి సంఘటన గుర్తొచ్చిందతనికి. వధువు మోము లోని తాజాదనం, కళ్ళల్లో లీలగా కదలాడే సిగ్గు, ఒక ఇంటి దాన్ని అవుతున్నాననే సంతోషం కలగలిసిపోయి కనిపిస్తున్నాయి. కొండల్లోని వార్కైనా నగరాలలో జీవించే నాగరీకులకైనా ఆ భావన ఒక్కటేనని గ్రహించి ఆశ్చర్యపడ్డాడు.

అదే భగవంతుని సృష్టిలోని మర్మం.

పెళ్ళయిపోయిన తరువాత డోక్రీబేడా నుంచి బయలుదేరడానికి ముందు సావోతాని పిలిచాడు సాండర్స్. కొన్ని కవర్లు, కాగితాలు ఇచ్చి చెప్పాడు.

"మీ మీద ఎవరైనా దౌర్జన్యం చేస్తే కాగితం మీద రెండు అడ్డగీతల గుర్తు, డోలీ కట్టమని బలవంతం పెడితే సున్నా గుర్తు వేసి కవరులో పెట్టి పోలీసు ఠాణాలో ఇవ్వండి"

గుర్తులు ఎలా వెయ్యాలో చూపించాడు.

కవర్ల మీద గ్రామం పేరు ఆంగ్ల భాషలో రాసుందనీ అలాంటి కవర్లు మరికొన్ని గ్రామాలకు కూడా అతడిచ్చాడనీ సావోతాకి తెలియదు.

సాండర్స్ వెనుక గ్రామస్థులందరూ ఊరు చివరి వరకూ వెళ్ళి సాగనంపారు.

## 17



సావోతా భయపడిన దుర్దినం రానే వచ్చింది.

మధ్యాహ్నం ఎండ తీవ్రంగా కాస్తోంది. చెట్ల కింద గుడెసెల్లోను కాలక్షేపం చేస్తున్నారు డోక్రీబేడా గ్రామస్థులు. నాలుగైదు సార్లు వేటకి వెళ్ళి రావడం వల్ల ఆ సరదా కూడా తీరిపోయింది వాళ్లకి. కుర్రకారు పనిలేక సంతకి పోయి వస్తున్నారు. చుట్టం చూపుకి ఇతర గ్రామాలు పోయారు కొందరు. పూజారి తొలకరి కబురు చెప్పేవరకూ పనిలేక పోవడంతో గ్రామం నిశ్శబ్దంగాను, నిస్తేజంగాను ఉంది.

సరిగ్గా ఆ సమయంలో కొన్ని డోలీలు గ్రామంలోకి వచ్చాయి.

రెండు రోజుల క్రితం మిరపకాయ టపా తెచ్చాడో వ్యక్తి. అతడికి ప్రభుత్వ ఆర్డరు గురించి చెప్పి డోలీలు మోసుకురావడానికి మనుషుల్ని పంపడం కుదరదని తెగేసి చెప్పేడు సావోతా. అందువల్ల చిలిశంకా వారితో డోలీలు కట్టించుకుని డోక్రీబేడాకి గార్డుల్ని తీసుకుని వచ్చాడు ఫారెస్టీ

"సావోతా నంజి కొడుకేడీ? " డోలీ దిగిన వెంటనే అరిచాడు. దూరం నుంచే ఆ వాలకం చూసి ప్రమాదం శంకించాడు సావోతా. అయినా చెయ్యగలిగిందేమీ లేదు కాబట్టి గబగబావచ్చాడు.

"దణ్ణాలు మారాజా" అన్నాడు.

"ఏరా! మిరపకాయ టపా ఖాతరీ చెయ్యవా? కళ్ళు నెత్తిమీదకొచ్చాయా? " గర్జించాడు ఫారెస్టీ. అతని ముఖం కోపంతో ఎరుపెక్కింది. భారీ కాయం ఆవేశంతో ఊగిపోతోంది.

"డోలీ కట్టకూడదని ఆర్డరేశారంట"

"ఎవఁడ్రా నీకు సెప్పాడు? "

"సాండర్స్ దొర"

"ఆడెవఁడ్రా సెప్పడానికి? ఈ అరణ్యానికి అధికారిని నేను. నా మాటే మీరు వినాలి. ఇక్కడ సాండర్స్, గీండర్స్ జాంతానై."

సావోతా అయోమయంగా చూశాడు.

రచ్చబండ వద్ద చెట్టుకి గుచ్చిన ఆర్డరు కాగితం పరుగున పట్టుకొచ్చి చూపించాడో యువకుడు. దానిని లాక్కుని చదవకుండానే ముక్కలుగా చించేశాడు ఫారెస్టీ. రక్తప్రసరణ అధికమై అతని




## నన్ను పెళ్లాడరూ... ప్లీజ్!

'ధనం మూలం ఇదం జగత్' అంటారు. కానీ డబ్బుతోనే అన్నీ పొందలేం. ఈ వాస్తవం తెలుసుకున్న ఒక లాయర్ ఉసూరంటూ అదే విషయాన్ని చాటుతున్నాడు. అంతే కాదు, ఈ వాస్తవం మరో వాస్తవాన్ని కూడా వెల్లడిచేసింది- ఈ ప్రపంచంలోకెల్లా అనాకారినని అంటూ తెగవాపోతున్నాడు అతగాడు. క్రోషియాకు చెందిన ఎమిల్‌కాసిక్ అనే ఆ లాయర్‌ను పెళ్లాడడానికి దాదాపు ఐదు వేల మంది తిరస్కరించారట. ఎంత డబ్బుంటే మాత్రం ఏం లాభం. అది ప్రేమను కొనిస్తుందా? అందునా నా లాంటి ముఖం ఉన్నప్పుడు అది అసాధ్యమే సుమా అంటూ అతగాడు తెగ నిట్టూర్చేస్తున్నాడు. తనకున్న సంపద గురించి చాటుకుంటూ 'పెళ్లాడడానికో అందమైన మగువ కావలెను' అని ఆ లాయర్ గారు ఎన్ని మార్లు పత్రికలలో ప్రకటనలిచ్చినా అతడి భార్య కావడానికి ఒక్క మగువ ముందుకు రాలేదట. వీధుల్లో కలిసే అనేక మంది అమ్మాయిల్ని తనను పెళ్ళి చేసుకోమని ప్రాధేయపడుతున్నా పోవోయ్ అంటున్నారట. ఎన్ని రకాలుగా ఇవ్వొచ్చో అన్ని రకాల ప్రకటనలూ ఇచ్చాడు పత్రికల్లో. ఆ ప్రకటనల ద్వారా తనను కలిసిన ప్రతి మహిళ తనను ఛీ పో అనడంతో ఈ ప్రపంచంలోని అనాకారుల్లో కెల్లా అనాకారిననే నమ్మకం ఏర్పడిపోయిందని అతగాడు ఒక ఇంటర్వ్యూలో గుడ్లనీరుకుక్కుకున్నాడు. అయినా ఇంకా ఆశ చావలేదని, తన వైఫల్యాల గురించిన ప్రచారమైనా తనను అక్కున చేర్చుకునే ప్రేమ మూర్తిని ప్రసాదిస్తుందేమో చూద్దాం అంటూ ఆ ఆశావాది అనాకారి వధువు వేట కొనసాగించి తీరతానంటున్నాడు.

## మరో ప్రపంచం కోసం...



'మరో ప్రపంచం, మరో ప్రపంచం' అంటూ హింసా ద్వేషాలు లేని శాంతి, సుస్థిరత, సౌభ్రాతృత్వం విలసిల్లే ప్రపంచ నిర్మాణం కోసం ఆరాటపడేవారెందరో. దీనికోసం కొందరు పాదయాత్రలు చేస్తారు. ఇంకొందరు యజ్ఞయాగాదులు నిర్వహిస్తారు. జార్జిబుష్‌గారి లాంటి వాళ్లు శాంతి స్థాపన కోసం రక్తపాతం తప్పదంటూ ఏకంగా యుద్ధాలే చేస్తారు. వీరందరికీ విరుద్ధంగా వినూత్న కార్యాలతో రికార్డు సృష్టిస్తారు మరికొందరు. అలాంటి వారిలో యోగమతి జపాకి అనే జపనీస్ మహిళ ఒకరు. ఆమె 15 అడుగుల లోతున్న

ఆరాటపడేవారెందరో. దీనికోసం కొందరు పాదయాత్రలు చేస్తారు. ఇంకొందరు యజ్ఞయాగాదులు నిర్వహిస్తారు. జార్జిబుష్‌గారి లాంటి వాళ్లు శాంతి స్థాపన కోసం రక్తపాతం తప్పదంటూ ఏకంగా యుద్ధాలే చేస్తారు. వీరందరికీ విరుద్ధంగా వినూత్న కార్యాలతో రికార్డు సృష్టిస్తారు మరికొందరు. అలాంటి వారిలో యోగమతి జపాకి అనే జపనీస్ మహిళ ఒకరు. ఆమె 15 అడుగుల లోతున్న

## వేషము మార్చెను...

వేషము మార్చితి, మగువను కాపాడితినంటూ ఆ రష్యన్ రక్షక భటాధికారి తెగ సంబరపడిపోతున్నాడు. ఇంతకీ సంగతేమిటంటే రష్యన్ నగరం యల్వానొవ్‌స్క్‌లో ఒక మహిళా యువ పారిశ్రామికవేత్తపై ఒక ముఠా దాడిచేయడానికి పూనుకుందనే టిప్ పోలీసులకు అందింది. ఆ ముఠా చాలా పేరు మోసింది కావడంతో వాళ్లను ఎదుర్కొనే కార్యాన్ని పోలీస్ చీఫ్ ఇగోర్ సెలెదీ అనే మగ అధికారికి అప్పగించాడు. ఆ అధికారి స్థానికంగా ఉన్న థియేటర్ వారి నుంచి విగ్గు, మేకప్ సామాగ్రి అరువు తెచ్చుకుని ఆడవేషం కట్టాడు. దుండగులకు ఏ మాత్రం అనుమానం రాకుండా నున్నగా ఆడ ముఖంతో కనిపించడానికి నానా తంటాలు పడ్డాడు. నైటీ కూడా ధరించి ఎంచక్కా ఆ వేషంలో ఒదిగిపోయాడు. అర్ధరాత్రి దాటాక దుండగ ముఠా వచ్చి తలుపు కొట్టింది. అసలు అతివకు బదులు కొసరు అతివ తలుపు తీయగానే ఇద్దరు ముసుగు మనుషులు డబ్బివ్వమంటూ బెదిరించారు. సెలెన్‌దెవ్ తనను చంపొద్దని ప్రాధేయపడుతున్నట్లు స్వరం మార్చి కొద్దిసేపు నాటకమాడాడు. ఆ తర్వాత ఒడుపు చూసుకుని వాళ్లని నిరాయుధుల్ని చేసి కాళ్లు చేతులకు సంకెళ్లు బిగించేశాడు. పక్క రూంలో దాగి ఉన్న సహచరులు అతడికి సహాయపడదామని వచ్చేసరికే దుండగలు సంకెళ్లతో స్పృహతప్పి ఉండడం చూసి హమ్మయ్య అని ఊపిరి పీల్చుకున్నారు.






## ప్రాణంమీదకు తెచ్చిన పెంకెతనం

మనిషిని కుక్కకరిస్తే వార్త కాదు. కుక్కని మనిషి కరవడమే వార్త అనేది జర్నలిజం బోధనా సూత్రాలలో ఒకటి. అలాంటి వార్తావిశేషాలు అడపాదడపా జరుగుతూనే ఉంటాయి. అయితే ఇప్పుడు దాన్ని కాస్త తిరగేసి మనిషి తుపాకీ పేల్చడం వార్త కాదు. కుక్క తుపాకీ పేల్చడమే అసలు వార్త అని చెప్పుకోవాలి మరి ఈ సంఘటన వింటే. వాసిల్ ప్లోవ్‌దివ్ (35)అనే ఆసామి బల్గేరియాకు చెందిన వేటగాడు. అతగాడికి జర్మన్ పాయింటర్ జాతికి చెందిన పెంపుడు కుక్క ఉంది. అతగాడు వేటాడిన పక్షిని ఆ కుక్కగారు అమాంతంగా నోట కరచుకుని విడచిపెట్టడానికి ససేమిరా అంది. పెంపుడు కుక్కకి ఇంత పెంకితనమా అని ప్లోవ్‌దివ్‌కు బోలెడు కోపం వచ్చేసిదానికి బుద్ధి చెప్పాలనుకుని చేతిలో ఉన్న తుపాకీని తిప్పి మడమతో ఒక్కటిచ్చుకున్నాడు. 'ఔరా నీ కింతటి పొగరా' అనుకుందో ఏమో గానీ నోట కరచుకున్న పిట్టను వదలిపెట్టకుండానే యజమానిపై తిరగబడింది. అలా తిరగబడడంతో దాని ముందు కాళ్లు ట్రిగ్గర్‌పై పడి గట్టిగానొక్కాయి. ఇంకేముంది తుపాకీ పేలింది! ప్లోవ్‌దివ్ నేల కొరిగాడు. అయితే ఆయన గారు అదృష్టవంతుడే. ఛాతీలో గాయమైనా ప్రాణాలు పోలేదు. స్థానిక ఆసుపత్రిలో చికిత్స పొందుతూ పెంకితనమున్న పెంపుడు కుక్క జోలికి పోవడం నాదే బుద్ధితక్కువ అని వాపోతున్నాడు.



దొరలు వచ్చినప్పుడు లేడి మాంసం, దుప్పి మాంసం కావాలి. దొరసానికి పుట్టతేనె, నెమలి పిట్టలు తెచ్చివ్వాలి. అడవి మనుషులకి భయం అనేది లేకుండా పోతే కందులు, కొండ చీపుర్లు తేవడం కుదరదు

ముఖం కందిపోయింది. ఆనాలోచితంగా చేతిలోని కర్రతో సావోతాని కొట్టాడు.

ఇద్దరు గ్రామస్థులు అడ్డువెళ్ళారు ఫారస్టీకి.

"నా మీద తిరగబడతారా నంజికొడుకుల్లారా" అంటూ మరింత ఆవేశపడి వెనుక ముందు చూడకుండా కొట్టడం ప్రారంభించాడు.

గార్డులు కర్రలు అందిపుచ్చుకుని దొరికిన వాడిని దొరికినట్టు విచక్షణారహితంగా కొడుతున్నారు. క్షణక్షణానికి వారి ఆవేశం పెరిగిపోతుంటే గ్రామస్థులు చెల్లాచెదురయ్యారు. కొందరు అడవి వైపు పారిపోయారు. చిలిశంకా నుండి డోలీలు మోసుకొచ్చిన వాళ్ళు కూడా వారిలో ఉన్నారు.

ఫారెస్టు వాళ్ళకి అలుపొచ్చేవరకు సాగిందా కార్యక్రమం. ఆడవాళ్ళు, పిల్లలు చెట్ల వెనుక దాక్కున్నారు. కొంతమంది దెబ్బలు తిన్న మగవాళ్ళు మాత్రం ఫారాస్టీ ముందు మిగిలారు. శరీరానికి తగిలిన దెబ్బల వల్ల బాధ, ఏం జరుగుతుందోననే ఆదుర్దాతో కూడిన భయం వారి ముఖాల్లో చోటుచేసుకుంది.

మతిపోయిన వాడిలా నిలుచున్నాడు సావోతా.

"నిలబడ్డారేం, ఫారాస్టీకి పాకెయ్యండి" ఓ గార్డు అరిచాడు.

నెమ్మదిగా అక్కడ నుంచి కదిలారు గ్రామస్థులు. ఇద్దరు చెట్లు నరికి కలప మోసుకొచ్చారు. ఎత్తైన జాగాలో పాక వేసే పని మొదలయింది. చెట్టు కింద కూర్చున్న ఫారాస్టీకి జీలుగు కల్లు ముంత అందించాడో గార్డు. ఆ కల్లు తాగి మూతి తుడుచుకుని సిగరెట్ ముట్టించి గ్రామాన్ని పరికించి చూశాడతను. కుక్కలు, పందులు తప్ప గ్రామంలో మనుషులు సంచరించడం లేదు.

ప్రభుత్వం డోలీ విధానం రద్దుచేసిందని ఫారాస్టీకి తెలుసు. ఆ ఆర్డరు అమలు జరిగితే తమకి ఎన్ని కష్టాలు ప్రాప్తిస్తాయో అర్థం చేసుకున్నాడు. ముఖ్యంగా తను అడవిలోకి కాలు పెట్టలేడు. అదే జరిగితే కోదుల్లో భయం లేకుండా పోతుంది. ఎక్కడో అడవిలో ఆర్డరు అమలు జరగడం లేదని ప్రభుత్వానికి తెలియకుండా జాగ్రత్తపడాలి. అదే ఆలోచనతో బయలుదేరాడు. కానీ గ్రామాలకి డోలీ విధానం రద్దు గురించి ముందు తెలిసిపోయింది. ఆర్డరు కాగితం నమూనా రచ్చబండ వద్ద దర్శనమిచ్చింది.

దొరలు వచ్చినప్పుడు లేడి మాంసం, దుప్పి మాంసం కావాలి. దొరసానికి పుట్టతేనె, నెమలి పిట్టలు తెచ్చివ్వాలి. అడవి మనుషులకి భయం అనేది లేకుండా పోతే కందులు, కొండ చీపుర్లు తేవడం కుదరదు. ఆర్డరు కాగితం తీసుకుంటూ కలెక్టర్‌కి తన వాదన వినిపించాడు ఫారాస్టీ

అడవుల్లో జీవించే కోదులు సోదరులట. స్వేచ్ఛగా జీవించే హక్కు వాళ్లకి ఉందట. సాటి మనిషిని మోసుకుని వెళ్ళడం అనాగరిక చర్యట. అలా చెప్పిన కలెక్టరు ఇప్పుడేం చేస్తాడు? ఇక్కడ

సంగతులు తెలుసుకోవడానికి కలెక్టరేం దేవుడు కాదు.

ఆలోచిస్తూ మరో రెండు ముంతలు కల్లు పట్టించాడు ఫారాస్టి

ఓ పక్క కోళ్ళను చంపి ఈకలు తొలగిస్తున్నారు. ఆ కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తున్నాడు గార్డు సాహు. విసురుగా వీచిన గాలికి ఈకలన్నీ చెల్లా చెదురయ్యాయి. ఒక ఈక తిన్నగా పోయి ఫారాస్టి జుట్టులో చిక్కుకుంది. కడుపు నిండా కల్లు తాగిన అతనికి తెలియదు.

పిలకలా నిలబడిన ఈకను చూసి సాహు ఆనందిస్తున్నాడని.

* * *

రెండు రోజులు అక్కడే మకాం వేశాడు ఫారస్టీ.

డోక్రీబేడా వారికి నరకం చూపించాడు. కోదులు సాగుచేసిన భూమి రికార్డుల్లో రెండింతలు రాశాడు. చాలామంది శిస్తు చెల్లించ లేక తెల్లముఖాలు వేశారు. ఫారస్టీని శాంతింప చెయ్యడానికి శతవిధాల ప్రయత్నించాడు సావోతా. మేకపోతుని చంపి వంట చేయించాడు. అప్పటికప్పుడు చెట్టు నుంచి తీసిన జీలుగు కల్లు కడవల కొద్దీ సమర్పించాడు. ఫారస్టీ నిద్రపోతున్నప్పుడు కూడా ఇద్దర్ని ఒళ్ళు పట్టడానికి పురమాయించాడు.

అయినా కూడా అతను చలించలేదు.

పక్క గ్రామానికి మిరపకాయ టపా పంపకుండా, మూడోనాడు డోక్రీబేడా వాళ్ల డోలీలు సిద్ధం చేశారు. నిప్పుల మీద కాల్చిన అడవి కోడి మాంసం తిని, టీ తాగి ప్రయాణానికి తయారయ్యాడు ఫారస్టీ

సావోతాని దగ్గిరకి పిలిచి అన్నాడు.

"ఎవడో వచ్చి ఏదో సెపితే నమ్మకండి. మీరు సేసిన అగౌరవానికి ఎన్ని కష్టాలు పడ్డారో మరువకండి"

"సిత్తం మారాజా" సావోతా వినయంగా అన్నాడు.

"మీ జాతి మొత్తానికి ఫారస్టు వాళ్ళే దిక్కు"

"సిత్తం..."

మా పట్టణంలో పెద్దపెద్ద మేడల్లో ఉండేటోళ్ళం... మాకు ఈ కారడివిలో తిరిగే ఖర్మ పట్టింది. మీ పైన జాలితో సూసీసూడనట్టు పోతున్నాను. నా డూటీ సక్రమంగా సేస్తే మీకిక్కడ బతుకుండదు. అడవి నరికి వ్యవసాయం సేసినందుకు, జంతువుల్ని సంపి తినేస్తున్నందుకు మీ అందర్నీ జైలుకి పంపాలి. కాని అమాయకులని, మంచివాళ్ళని, సెప్పిన పని సేస్తారని ఒగ్గేస్తున్నా"

"సిత్తం..."

"సాండర్స్ దొర మిమ్మల్ని ఉద్ధరించడానికొచ్చినోడు కాదు. ఆడికి అడవిలో బతికేటోళ్ల కష్టాలు తెలవదు. మాయమాటలు సెప్పి పోతాడు. ఆ మాటలు వింటే మీ బతుకులు సెడిపోతాయి"

"సిత్తం..."

"డోక్రీబేడా సావోతా నిఖార్సైన వాడని అన్ని గ్రామాల్లో సెపుతున్నా. కానీ నీకు ఈ మద్దిన పోయే కాలం ఒచ్చింది. ఇక నుంచై

సాండర్స్
దొర మిమ్మల్ని
ఉద్ధరించడాని
కొచ్చినోడు కాదు.
ఆడికి అడవిలో
బతికేటోళ్ల
కష్టాలు తెలవదు.
మాయమాటలు
సెప్పి పోతాడు.
ఆ మాటలు
వింటే మీ
బతుకులు
సెడిపోతాయి

నా ఒళ్ళు దగ్గిరెట్టుకుని మసులు"

మాట్లాడలేదు సావోతా, తల మాత్రం ఊపాడు.

"సెబాస్... తప్పు గ్రహించేశావు. నీ నడక సరిదిద్దుకుని గ్రామం వాళ్ళకి సర్ది చెప్పు, ఫారాస్ట్ మన పాలిటి దేవుడని. అందుకే శిస్తు కట్టకపోయినా జాలి దలచి వదిలిపోయాడని" చెప్పి డోలీలో కూర్చున్నా డతను.

కోదు యువకులు డోలీలు ఎత్తుకున్నారు. ముందుగా ఫారాస్ట్ డోలీ కదిలితే వెనుక మిగతావి అనుసరించాయి.

చివరగా ఫారాస్ట్‌కి నమస్కారం చేసి డోలీలు మలుపు తిరిగి అదృశ్యమయ్యే వరకూ చూసి రచ్చబండ వద్దకు వచ్చాడు సావోతా. అప్పటి వరకూ జరిగిన వ్యవహారం పదే పదే గుర్తొచ్చి బాధిస్తోందతణ్ణి. గ్రామస్థులు రచ్చబండ చుట్టూ మౌనంగా, విచారంగా కూర్చున్నారు. తుపాన్ వచ్చినా, పులి మనుషుల్ని ఎత్తుకు పోతోందని తెలిసినా జంకకుండా జీవిస్తారు. అలాంటి వారి బతుకుల్ని అధికారులు చిందరవందర చేసి పోతున్నారు.

పులి చంపిన మనిషి శరీరం చుట్టూ కూర్చుని విచారిస్తున్నట్టుంది అక్కడి వాతావరణం.

సరిగ్గా అప్పుడే ఒగురుస్తూ వచ్చాడో యువకుడు. చాలా దూరం వెళ్ళి వచ్చినట్టు చెమటలు కారుతున్నాయి.

"సావోతా! ఇచ్చేశాను" చెప్పాడతను.

కష్టకాలంలో ఓదార్పు లభించినట్టు సావోతా ముఖం తేటపడింది. అతను తల పంకించి చుట్టూ కూర్చున్న గ్రామస్థులతో అన్నాడు.

"ఇప్పుడేటి జరుగుద్దో సూడాలి"

* * *

డోలీలు దట్టమైన అడవిలోకి ప్రవేశించాయి.

కాల్చిన కోడి మాంసం కడుపు నిండా తినడంవల్ల కునుకు పట్టింది ఫారాస్ట్‌కి. సిబ్బంది తక్కువ తినలేదు కాదు కాబట్టి, ఉయ్యాల మాదిరి లయబద్ధంగా కదులుతున్న డోలీల్లో ఉన్న వాళ్లకి కూడా నిద్ర ముంచుకొచ్చింది.

ఆ డోలీలు మోస్తున్న కోదు యువకులు పళ్ళ బిగువున శ్రమ భరిస్తూ అడుగులు వేస్తున్నారు. ఒక మనిషిని మోసుకు వెళ్లడానికి ఇద్దరు అవసరమవుతారు. ఆ ఇద్దరి కష్టం ఒక్కరు భరించడంలో తప్పేముందని వాళ్లు ప్రశ్నించుకోలేదు. డోలీలో కూర్చుని ఎవరో జోకొడుతున్నట్టు నిద్ర పోతున్న భారీ కాయుల అమ్మలక్కల్ని తిట్టడం లేదు. గ్రామాలు తిరిగి అమాయకుల్ని బెదిరించి ఉచితంగా వచ్చిన కల్లు తాగి, కోళ్ళు మేసి శరీరాలు పెంచారని గొణగడం లేదు.

అదంతా ఖర్మని, భరించక తప్పదని మాత్రమే అనుకుంటున్నారు.

ఎగుడు దిగుడు నేలలో, పాదం మోపడానికి అనువు కాని బాటలో డోలీలు ఒకదాని వెంట ఒకటి అలుపు తెలియనట్టు వెళుతున్నాయి. ఫారాస్ట్‌కి మెలుకువ వచ్చి ఆగమనే వరకూ ఆ ప్రయాణం సాగాల్సిందే.

అప్పటికప్పుడు చెట్లనుంచి సేకరించిన కలపతో తయారు చేసి, ఒత్తుగా ఆకులు పరవడం వల్ల మెత్తగా ఉంది. లోపల కూర్చున్న వాళ్ళా ఏమాత్రం శ్రమ తెలియడం లేదు. వాటిని మోస్తున్న యువకులు మాత్రం ఆయాసంతో ఒగురుస్తున్నారు.

అవతలి గ్రామం చేరక ముందే ఓ మలుపులో తారసపడ్డాడు సాండర్స్. అతని వెనుక నలుగురు సిబ్బంది మామూలు దుస్తుల్లో ఉన్నారు. కోదు యువకులు డోలీలు దించి పక్కకి తప్పుకున్నారు. డోలీ ఆగిన కొన్ని నిముషాలకు కళ్ళు తెరిచాడు ఫారాస్ట్. ఎదురుగా కనిపించిన మనిషిని అయోమయంగా చూశాడు.

"ఎవర్నువ్వు? " అడిగాడు.

"నువ్వెవరు?" ఎదురు అడిగాడు సాండర్స్. అప్పటికే కోపంతో అతని ముఖం జేవురించింది.

ఫారస్టీ డోలీ నుంచి బయటకొచ్చి చేతులు నడుముపైన పెట్టుకుని ఠీవిగా నిలుచున్నాడు. అతని నరనరాన నిర్లక్ష్యం తొణికిసలాడుతోంది.

కోదు యువకులు ఊపిరి బిగపట్టి చూస్తున్నారు.

డోలీ పక్కన నిలుచున్న సాహు నిటారుగా అయ్యాడు. అంతకు ముందే పోలీసు సూపర్నెంట్ సాండర్స్ దొరని చూసి ఉండటం వల్ల పొంచి ఉన్న ప్రమాదాన్ని గుర్తించాడు. చప్పున ఫారస్టీని సమీపించి చెవి వద్ద తనకి తెలిసిన విషయం నెమ్మదిగా చెప్పబోయాడు. ఆ మాటలు గొంతు దాటక ముందే ఫారస్టీ అహంకారపూరిత స్వరం ఖంగుమంది.

"నన్నే ప్రశ్నిస్తావా?"

"నువ్వు ఆకాశం నుంచి ఊడి పడిన వాడివా ప్రశ్నించకుండా ఉండటానికి?"

చెళ్ళున కొరడా దెబ్బ తిన్నట్టు చూశాడు ఫారాస్టీ.

"నేను ఫారాస్టీని" చెప్పాడు.

"అయితే... డోలీ ఉపయోగించడం నేరమని నీకు తెలియదా?"

"డోలీలో కాకపోతే వాళ్ళ భుజాల మీదెక్కి పోతాను. అడగడానికి నువ్వెవరు?"

అడవికి తను అధికారినని, తనకి ఎదురు చెప్పేవాళ్లు అడవిలో తిరగకూడదని అనుకుంటాడతను. ఆ భావనలో కొంత వాస్తవం ఉంది. కాని ఎదురుగా ఉన్నది నిప్పులాంటి పోలీసు అధికారి.

"డోంటాక్..." అరిచి, పిస్తోలు తీసి ఫారాస్టికి గురిపెట్టాడు సాండర్స్.

".... ఎక్కువగా వాగితే పిట్టని కాల్చినట్టు కాల్చి పారేస్తాను. నీ ముందున్న మనిషి పోలీసు అధికారి సాండర్స్ అని గ్రహించి ఒళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు. తల తిరుగుతుంటే చెప్పు, పైత్యం వదిలించేస్తాను"

పేరు వినడమే తప్ప ఎప్పుడూ



చూడని ఆ వ్యక్తి తన ముందు ఉన్నాడని గ్రహించి మతిపోయింది ఫారాస్టీకి. పులిలా కనిపిస్తున్నా సాండర్స్‌ని చూస్తుంటే కాళ్లల్లో సన్నటి వణుకు మొదలయింది. జీవితంలో పుట్టి బుద్ధెరిగాక కలగని భయం నరన రాన్ని ఆక్రమించుకుంది. అంతటి భారీ కాయం కూడా అడవి జ్వరం సోకినట్టు వణికిపోసాగింది.

రెండు పులులు ఒకదానికొకటి ఎదురుపడినప్పుడు, మధ్యలో చిక్కుకుపోయిన లేడి పిల్లలా వుంది డోలీలు మోసుకొచ్చిన కోదుల పరిస్థితి. సగం చచ్చిన వారిలా ఓ పక్క ఒదిగి నిలుచున్నారు. వారి గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి.

"నీ లాంటి పనికిరాని అధికారులు ప్రజల్ని పీడించి ప్రభుత్వ పాలనకి మచ్చ తెస్తున్నారు. ప్రభుత్వ ఆర్డరు ఖాతరు చెయ్యని నిన్ను క్షమించకూడదు. పై అధికారులతో మాట్లాడి ఈ ఉద్యోగం పీకించి వేస్తాను. అప్పుడు కళ్ళు తెరిచి సాటి మనిషి పశువు కాదని తెలుసుకుంటావు"

భయంతో పిల్లిలా అయిపోయాడు ఫారాస్టీ.

"ఈ ఒక్క తప్పు మన్నించు దొరా! ఇంకో మారు ఇలా జరక్కుండా సూసుకుంటాను. మావోళ్లు డోలీలు కట్టించుకోకుండా కట్టడిచేస్తాను" దీనంగా అన్నాడతను.

అతనికి తెలుసు, దొర తల్చుకుంటే తన నౌకరీ ఊడిపోతుందని. బ్రిటిష్ వారితో గొడవలు పెట్టుకోవడం, కొరివితో తల గోక్కోవడం ఒక్కటే. ప్రభుత్వ ఉత్తర్వు నిర్లక్ష్యం చేస్తే క్షమాపణ ఉండదు. తనని అడిగే వాడు లేడన్న భరోసాతో కోదుల పట్ల దురుసుగా ప్రవర్తించాడు. ఇప్పుడు తగ్గి ఉండకపోతే తోక తెగిపోతుంది.

"మొలకి కట్టుకున్న గుడ్డముక్క మురికి పట్టి చిరిగిపోయింది. డొక్కలు తిండిలేక ఎండిపోయాయి. చదువు, సంస్కారం లేని ఈ నిరుపేదల దీనస్థితి నీకు కనిపించ లేదా? " కోదుల్ని చూపించి అడిగాడు సాండర్స్.

చేతులు నలుపుకుంటూ జవాబు తోచని వాడిలా ఉండిపోయాడు ఫారాస్టీ. అధికారం, అహంకారం ఇప్పుడు మచ్చుకైనా కనిపించడంలేదు.

"వాళ్లు సంతలో చింతపండు అమ్మి ఆ డబ్బుతో కొనుక్కొచ్చిన సన్న బియ్యం, బలిసిన కోడిపెట్టలు తిని శరీరాన్ని పెంచావు. బుద్ధి మాత్రం పెంచుకోలేదు. గిరిజనుల బతుకులు చూసి జాలిపడి సహాయం చెయ్యాల్సింది పోయి మీదెక్కి స్వారీ చేస్తున్నావు.

మరోసారి ఇలాంటిది జరిగినట్టు తెలిస్తే ఈ సారి నిజంగానే కాల్చిపారేస్తాను" కటువుగా హెచ్చరించాడు.

సాండర్స్‌కి సెల్యూట్ చేసి పిల్లిలా అక్కడ నుంచి కదిలాడు ఫారాస్టీ. డోలీ కర్రలకు వేలాడగట్టిన కోళ్లు అరుస్తూనే ఉన్నాయి. కందుల మూటలు, అరటి గెలలు, తేనె నింపిన సీసాలు తమతో తీసుకెళ్ళే ధైర్యం లేక సిబ్బంది ఫారాస్టీని అనుసరించారు.



## 18

చీకటి చిన్నగా ఉంది.

అంతా శాంతంగా, సుఖంగా ఉండాలనే ఓ పాట గాలిలో తేలుతూ, ఆకుల్ని స్పృశిస్తూ చెట్ల సందుల నుండి మెలితిరిగి సాగిపోతోంది. అది ఆడ గొంతో, మగ గొంతో పోల్చుకోవడం కష్టం. సన్నటి తీగల పైన స్వరాలు మీటినట్టు ఆర్ద్రంగా చీకటి

రాత్రి గాలిలో తేలిపోతోంది.

ఆకాశాన్ని, అడవిని కలిపేసింది చీకటి. రెండు కొండల నడుమ ఉన్న డోక్రీబేడా గ్రామంలో మాత్రం చీకటి లేదు.

ఆరోజు కోదుజాతి కనీవినీ ఎరుగని చిత్రం జరిగింది. ఫారెస్టీ వెళుతున్న డోలీలకు సాండర్స్ దొర అడ్డం పడ్డాడు. తమని పీడించి, అదిలించి రూపాయలు గుంజే ఏనుగులాంటి ఫారెస్టీ ఎలుక పిల్లలా తలొంచుకుని వెళ్ళిపోయాడు. కోదులు డోలీలు తీసుకుని తిరిగొచ్చేశారు. తమ జాతి మరెప్పుడూ డోలీలు మోయాల్సిన అవసరం లేదు.

పిల్లలు, పెద్దలు అంతా గుడిసెల నుంచి బయటకొచ్చి సాండర్స్‌ని చూసి పెద్దపెట్టున అరిచారు. సంతోషం పట్టలేక కల్లుకుండలు, సారాయి కుండలు తెచ్చి వీధి మధ్యలో పెట్టారు. వీధి పొడవునా రెండు పక్కల కర్రలు పాతి వాటికి ఆముదం పట్టించిన కాగడాలు కట్టి ముట్టించారు. ఆ ప్రయత్నాలు కనిపెట్టి గాలి జోరుగా వీచడం మానుకుంది. ఫలితంగా గ్రామం వెలుగుతో నిండిపోయింది.

ఆడ, మొగ, తేడా లేకుండా అందరూ కల్లు, సారాయి తాగారు. లేవలేని ముసలి వాళ్ళు సైతం గుడిసెల బయట కూర్చుని తమ ఆమోదం తెలియజేస్తున్నారు. అలాంటి సందడి గ్రామంలో వనదేవత పండుగనాడు మాత్రమే కనిపిస్తుంది.

చెట్టు కింద కూర్చుని ఆ హడావిడి తిలకిస్తున్నాడు సాండర్స్. అతని వెంట వచ్చిన సిబ్బంది గుంపులో కలిసిపోయారు. తన సిబ్బంది కోదులతో కలిసి తాగుతున్నారని తెలిసినా తెలియనట్టు, అసలు వారు తన పక్క నుంచి అదృశ్యమైన విషయం గమనించనట్టు ఉండిపోయాడతను.

గ్రామస్థుల సంతోషం చూస్తుంటే గుండెల నుంచి కొండంత బరువు దిగిపోయినట్టుంది సాండర్స్‌కి. పోలీసు ఠాణా నుండి కవరు రాత్రి చేరింది. తెల్లవారుజామున బయలుదేరాడు. అభ్యంతరం తెలియజేసిన భార్య మేరీకి నచ్చచెప్పివచ్చాడు. ఫారెస్టీని గట్టిగా మందలించాడు కాబట్టి మరెప్పుడూ డోలీ కట్టించుకోడు. ఈ విధానం పూర్తిగా రద్దు కావడానికి మరికొంత కాలం పడుతుంది. తల పంకించి సందడి వైపు దృష్టి సారించాడు.




పెళ్లి కాని పడుచులు, యువకులు రెండు గుంపులుగా విడిపోయారు. మిగతా వాళ్లు చుట్టూ చేరి ఉషారు చేస్తున్నారు. యువకుల గుంపు పాట అందుకుంది. పడుచులు దానికి దీటుగా పాడుతూ నాట్యం ప్రారంభించారు.

చుట్టూ అలుముకున్న చీకటిలో కాగడాల వెలుగు గుడిసెల మధ్య జాగాని స్పష్టంగా చూపెడుతోంది. పేద, గొప్ప తారతమ్యాలు తెలియవక్కడ. కల్మషం లేని కష్ట జీవులు వాళ్ళు. ఉత్తుంగ తరంగంలా ఎగసి పడుతున్న సంతోషానికి నిషా తోడయింది. అవధులు లేని ఆనందంతో నాట్యం సాగుతోంది.

వారు పాడుతున్న పాటని ఎవరు కూర్చారో తెలియదు. ఏ తరంలోనో ఓ కవి పుట్టి ఆ పాట కట్టి వుండాలి. చేతులు పట్టుకుని లయబద్ధంగా నాట్యం సాగుతోంది. ఆ నాట్యం ఎవరు నేర్పించారో చెప్పడం అసాధ్యం. ఎన్నో తరాలు కాలగర్భంలో

కలిసి పోయాయి. పుట్టి గిట్టిన జంతువుకి చరిత్ర లేనట్టే కోదులకు కూడా లేదు.

వారి కష్టసుఖాల గురించి పట్టించుకున్న మనిషి ఒక్కడే! ఆ ఒక్కడినే తమ జాతి మనిషిగా కోదు గోష్టి భావించి పండుగ జరుపుతోంది.

ఆ అడవిలో రాత్రి పూట ఓ పాట గాలిలో తేలుతుంటే అడ విని కడుపులో దాచుకున్న సువి శాల దేశంలో జరుగుతున్న స్వరాజ్య ఉద్యమం చివరి దశకు చేరుకుంది.



* * *

ఎప్పటిలానే ఆ రోజు కూడా తెల్లవారింది.

కాని భూమిని ముద్దాడిన తొలి సూర్యకిరణానికి మాత్రం ఆ రోజు ఓ ప్రత్యేకత ఉంది. భారతదేశ సమగ్ర చరిత్ర గ్రంథస్థం చేసినప్పుడు ఆ సూర్యోదయాన్ని సువర్ణాక్షరా లతో లిఖించాలి.

మునిపల్లె గ్రామంలో మూడు వందలకు మించి లేవు ఇళ్లు. నాలుగు ప్రధాన వీధుల్లో గ్రామం మొత్తం విస్త రించుకుని వుంది. గ్రామం నలువైపులా పచ్చటి వరి పొలాలున్నాయి. ఊరు మధ్య రామాలయం, ఊరి చివర చర్చి ఆ గ్రామా నికి నిండుదనం చేకూర్చాయి. జిల్లాలో ఆ పల్లె విసిరేసినట్టు దూరంగా ఉంటుంది.

గ్రామస్థుల ప్రధాన వృత్తి వ్యవసాయం కనుక వాళ్లు సూర్యుడు ఉదయించక ముందే పొలాలకు బయలుదేరతారు. ఆ రోజు మాత్రం పనులన్నీ కట్టిపెట్టారు. అందరూ బావులకు, చెరువుకి పోయి స్నానాలు చేశారు. వాళ్ల ముఖాల్లో ఆనందో త్సాహాలు వెల్లి విరుస్తున్నాయి. కుల మతా లకు అతీతంగా వాళ్లందర్నీ సంతోషపరిచిన విషయం సామాన్యమైందేమీ కాదు.

వీధులు శుభ్రంచేసి, ఇళ్ల ముందు ముగ్గులు పెట్టారు ఆడవాళ్లు. గ్రామానికి ఎడమ వైపు మైదానం వంటి ప్రదేశం ఒకటుంది. అక్కడ పందిరి వేసి, వేదిక తయారు చేశారు ఊళ్లో కుర్రకారు. రంగురంగుల కాగి తాలతో, రకరకాల పూలతో పందిరినంతా అలంకరించారు. వేదికకి రెండు వైపులా గాంధీ, నెహ్రూ, తిలక్ ఇంకొందరు జాతీయ నాయకుల చిత్రపటాలు వేలాడ దీశారు.



పది మంది కుర్రాళ్లని వెంటేసుకుని హడావిడిగా పనులు చేసుకుపోతున్నాడు రామయ్య. వీధుల్లో వెదురు కర్రలు పాతి మామిడాకుల తోరణాలు కట్టడం పూర్తయింది. పెద్దలు, పిల్లలు మంచి దుస్తులు వేసుకుని పెళ్లికెళుతున్న వారిలా తయారయ్యారు. ముసలి వాళ్లు కూడా వయసు మరిచిపోయి కుర్రాళ్ల లాగా ఆ హడావిడిలో భాగమైపోయారు.

వీధుల అలంకరణనంతా ఓ సారి పరికించి తృప్తిగా తల ఊపాడు రామయ్య. అతడి స్నేహితులు కొంతమంది క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకి వెళ్ళొచ్చారు. వాళ్లని చూసినప్పుడు అతని

ముఖం చిన్న బోయేది. అనారోగ్యం వల్ల ఆ ఉద్యమంలో తను పాలుపంచుకోలేక పోయాడు. జైల్లోని మిత్రుల్ని పరామర్శించి రావడానికి వెళ్లినప్పుడే గ్రామానికి వచ్చాడు సాండర్స్.

నిజానికి సాండర్స్ తనని విడిపించడం నచ్చలేదతనికి. బ్రిటిష్ వాళ్ల మీద ద్వేషం పెంచుకోవడం వల్ల తల్లి చేసిన పనికి బాధ పడ్డాడు. మాతృమూర్తి అభ్యర్థన తోసి పుచ్చ లేకే సాండర్స్‌ని తీసుకెళ్లి రైలు ఎక్కించాడు. ఆ తరువాత అతని గురించి ఎన్నడూ ఆలోచించలేదతను.

కాని సాండర్స్ తనని చూడడానికి వచ్చాడని తల్లి చెప్పినప్పుడు ఆశ్చర్యపోయాడు. ఆ రాత్రి తన కోసం చాలా సేపు వేచి ఉన్నాడని, తమ కుటుంబం మేలుకోసం ప్రార్థన చేశాడని తెలిసి ఆ విదేశీయుడి నిష్కల్మష హృదయానికి కదిలిపోయాడు. వ్యక్తి ప్రవర్తనని బట్టి ప్రేమించడం లేదా ద్వేషించడం చెయ్యాలని అప్పుడే తెలుసుకున్నాడు. అతడు విదేశీయుడు కావచ్చు, కాని ఆ లక్షణాలు మచ్చుకైనా కనిపించని ఆ మనిషిని ద్వేషించడం సరి కాదనుకున్నాడు.

కొడుకు మెడలో వేలాడుతున్న శిలువ అతని అపరాధాన్ని వేలెత్తి చూపుతోంది.

ఒక మూల వయసు మీరిన ఆడవాళ్ళ మధ్య నిలుచున్న రామయ్యతల్లికి ఒక్క క్షణం అర్థం కాలేదు. అర్థమయ్యాక కలలో కూడా ఊహించని ఆ గౌరవానికి ఉక్కిరి బిక్కిరయింది

ఆలోచిస్తూనే మిత్రులతో కలిసి మైదానం చేరుకున్నాడు రామయ్య. పనులన్నీ సవ్యంగా పూర్తయ్యాయని అనుకున్న తరుణంలో అక్కడ మంచినీళ్ళు ఉంచలేదని తట్టింది. వెంటనే కుండలతో నీళ్లు తెప్పించి ఓ పక్కన పెట్టించాడు.

అక్కడకి గ్రామం మొత్తం తరలివచ్చింది. కాసేపట్లో గ్రామపెద్ద వాళ్ళని ఉద్దేశించి మాట్లాడాడు. స్వాతంత్ర్య పోరాటంలోని ముఖ్య ఘట్టాల గురించి చెబుతూ ఉద్వేగభరితంగా సాగిన ఆ ప్రసంగానికి ప్రజలంతా చప్పట్లతో హర్షం తెలిపారు. అందరూ ఛాతీలు ఎత్తి గర్వంగా నిలుచున్నారు. కళ కళలాడుతున్న మోములు సూర్యకాంతిలో దర్శనమిస్తున్నాయి.

"...... ఈ రోజు ఇక్కడ కంది సోమయ్య భార్య మహాలక్ష్మి జండా ఆవిష్కరిస్తారు" ఉపన్యాసం ముగించి చివరిగా అన్నాడు గ్రామ పెద్ద.

అది ఊహకందని సంగతి అయినట్టు కొన్ని క్షణాలు నిశ్శబ్దం. అందరి కళ్ళ ముందు ఆరడుగుల అజానుబాహు విగ్రహం సోమయ్య సాక్షాత్కరించాడు. ఓ పక్కనుంచి ఎవరో చప్పట్లు చరిచారు. మరుక్షణం అక్కడ కరతాళ ధ్వనులు మారుమోగాయి.

ఒక మూల వయసు మీరిన ఆడవాళ్ళ మధ్య నిలుచున్న రామయ్య తల్లికి ఒక్క క్షణం అర్థం కాలేదు. అర్థమయ్యాక కలలో కూడా ఊహించని ఆ గౌరవానికి ఉక్కిరి బిక్కిరయింది. ఇద్దరు ఆడవాళ్ళు ఆమెని సాదరంగా పట్టుకుని జండా వేదిక దగ్గరకు తీసుకు వచ్చారు. వణుకుతున్న చేతులతో జారుముడి విప్పి, సహాయకుడు చెప్పినట్లు చేసి తాడు లాగిందామె.

ఒక్కసారిగా రెక్కలు విప్పుకుంది మువ్వన్నెల జండా. చిరుజల్లు మాదిరి పూరేకులు జల జలా రాలాయి.

అందరూ తలెత్తి చూశారు.

"వందే మాతరం..." గొంతు గొంతు

కలిసి పాడింది.

రామయ్య కళ్ళు తుడుచుకున్నాడు. తండ్రి గుర్తు రావడంతో, సోమయ్య లాంటి వాళ్లెందరో కలలు గన్న స్వరాజ్యాన్ని ఇన్నేళ్ళకి భారతీయులు సాధించుకున్నారు. లాఠీ దెబ్బలు తిని, బూట్ల నాడాల పైశాచిక పదును రుచి చూసి, తూటాలకు గుండెలు ఎదురొడ్డిన ప్రజలకు అర్ధరాత్రి వచ్చిన ఆ స్వాతంత్ర్యం విలువ తెలుసు.

రెండు వందల సంవత్సరాల బ్రిటిష్ పాలనకి చరమగీతం పాడుతూ ఆ రోజు భరతభూమిని తాకిన మొదటి సూర్య కిరణం అపురూపమైంది.

## 19



డోక్రీబేడా గ్రామానికి దిగువున ఉంది ఆ గెడ్డ.

అదెక్కడనుంచి వస్తోందో, ఎక్కడ అంతమవుతుందో కోదులకు తెలియదు. ఉత్తరం వైపు కొండల నుండి వాళ్ళ గ్రామం మీదగా సాగిపోతుంది. ఎన్నో కోదు గ్రామాలు ఆ గెడ్డ మీద ఆధారపడి ఉన్నాయి. వేసవిలో ఓ మాసం పాటు ఆ గెడ్డలో నీళ్ళు ప్రవహించవు. అప్పుడు నీటి కోసం డోక్రీబేడా గ్రామస్థులు చాలా ఇబ్బందులు పడతారు. గెడ్డ వెంట అన్వేషించుకుంటూ వెళ్ళి తడిగా ఉన్నచోట లోతుగా గుంటలు తవ్వి నీళ్ళు సంపాదించుకుంటారు.

ఒకనాడు పదిమంది ఖాకీలాగులు వేసుకున్న మనుషులు ఆ గెడ్డ వెంబడి దేనికోసమో వెదుకుతూ డోక్రీబేడా దాటి వెళ్ళారు. కొండ మలుపులో, అడవి చిన్నగా ఉన్నచోట ఒకతను ముక్కు ఎగపీల్చి ఉత్సాహంగా అరిచాడు.

"ఇక్కడే ఉంటుంది, వెదకండి..."

ఆ పదిమంది తలో దిక్కు చెదిరిపోయారు. తుప్పల్ని, దట్టమైన పొదల్ని, కొండ రాళ్ళని గాలించడం మొదలు పెట్టారు. ఆ పనిలో అనుభవమున్నట్టు చకచకా కదులుతున్నారు. కొంత సమయం గడిచాక మరోడు అందరికీ వినిపించేటట్టు చెప్పాడు.

"ఇదిగో ఇక్కడుంది..."

కొండరాయి వెనుక అంచు వరకూ మండని పాతి దానిపైన ఆకులు కప్పడం వల్ల జాగ్రత్తగా చూస్తే తప్ప కనిపించదు. ఆకులు తీసి మూత తొలగించారు. ముక్కుపుటాలను బద్దలు చేస్తూ వెలువడింది ఘాటైన పుల్లటి వాసన. ఆ ప్రాంతంలో రాళ్ళ వెనుక మరి కొన్ని కుండలు కనిపించాయి.

జంతువు జాడ పసిగట్టిన వేట కుక్కల్లా వాళ్ళకి చురుకుదనం వచ్చింది.

"ఇదిగో పొయ్యి..." ఎవరో అరిచారు.

అందరూ అక్కడకి వెళ్ళారు. మూడు రాళ్ళ మధ్య పుల్లలు కాల్చిన బూడిద ఉంది. అంతే కాదు, ఆ బూడిద అడుగున నిప్పుంది. అంటే రాత్రి అక్కడ సారా తయారుచేసి ఉండాలి. చుట్టుపక్కల మరింత క్షుణ్ణంగా వెదికారు. పొదల్లో దాచిన వెదురు గొట్టం, పెద్ద కుండ, దానితోపాటు చిన్న కుండ ఒకటి బయటకు తెచ్చారు.

సారా తయారు చెయ్యాలంటే నీటి వసతి కావాలి. అందుచేత సారా బట్టీలు గెడ్డ పక్కన పెడతారు.

"దగ్గర్లో ఎవడైనా ఉన్నాడేమో చూడండి..." ఒకడు అన్నాడు.

గెడ్డ ఒడ్డున పొలంలో పని చేసుకుంటున్న శల్పుకోదు వారికి కనిపించాడు. అతణ్ణి పట్టుకుని చేతులు వెనక్కి విరిచి కట్టేశారు. అతనేదో చెబుతున్నా పట్టించుకోకుండా బట్టీ సామానుతో పాటు గ్రామం

లోకి తీసుకుపోయారు.

అప్పటికి మధ్యాహ్నమయింది.

శల్పుకోదు గుడిసె గాలించారు. సారా కాని, బెల్లంకాని కనిపించ లేదు. మట్టి పాత్రలు పట్టి పట్టి వాసన చూశారు.

కోదులకు సారా తాగడం ముఖ్యమైన అలవాటు. తమకి అవస రమైన సారాని దొంగచాటుగా తయారు చేసుకుంటారు. అది వ్యాపారం కోసం కాకపోయినా ఆబ్కారీ వాళ్ళు పట్టుకోవడానికి వస్తూ ఉంటారు. నిజానికి వాళ్ళు కనుగొన్న సారా బట్టీతో శల్పు కోదుకి ఎలాంటి సంబంధం లేదు.

అదే మాట చెప్పాడు సావోతా జామిరి కోదు.

"అయితే బట్టీ ఎవరిదో చెప్పు? " అడిగారు.

జామిరికోదు సమాధానం చెప్పలేదు.

గ్రామంలోని ప్రజలు అందరూ ఒక్కటే అతనికి. అందుచేత సారా తయారు చేసిన మనిషి పేరు చెప్పలేక పోయాడు. అలాంటి సమ స్యలు వచ్చినప్పుడు కష్ట నష్టాలు గ్రామంలోని వాళ్ళంతా సమానంగా భరిస్తారు. ఎందుకంటే సారా ఇద్దరో- ముగ్గురో తయారు చేసినా గ్రామం యావత్తూ తాగుతుంది.

ఆ మనిషి వివరాలు సావోతా చెప్పడని అబ్కారీ వాళ్లకి కూడా తెలుసు. అంతేకాదు, ఆ బట్టీ శల్పుకోదుది కాదని కూడా తెలుసు. సారా వండిన వాడి చేతులు పరిశీలిస్తే తరుచు పుల్లటి ద్రవం తగ లడం వల్ల చేతి గోళ్ళు చింత పిక్క రంగులో ఉంటాయి. శల్పుకోదు గోళ్ళు తెల్లగా ఉన్నాయి. వచ్చిన పని పూర్తి కావాలంటే దొరికిన మనిషిని వదలకూడదు. అందుకే తరచుగా అనుసరించే పద్ధతే అక్కడ కూడా అమలు చేశారు.

"ఇతణ్ణి ఖైదులో పెట్టేస్తాం..." చెప్పాడు ఒకతను.

"మీ దయమీద బతికేటోళ్ళం... ఆడిని ఒగ్గేయండి బాబూ!" సావోతా ప్రాధేయపడ్డాడు.

"మీరు కంతిరీ నాయాళ్ళు... సారా కాచి సంతకి పట్టుకుపోయి అమ్మేస్తారు. ప్రజలు ఆ సారా తాగి సెడిపోతారు. అది సూసి అధి కారులు సేతకాని నా కొడుకుల్లారా అని తిట్టి పోస్తారు. మీరు మాత్రం ఒగ్గేయండి బాబూ అంటారు"

"మేం సారా అమ్ముకునేటోళ్ళం కాదు పెభో... ఈ తప్పు కాయండి".

"మరి సంతకి సారా ఎట్టా ఒచ్చింది? "

ఏం చెబుతాడు సావోతా?

మాటలు ఓ కొలిక్కి రాకపోవడంతో ఆ పదిమంది గ్రామంలో ఉండిపోయారు. అప్పటికి చీకటి పడిపోయింది. శల్పుకోదు చేతులకి కట్టిన తీగలు విప్పి ఓ పక్క కూర్చోబెట్టారు. చర్చలు మొదలయ్యాయి. శల్పుకోదుని వదలడానికి వంద రూపాయలు, పది కోళ్ళు అడిగారు.

**చింతపండు, కొండ చీపుర్లు సంతలో అమ్మి ఆ డబ్బుతో సరుకులు తెచ్చు కుని జీవించే దీనస్థితి వాళ్లది. వంద రూపాయల కాగితం చూసిన వాళ్లెవ్వరూ గ్రామంలో లేరు**

చింతపండు, కొండ చీపుర్లు సంతలో అమ్మి ఆ డబ్బుతో సరుకులు తెచ్చుకుని జీవించే దీన స్థితి వాళ్లది. వంద రూపాయల కాగితం చూసిన వాళ్లెవ్వరూ గ్రామంలో లేరు. అంతా కలిసి ఇరవై రూపాయలు పోగు చేసినా వాళ్లు తీసుకోలేదు.

గ్రామంలో ఎవరి దగ్గరా ఒక్క రూపాయీ మిగల్లేదు. దిక్కు తోచని స్థితిలో పడిపోయాడు సావోతా. కోళ్ళు, చింతపండు, తేనె ఇవ్వజూపినా వాళ్ళు పట్టిన పట్టు విడవలేదు. ఆ సమస్య ఎలా పరిష్కరించాలో అర్థం కాలేదతనికి. చాటుగా ఓ ముంత సారా తాగి పడుకున్నాడు. సమస్య తీవ్రంగా ఉన్నప్పుడు సారా కూడా నిద్ర తెప్పించలేదని మొదటిసారి బోధపడింది.

మరునాడు శల్పుకోదుని తీసుకుని బయలుదేరారు వాళ్ళు. సావోతా మరోసారి ప్రాధేయపడి భంగపడ్డాడు. నిరాశ, నిస్పృహలు గ్రామంలో అలుముకున్నాయి. శల్పుకోదుని పట్టుకున్న విషయం తెలిసిన క్షణంలోనే బట్టీ పెట్టిన మనిషి అడవిలోకి పారిపోయాడు. అతను గ్రామంలో ఉన్నా ఎవరూ అప్పగించరు. అయినా భయంతో పరిగెత్తాడతను.

శల్పుకోదు భార్యా పిల్లల రోదనలు గుండెని ముక్కలు చేస్తున్నాయి.

సావోతా దృష్టి పదే పదే కాలిబాట వైపు కదులుతోంది. కబురు అందుకున్న సాండర్స్ దొర ఆ బాటలోనే వస్తాడు. తమ కష్టం తెలుసుకుని సహాయపడతాడు. డోక్రీ బేడా మనిషిని తీసుకెళుతుంటే చూస్తూ ఊరుకోడు. అలా పరిపరివిధాల ఆలోచిస్తుండగానే ఆ దినం గడిచిపోయింది.

మరునాడు సూర్యుడు నడి నెత్తికి వచ్చినప్పుడు శల్పుకోదు ఆ బాటలో గ్రామం వచ్చాడు. అందరూ చుట్టుముట్టారతణ్ణి.

శల్పుకోదుని తీసుకుపోయిన ఆబ్కారీ వాళ్ళు చిలిశంకా గ్రామంలో బస చేశారు. ఉదయం షావుకారు ఒకతను ఆ గ్రామం వచ్చాడు. అబ్కారీ వాళ్లతో మాట్లాడి యాభై రూపాయలు ఇచ్చి శల్పుకోదుని విడిపించాడు. ఆ డబ్బుకి బదులుగా మూడు సంవత్సరాల పంట ఇవ్వాలని షరతు విధించాడు షావుకారు.

కోదులు నిరుపేదలని, వాళ్ళ వద్ద డబ్బు ఉండదని ఆబ్కారీ వాళ్లకి తెలుసు. అందుకని చిలిశంకా గ్రామం వెళ్ళి షావుకారుకి కబురు పంపారు. ఈ వ్యవహారం అమాయకులైన కోదులకి తెలియదు. సాయం చేసిన వాళ్ళకి ప్రాణం తీసి ఇస్తారు కోదులు. ఆ

## పిసినిగొట్టువి అనుకుంటారేమో?




ఎన్టీఆర్ తన సొంత బ్యానర్‌మీద తీసిన 'దాన వీర శూర కర్ణ'లో కృష్ణ, కర్ణ, దుర్యోధన పాత్రలు ధరించారు. ఆ సినిమా తీసేటప్పుడు ఆప్తులు కనుక చక్రపాణి దగ్గరకువెళ్లి త్రిపాత్రాభినయం గురించి చెప్పారట. అంతే కాదు.. దర్శకత్వమూ తనదే అన్నారట.

ఆయన కొద్దిసేపు ఆలోచించి, 'చూడు రామారావ్.. నువ్వు కృష్ణుడైనా .. కర్ణుడైనా.. దుర్యోధనుడైనా బాగానే చేస్తావులే కానీ జనమే మరీ పిసినిగొట్టువి అనుకుంటారేమో ఓసారి ఆలోచించు' అన్నారట సాలోచనగా.

లక్షణాన్ని తమకి అనుకూలంగా ఉపయోగించుకుంటారు వ్యాపారులు. ఇప్పుడి శల్పుకోదు పండించిన పంట, అడవి నుంచి సేకరించిన విప్పపువ్వు- చింతపండు షావుకారుకి ఇవ్వాలి. వాటికి ఖరీదు కట్టి బాకీ కింద జమ చేసుకుంటాడతను.

భారంగా నిట్టూర్చాడు సాహోతా.

సాండర్స్ వస్తాడని ఎదురు చూస్తున్నాడతను. కవరు తీసుకెళ్ళిన మనిషి గ్రామానికి తిరిగొచ్చి రెండు దినాలయింది. రోజులు ఒకదాని వెంట ఒకటి వెళ్ళిపోతున్నాయి.

సాండర్స్ దొర జాడ లేదు.

* * *

**భూ**మిని వెన్నెల స్నానం చేయిస్తున్నాడు చంద్రుడు.

ఆ వెన్నెల్లో ఒక ఓడ సముద్రం పైన సాగిపోతోంది. రిక్రియేషన్ రూములో చాలామంది బ్రిటిష్ వాళ్ళు కూర్చుని ఉన్నారు. కొందరు మద్యం సేవిస్తుంటే, మరికొందరు కబుర్లు చెప్పుకుంటున్నారు. సంగీతం లయబద్ధంగా వినవస్తోంది. కొన్ని జంటలు సంగీతానికి అనుగుణంగా నృత్యం చేస్తున్నాయి.

అక్కడున్న వాళ్లంతా భారత దేశంలో వివిధ పదవుల్లో పని చేసిన ప్రసిద్ధ వ్యక్తులు. వాళ్ళు తిరిగి తమ దేశానికి వెళ్ళిపోతున్నారు. ఎవరిలోనూ చింత అంతగా కనిపించడం లేదు. ఒకరి అనుభవాలు మరొకరికి చెప్పుకుని పెద్దగా నవ్వుకుంటున్నారు.

వాళ్ళందరికీ భిన్నంగా ఏదో కోల్పోయినట్టు ఓడ రైయిలింగు వద్ద నిలుచుని అదృశ్యమైన తీరం వైపు చూస్తున్నాడు సాండర్స్. విసురుగా వీస్తున్న చలిగాలి అతణ్ణి అక్కడి నుంచి కదిలించలేక పోతోంది. రేపు ఎపుడో కనుమరుగయినా దృష్టి మాత్రం అటే వుంది. అతని వదనాన్ని విచారం అలుముకుని ఉంది.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అంతవరకూ అక్కడ అధికారం చెలాయించిన బ్రిటిష్ వాళ్ళని తమ దేశానికి తిరిగి వెళ్ళమని ఆదేశాలు వచ్చాయి. కొందరు అక్కడ ఉండాలనుకున్నా వీలు కాలేదు. ఉన్న పళంగా బయలుదేరాల్సివచ్చింది సాండర్స్.

తోలుసంచి ఒకటి పట్టుకుని, పనివాడు చిన్న పెట్టెతో అనుసరిస్తుండగా ఓడ ఎక్కాడు సాండర్స్. భార్య అంతకుముందే అక్కడ నుంచి వెళ్ళిపోయింది. అప్పటికే ఓడలో ఉన్నవాళ్ళు, ఓ సాధారణ వ్యక్తిలా వస్తున్న అతణ్ణి ఆశ్చర్యంగా చూశారు.

తీసుకెళ్లడానికి సాధ్యంకానివి ఎన్నో వది లేసినా మిగతావాళ్లు తెచ్చుకున్న సామాన్లు తక్కువేం కాదు. అందుకే ఆశ్చర్యం కలిగింది వాళ్లకి. ఏమీ లేకుండా వస్తున్న అతణ్ణి చూసి.

సాండర్స్ పెట్టెలో దుస్తులు, చిన్నచిన్న జ్ఞాపికలు, భార్యకోసం తీసుకున్న కాశ్మీరీ సిల్కు చీర తప్ప విలువైనవి మరేం లేవు. ఒకటి రెండు తరాలకు సరిపడే సంపద కూడ గట్టుకున్న వాళ్లకి ఆ మనిషి పిచ్చివాడిలా కనిపించవచ్చు. కాని అతడు మరపు రాని ఎన్నో జ్ఞాపకాలతో ఓ మానవునిలా తన దేశం వెళుతున్నందుకు తృప్తిపడుతున్నాడు.

కాగితం చుట్టిన వస్తువొకటి దుస్తుల మధ్య భద్రంగా దాచుకున్నాడు. సోనాకోదు చంపిన పులిగోరు అది. సాహోతా ఆ గోరు దాచి ప్రేమగా ఇచ్చాడు. దానిని చూసినప్పుడల్లా డొక్రీబేడా గ్రామం గుర్తొస్తోంది.

కోదులకు మరెంతో చెయ్యాలని ఆశించాడు. వారికి నాగరికత చెప్పాలని, అక్షర జ్ఞానం కలిగించాలని, మూఢనమ్మకాల నుండి అభ్యుదయం వైపు దృష్టి సారించే ఆలోచన పుట్టించాలని అభిలషించాడు. కాని ప్రభువు సమయం లేకుండా చేశాడు. స్వాతంత్ర్య పోరాట చివరి రోజుల్లో ఎటూ వెళ్లడానికి అవకాశం చిక్కలేదు. నాలుగు దినాలు సమయం దొరికితే ఆ గిరిపుత్రుల్ని

పలకరించి వచ్చేవాడు.

ఇప్పుడు దేశాన్ని వదిలి వెళుతున్నా మనసు ఆ కోదు గ్రామంలో చిక్కు పడిపోయింది. కొన్ని వందల మైళ్ళ దూరంలోని ఆ ప్రదేశం మరెప్పుడూ చూడలేననే భావమే మనసుకి భారంగా వుంది.

అందుకే అక్కడ నిలుచుని ఆ దిక్కు చూస్తున్నాడు.

అతన్ని ఓడ లాక్కుపోతోంది.

## 20



డోక్రీబేడా సావోతా జామిరికోదు ఎనభయ్యేళ్ల వాడయ్యాడు.

ఇప్పుడతని కళ్లు పరిసరాలని, మనుషుల ఆకారాలని గుర్తుపట్టడం మానేశాయి. కాళ్లల్లో సత్తువ పూర్తిగా సన్నగిల్లకపోయినా చూపు మందగించి తిరగలేకపోతున్నాడు. అదృష్టవశాత్తూ వినికిడి మాత్రం తగ్గలేదు.

కోదు సమాజ రీతిని అనుసరించి ఒకనాడు గ్రామస్థుల సమక్షంలో రచ్చబండ వద్ద తన బాధ్యతలు కొడుక్కి అప్పగించాడు. ప్రత్యక్షంగా గ్రామ వ్యవహారాల్లో తల దూర్చడం లేదు. అయినా సమావేశం జరిగినప్పుడల్లా అతన్ని తీసుకొచ్చి కూర్చోబెడుతున్నారు. సమస్యలు వివరించి సలహాలు అడుగుతున్నారు.

అతని ఈడు కలిగిన మనుషులు గ్రామంలో లేరు.

తెల్లవారాక అంబలి తాగిన జామిరికోదుని రచ్చబండ పైన కూర్చోబెట్టి తన పనులపై వెళతాడు కొడుకు. చాలా ఏళ్లబట్టి బాటవైపు చూసే అలవాటు వల్ల కళ్లు కనిపించకపోయినా ముఖం అటే తిప్పి ఉంచుతాడా వృద్ధుడు. అక్కడ కూర్చుని తేనెతుట్టెలా కదిలే జ్ఞాపకాల్ని నెమరు వేసుకుంటాడు. అప్పుడు ఎన్నో సంఘటనలు తలుపుకొస్తాయి.

జీవితాన్ని సంపూర్ణంగా అనుభవించిన ఆ వృద్ధ కోదుని గ్రామం యావత్తూ ప్రేమిస్తుంది. మంచి చెడులు బేరీజు వెయ్యగల అతడి అనుభవాన్ని ఎంతో వినయంగా గౌరవిస్తుంది.

అతడు గొంతు విప్పి ఒక్క మాట చెబితే అదక్కడ శిలాశాసనమే!

పెద్దలంతా పనులకు పోయినప్పుడు పిల్లలు అతని చుట్టూ చేరతారు. గొంతుని బట్టి పిల్లవాడిని గుర్తుపట్టి పేరుతో పిలుస్తాడతను. మాటలు రాని పసివాళ్ల శరీరాలు ఆప్యాయంగా నిమిరి వారి తల్లెవరో, తండ్రెవరో కనుక్కునే ప్రయత్నం చేస్తాడు. నిండు జీవితం అతనికి కొంత శక్తిని ప్రసాదించింది.

జామిరికోదు వెంట తోకలా సంచరించే పెంపుడు కుక్క చాలా ఏళ్ల క్రితమే చచ్చిపోయింది. ఆరోజున ఓ ఆప్తుణ్ణి కోల్పోయినట్టు దుఃఖించాడతను. తిరిగి మనిషి కావడానికి చాలా రోజులు పట్టింది. ఈ సంగతి నిన్నమొన్న జరిగినట్టు అతడి బుర్రలో సజీవంగా నిలిచిపోయింది. మరో కుక్క ఇంటికొచ్చినా అది జామిరికోదు కొడుకు వెంట మాత్రమే తిరుగుతుంది. దానికి తెలుసు, ఆ ముదుసలి ఎక్కువకాలం బతకడని.

జామిరి కోదుకి కూడా ఆ విషయం అవగతమైంది.

బాల్యం, యవ్వనం, కౌమారం దాటి వృద్ధుడయ్యాడు. జీవితంలో ప్రతి దశ స్పష్టంగా జ్ఞాపకముందతనికి. బాల్యంలో జతకట్టి ఆడుకున్న వాళ్లు ఇతర గ్రామాల పడుచులను తెచ్చుకుని పెళ్లిళ్లు చేసుకున్నారు.

ఒకణ్ణి పులి ఎత్తుకుపోయింది. వాడి పెళ్ళాం పుట్టింటికి పోయి మరొకణ్ణి మనువాడింది. ఆమెకి పిల్లలు పుట్టి ఎదిగారు.

ఒకసారి ఆ గ్రామం వెళ్లినప్పుడు ఆమెని పరామర్శించాడు జామిరికోదు. ఆమె నలుగురు పిల్లలు ఒకే పోలికతో ఉండటం చూసి ఆశ్చర్యపడ్డాడు. తన జతగాడి బిడ్డని చూడాలనే కోరికతో వారిలో మొదటి భర్తకి పుట్టిన వాడిని చూపించమని అడిగాడు.

ఆమె చిన్నగా నవ్వి, నిండుకుండలా చూసింది.

"సావోతా! నాకు తెలవదు" చెప్పింది.

ఒళ్లు జలదరించింది జామిరికోదుకి. ప్రేమగా చూశాడు ఆమెని.

"మురిసిపోయాను" గొంతుకి ఏదో అడ్డం పడ్డట్టు గొణిగింది తిరిగి.

మొగుడు ఎవరైతేనేం వాళ్లంతా తన బిడ్డలని తెలియజెప్పిన ఆ మాతృమూర్తి సంస్కారానికి మనసులో నమస్కరించకుండా ఉండలేకపోయాడు. చెమర్చిన కళ్లతో నిండు నూరేళ్లు బతకమని దీవించి వచ్చేశాడు.

ఇంకొకడు పిల్లలు లేకుండాపోయాడు. మరొకడు గంపెడు పిల్లల్ని కనిపోయాడు. వాడి పిల్లలు ముసలివాళ్లుగానే పుట్టినట్టు సంతకు పోయి తిరిగి రాత్రి గ్రామానికి రాలేక అక్కడే వుండిపోయి మర్నాడు వస్తున్నారు. కాలం మనిషి పటుత్వాన్ని హరించి వేస్తుంది.

జామిరి కోదు వయసులో ఉన్నప్పుడు ఈటె పట్టుకుని గ్రామం మధ్య నుంచి నడిచిపోతుంటే పడుచులు దొంగతనంగా చూసేవారు. పండుగల్లో అతనితో నాట్యం చెయ్యడానికి పోటీ పడేవారు. ఒకరిద్దరితో చనువుగా ఉన్నా విచ్చలవిడిగా సంచరించడాన్ని ఇష్టపడేవాడు కాదు. తాత సరుబు సావోతా చనిపోయినప్పుడు, అతని నిర్జీవ దేహం చూడడానికి



గ్రామాల నుండి తరలి వచ్చిన జనం ఎప్పుడూ కళ్ళముందు కదలాడే వాళ్లు.

తను తప్పు చేస్తే వంశాన్ని దూషిస్తారనే జ్ఞానం ఉన్న మనిషి.

సాహోతా పదవి వంశపారంపర్యంగా వస్తుంది. అయితే తాత సరుబు సాహోతాకి కొన్ని తరాల ముందు గ్రామ సాహోతా పదవి మరో కోదు కుటుంబానికి ఉండేది. తండ్రి పేరు మనవడికి పెట్టే ఆచారం వల్ల అక్కడ వ్యక్తులు మాత్రమే అంతరిస్తారు. అంటే ఇప్పుడు జామిరికోదు మనవడి పేరు సరుబుకోదు.

అప్పటి గ్రామ సాహోతా నీతి లేని మనిషి. గ్రామంలో మగవాళ్ళు లేనప్పుడు వారి పెళ్ళాల్ని పట్టుకునేవాడు. ఎవరి భూమి బాగా పండితే అది తనదేనని లాక్కునేవాడు. అక్కడ న్యాయం, ధర్మం కరువయ్యాయి. గ్రామంలోని కోదులు దిక్కుతోచని స్థితిలో ఉన్నారు.

ఒకనాడు జామిరికోదు పెళ్ళాం దుంపల కోసం అడవికెళ్లింది. సాహోతా అడవిలో ఆమెని అడ్డగించాడు. అదే సమయంలో పక్క గ్రామం వెళ్ళి వస్తున్న జామిరికోదు కంట ఆ దృశ్యం పడింది. వెంటనే సాహోతా మీద కలబడి పిడికిలితో గుండెల మీద గుద్ది నిర్దాక్షిణ్యంగా చంపేశాడు. అప్పుడు గ్రామస్థులు సంతోషించి సాహోతా పదవి జామిరి కోదుకి కట్టబెట్టారు. సాహోతా వెంట తిరిగి అరాచకాలకు పాల్పడిన వారిని గ్రామం నుంచి తరిమేశాడు జామిరికోదు.



ఇతరుల భార్యల్ని కన్నెత్తి చూడటం, మరొకడి భూమి స్వంతం చేసుకోవాలనుకోవటం తప్పు కింద జమ కట్టింది ఆ కాలంలోనే. నేటికీ కోదులు అదే ఆచరిస్తున్నారు.

ఒకనాడు తండ్రితో సంతకెళ్ళాడు జామిరి కోదు. అక్కడ ఓ పడుచుని చూసి ఆమె అందానికి మతి పోగొట్టుకున్నాడు. కొద్దిసేపు ఆమె వెంట తిరిగి పెళ్ళి కాలేదని తెలుసుకున్నాడు. అవకాశం కోసం కాచుకుని ఆ పిల్ల ఒంటరిగా చిక్కినప్పుడు చెయ్యి అందుకుని సంత నుండి మాయమయ్యాడు.

కొడుకు కోసం సంత అంతా వెదికాడు జామిరికోదు తండ్రి. కనిపించిన వారినల్లా అడిగాడు. ఫలితం లేకపోయేసరికి ఆ రాత్రి అక్కడే ఉండి, మరునాడు దిగులుగా గ్రామం తిరిగొచ్చాడు. ఇంటి వద్ద తప్పు చేసినవాడిలా తలొంచుకుని కనిపించాడు కొడుకు జామిరికోదు. ఆ తెగువని, కోడలు పిల్ల చక్కదనాన్ని మెచ్చుకోకుండా ఉండలేకపోయాడతను. వెంటనే ఆ పిల్ల గ్రామానికి కబురు పంపి పెళ్ళి జరిపించేశాడు.

ఇరవై సంవత్సరాలు కాపురం చేసి ఇద్దరు బిడ్డల్ని ఇచ్చిందా ఇల్లాలు. కూతురు అచ్చు తల్లిలా ఉండేది. గుండెల మీద వేసుకుని జోకొడితే కాని నిద్రపోయేది కాదు. ఆ పిల్ల ఎదిగి పక్క గ్రామ సాహోతా కొడుకుతో వెళ్లింది. పెద్దలతో ఆ గ్రామం వెళ్ళి కూతురు పెళ్ళి జరిపించి అంతా పోగొట్టుకున్నవాడిలా తిరిగొచ్చాడు.

డొక్కబేడాలో పండుగ జరిగితే మొగుణ్ణి, పిల్లల్ని తీసుకుని వచ్చేది. నాలుగు దినాలు ఉండి దిగులు తీర్చుకుని వెళ్ళేది. ఓనాడు కూతురు మరణవార్త గొడ్డలి పెట్టులా గుండెని తాకింది. కన్నీళ్ళు పెట్టుకోవడం పిరికితనమని తలిచే అతడు రోజుల తర బడి కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు. బిడ్డకి బదులు తననెందుకు తీసుకెళ్ళలేదని వనదేవతని నిలదీశాడు.



ఆమె పోయినప్పుడు కూడా ముఖంలో అదే చిరునవ్వు. ఆత్మీయుల మరణాలు ఎంతగానో బాధించినా పుట్టినవాడు గిట్టక తప్పదనే వివేకంతో గుండె కుదుటపరుచుకున్నాడు

భార్య వెంట గెడ్డకెళ్ళి రంగు రంగుల పూలు ఏరి దోసిలిలో పోసి ఆమె ముఖం లోని సంతోషాన్ని తన్మయత్వంగా చూసిన దృశ్యం ఎన్నడూ మరుపుకి రాదు. పసి బిడ్డని పక్కలో వేసుకుని తన వైపు సద్దు చెయ్యొద్దన్నట్టు చూసిన చూపు వెన్నాడు తూనే ఉంది. తను కోపంతో చిందులు తొక్కినప్పుడు చిరునవ్వుతో చూసేది. ఆమె పోయినప్పుడు కూడా ముఖంలో అదే చిరు నవ్వు. ఆత్మీయుల మరణాలు ఎంతగానో బాధించినా పుట్టినవాడు గిట్టక తప్పదనే వివేకంతో గుండె కుదుటపరుచుకున్నాడు.

కాని కూతురు మరణం మాత్రం జీర్ణించు కోలేక పోయాడు.

నేడు జతగాళ్ళ పిల్లలు మధ్య వయ స్కులు అయ్యారు. వారి తరాన్ని నెట్టేయడా నికి మరో తరం ఉద్భవించింది. ఆ తరం వారసులే ఇప్పుడు జామిరికోదు చుట్టూ మూగారు.

"తాతా! నా సేతిలో ఏటుందో సెప్పు.." అడిగాడు ఓ కోణంగి గుప్పెట మూసి.

జామిరికోదు బాహ్య ప్రపంచంలో పడ్డాడు. ఆ పిల్లవాడి ప్రశ్నకి జవాబు ఊహించేందుకు బుర్రకి పని చెప్పాడు.

"ఓరి భడవా! ఈ తాతకు తెల్దనుకున్నా వేటి?" నవ్వుతూ అన్నాడు.

"సెప్పు మరి..."

"నేరేడు కాయ"

ఆ ప్రశ్న అడిగిన పిల్లవాడు తెల్లబోతూ గుప్పెట తెరిచాడు. నల్లగా నిగనిగ లాడుతూ పండిన నేరేడుకాయ ఉంది. పిల్లలు అందరూ కళ్ళు కని పించని ఆ తాతని అబ్బురంగా చూశారు. వారిలో జామిరికోదు మునిమనువడు కూడా ఉన్నాడు.

గ్రామంలోని నేరేడు వృక్షాల వయసు తన వయసు కంటే ఎక్కువని, వాటిని జామిరికోదు పుట్టక ముందు తన తండ్రి దివుడు సావోతా నాటాడని పిల్లలకి వివ రించి చెప్పాడు. అతను చెబుతున్న విశే షాలు వారికి ఆశ్చర్యకరంగా ఉంటాయి.

"తాతా! పీతని సూసావా?" మరో పిల్ల వాడు అడిగాడు.

చిన్నగా నవ్వాడు జామిరికోదు. బాల్యం గుర్తు రావడంతో.

చిన్నప్పుడు నేస్తాలతో గెడ్డంతా తిరిగి బొరియలు కనిపెట్టి తీగలు వదిలి పైకి కిందకి కదిపేవాడు. పీత డెక్కలతో తీగ పట్టుకున్న తరువాత జాగ్రత్తగా పైకి లాగే వాడు. అలా పట్టుకున్న పీతలు తెచ్చి వరు సగా నిలబెట్టి వదిలి, ఎవరి పీత ముందుగా గీత దాటితే ఆ పిల్లవాడు ఆ రోజు వారికి నాయకుడు. చీకటి పడేవరకూ నాయకుని మాటమీద ఆట, పాట జరిగేవి.

"మన ఊరి గెడ్డలోని పీతల కంటే పెద్దవి సంద్రంలో ఉంటాయిరా మన వడా..." అని, రెండు చేతులు తెరిచి ఒక దాని పక్క ఒకటి పెట్టి పరిమాణం చూపిం

చాడు. గ్రామానికి నాలుగు వైపులా ఉన్న కొండల నడుమ ఉన్నంత జాగాలో నీరుం టుందని, అదే సముద్రమని వివరించాడు.

పిల్లలు నోళ్ళు తెరుచుకుని వింటున్నారా మాటలు.

నిజానికి సముద్రం ఎలా ఉంటుందో అత నెప్పుడూ చూడలేదు. ఒకసారి గ్రామంలో జరిగిన కొట్లాటలో ఒకడు మరొకడి ప్రాణం తీశాడు. అప్పుడు పోలీసు వాళ్ళు వచ్చి వాణ్ణి తీసుకుపోయారు. చాలా ఏళ్ళ తరువాత వాడు గ్రామానికి తిరిగొచ్చాడు. సముద్రం గురించి తను చూసిన పెద్ద పెద్ద భవనాల గురించి వాడు చెప్పిన మాటలే ఇప్పుడు పిల్లలకి జామిరికోదు చెప్పాడు.

ఎనభై సంవత్సరాల సుదీర్ఘ జీవితంలో తను తెలుసుకున్న వింతలు, విశేషాలు వారికి వివరిస్తాడు. అతని మాటలు వింటూ ఒళ్ళు మరచి పోయారు పిల్లలు. ఆడుకోవాలనే కోరిక కూడా వారికి కలగదు. జామిరికోదు ఎప్పుడు అక్కడ కూర్చుంటాడా అని ఎదురు చూస్తారు. అతనే వారికి పాఠశాల.

"తాతా! సాండర్సు దొర అంటే ఎవరు?" ఒకరోజు మునిమనువడు అడిగాడు.

ఉలిక్కిపడి ప్రశ్న వేసిన మనవడి వైపు ముఖం తిప్పాడు జామిరికోదు. ఆశ్చర్యం, సంతోషం కలగలిసి పోయి ముడుతల మధ్యనుంచి తొంగి చూస్తున్నాయి. రెండు చేతులు సాచి ఆ బుడతణ్ణి అందుకుని ఒడిలో కూర్చోబెట్టుకుని ప్రేమగా అడిగాడు.

"ఆ పేరు నీకెలా తెలిసిందిరా?"

"రాతిరి అమ్మతో అయ్యసెబుతుంటే విన్నాను. ఆ మనిషి మన జాతివాడు కాడంట. ఎక్కడ నుంచో డోక్రీబేడా వచ్చేవా డంట..."

జామిరికోదు వదనం పున్నమి చంద్రు నిలా వికసించింది. మనసుని కుదిపేస్తున్న ఆనందం తట్టుకునే శక్తి లేనట్టు చేతులు చిన్నగా వణుకుతున్నాయి. మనవడి లేత శరీరం తడుముతూ, జ్ఞాపకాల్లోకి జారి పోయాడు.

"తాతా! అతగాడెవరో నీకు తెలవదా?"

తేరుకుని నవ్వాడు జామిరికోదు.

"తెలుసురా అబ్బీ! ఇయ్యాళ ఓ గొప్ప మనిషి పేరు సెవిన పడేశావు. సాండర్స్ అంటే దొరబిడ్డ. నిప్పు ముద్ద. అలాంటోడు తరానికి ఒకడు పుడితే మన బతుకులు బాగు పడిపోను" అని సాండర్స్ దొర గ్రామానికి వచ్చినప్పటి నుండి జరిగింది మొత్తం చెప్పాడు. డోలీ పద్ధతి అనేది ఒకటి ఉందని మొదటిసారి పిల్లలకి తెలిసింది.

సాండర్స్ కబుర్లతో సమయం గడిచిపో యింది. సూర్యుడు కొండ వెనక్కి పోయి కనిపించడం లేదు.

"మరయితే అతనేటయ్యాడు?" ఓ పిడుగు అడిగాడు.

"తెలవదు..." అంటూ తల పైకెత్తి ఆకాశం వైపు చూశాడు జామిరికోదు. అక్కడ ఏదో చూసినట్టు గొంతు విప్పాడు. అతని స్వరం స్థిరంగా ఉంది.

"నేను సచ్చిపోయాక ఆ మారాజు నాకు పైలోకంలో అగుపిస్తాడు. అతని పాదాలకి దణ్ణం పెడతాను. కోదు గోష్టి నీ రుణం తీర్చుకోవడానికి ఎదురు చూస్తోందని చెబుతా. ఒకే ఒక్కసారి మా జాతిలో పుట్ట మని అడుగుతా"

మాటలు ఆపేసి వెనక్కి జారబడి నిట్టూర్చి రెప్పలు మూసుకున్నాడు జామిరి కోదు. ఆ కళ్ళు మరి తెరుచుకోలేదు.

గ్రామం ఒక్కసారిగా గొల్లుమంది.

సాండర్సు ఎక్కడున్నాడనే ప్రశ్నకి జవాబు లేదు కానీ, తరంనుండి తరానికి ఆ పేరు తెలుస్తూనే ఉంది.

కోదులు తమ గుండెల్లో ఆ వ్యక్తిని ప్రతి ష్ఠించుకున్నారు.

తమని ప్రేమించిన వాడిని, తమ కోసం తపించినవాడిని సమాజం ఎన్నటికీ మరు వదు. అది నాగరికమైనా, అనాగరికమైనా సరే.



# నిరంజనోపాఖ్యానం

కొడిమెల శ్రీరామమూర్తి

ఈ మధ్య నిరంజన్‌కు కళ్లు మంటలు మండి, కనుగుడ్లు పెద్దవి అయిపోతున్నాయి. చెవుల్లో ఏదో ఒకటే హోరు. ఓ డాక్టర్ దగ్గరకు పరుగుతీశాడు. వైద్యుడు అతణ్ణి పరీక్షించి,

"వెంటనే నీ టాన్సిల్స్ తొలగించాలి!" అన్నాడు. ఆగమేఘాలమీద ఆపరేషన్ జరిగింది. అయినా రోగిలో వచ్చిన మార్పు లేదు. నిరంజన్ మరొక డాక్టర్ దగ్గరకు వెళ్లాడు. ఆయనగారు పరీక్షించి నిరంజన్ పళ్లు తొలగించాలన్నాడు. ఆ కార్యక్రమం కూడా జరిగిపోయింది. ఆనక కొత్త పళ్లు అతికించడం కూడా జరిగింది. బిల్లు భారీగా అయినా నిరంజర్ బాధ యదాతథం!




ఈ సారి నిరంజనుడు అతిపెద్ద, ఖరీదైన డాక్టర్ వద్దకెళ్లాడు. ఆ వైద్యశిఖామణి రోగిని అతిక్షుణ్ణంగా పరీక్షించి,

"సారీ, బాబ్జీ! ఇక నువ్వు ఆరు నెలలకు మించి బతకవు!" అనేశాడు. గుండె గుభేలు మనడంతోపాటు షాక్ తినేసి, నిరంజన్ గట్టిగా ఓ నిర్ణయం తీసుకున్నాడు. బతికే ఆ ఆరు నెలలు దర్జాగా, హాయిగా జీవించాలి. తర్వాత బాల్చీ తన్నెయ్యాలి. అనుకొని ముందు ఓ ఖరీదైన కారు కొనేశాడు! ఆనక ఒక మెగా షోరూమ్‌కు వెళ్లి నలభై సూట్లుకు నలభై షర్టుల కోసం అవసరమైన క్లాత్ కొన్నాడు. ఓ మాష్టర్ టైలర్ దగ్గరకెళ్లి, బహుసొగసైన సూట్లకు ఆర్డరిచ్చాడు. చెయ్యి తిరిగిన దర్జీ మహాశయుడు.

"సార్! మీ కొలతలు తీసుకుంటాను!" అని నిరంజన్ కొలతలు నోట్ చేసుకుంటున్నాడు.

"35 స్లీవ్, 16 కాలర్...." అన్నాడు టైలర్.

"కాలర్ 16 కాదు 15" అన్నాడు నిరంజన్.

"కాలర్ 16" మరొకసారి టైలర్ చెప్పాడు ఖచ్చితంగా ఆ కొలతనే నోట్‌చేస్తూ.

"టైలర్ బాబూ! నేనెప్పుడూ నా షర్టులకు కాలర్‌ను 15 పెట్టిస్తున్నా!' ' నిరంజన్ అన్నాడు.

"దయ చేసి వినండి. నాకు మీరు పెద్ద ఆర్డర్ ఇవ్వడం వలన, మీ మీద అభిమానంతో ఓ సలహా ఇస్తున్నా! ఇది మీకొక హెచ్చరిక వంటిది కూడా! 15 కాలర్ షర్టు కుట్టించుకుంటే, ఇక మీ పని ఇంతే సంగ

తులు! ఆనక మీ పీక నొక్కుకుపోయి, కనుగుడ్లు పెద్దవయిపోతాయి! అంతే కాక మీ చెవులు హోరెత్తి పోతాయి. ఒకటే రొద, రణ గొణ ధ్వనులు అంటూ దుస్తుల 'గీత'ను బోధించాడు టైలర్ మహాత్ముడు!




అది విని నిరంజనుడి కళ్ళ ముందు అనేక మెరుపులు మెరిశాయి. కొత్త సత్యం విని అతను దిగ్భ్రాంతి చెందాడు. టైలర్‌కు 'ఓకె' చెప్పి, కార్లో ఝుమ్మంటూ ఇంటికి వెళ్ళి, తన షర్టులన్నిటినీ అర్ధాంగికి ఇచ్చి "ఐశ్వర్యా! ఇక మీదట ఈ షర్టులు నా కంటికి కనిపించకూడదు!" అన్నాడు. ఆ అర్ధాంగి భర్త చెప్పిన ప్రకారం చేసింది. ఆ షర్టులన్నిటిని స్టీలు సామాన్లవాడికి ఇచ్చేసి బోల్డు సామాన్లు కొనేసుకుంది.

దర్జీగారు ఇచ్చిన అపాయింట్‌మెంట్ ప్రకారం, నిరంజన్ సదరు సూపర్ టైలర్ వద్దకు వెళ్ళాడు. అతను అతి భారీగా బిల్లు వసూలు చేసి, కుట్టిన దుస్తులను అందంగా ప్యాక్ చేసి నిరంజన్‌కు అందజేశాడు. నిరంజన్ ఆ రోజునుంచే కొత్త దుస్తులు ధరించి షోకిల్లా రాయుడిలా తిరగసాగాడు! చిత్రమేమిటంటే, ఇప్పుడిక నిరంజనుడికి ఏ బాధా లేదు! పత్తికాయల్లా పొడుచుకొచ్చిన కనుగుడ్లు యథా స్థానానికి వెళ్ళిపోయాయి. చెవుల్లో హోరు మటుమాయమైంది. కొత్త బట్టలతో మనిషి బతికి 'బట్ట' కట్టేశాడు! ఆ దుస్తులు ధరిస్తున్నప్పుడల్లా నిరంజన్‌కు అనిపించేది. 'కొండొకచో డాక్టర్లకన్నా, టైలర్లే మిన్న'ని. ✦

# కొత్త నీరు

విజయలక్ష్మి

ఊళ్లో ఉన్న ఆస్తులన్నీ అమ్ముకుని, సినిమా తియ్యాలన్న ఉద్దేశ్యంతో హైదరాబాద్ చేరుకున్నాడు మహీపతి. ఆ డబ్బు చాలదని చెప్పాడు దర్శకుడు బ్రహ్మాజీ. 'ఏ మార్వాడీ సేట్ అయినా అప్పు పెట్టకపోతాడా' అని సలహాయిచ్చాడు దర్శకుడు. ప్రయత్నం ఫలించింది కానీ, కొద్దిరోజులు ఆగమన్నాడు సేటు. డబ్బు చేతికి వచ్చింతర్వాతనే సినిమా నిర్మాణం మొదలుపెట్టాలని నిర్ణయించుకున్నారిద్దరు. తీరా ఇప్పుడు వెళ్లి అడిగితే



మొండి చెయ్యి చూపాడు సేటు. వేరే చోట ప్రయత్నించినా లాభంలేక పోయింది. మహీపతికేంచెయ్యాలో పాలుపోలేదు.

దర్శకుడు బ్రహ్మాజీ మాత్రం "మీకెందుకు... మీరు నిశ్చింతగా ఉండండి" అని భరోసాయిచ్చాడు. ముందు తన వద్ద ఉన్న డబ్బు చాలదన్న మనిషి ఇప్పుడిలా అంటున్నాడేమిటని ఆశ్చర్యపోయాడు మహీపతి. 'ఉన్న డబ్బు కాస్తా ఊడ్చెయ్యడు కదా' అని భయపడ్డాడు కూడా.

బ్రహ్మాజీ పేపరు ప్రకటన ఇచ్చాడు నటీనటులు, ఆర్టిస్టులు, ఆర్కెస్ట్రావాళ్లు కావాలని. అనుకున్న విధంగానే బాగా రెస్పాన్స్ వచ్చింది. ఇంటర్వ్యూలో నెగ్గిన వాళ్లనేకాక మిగిలినవాళ్లక్కూడా ఎక్స్‌ట్రా అవకాశాలిస్తానన్నాడు.

"అందరూ కొత్త వాళ్లనే పెడితే చిలుం వదలటమే గాని సినిమా పూర్తవుతుందా? " అనుమానం వ్యక్తంచేశాడు నిర్మాత మహీపతి.

"అన్నీ నేను చేసుకుంటానుగా. మీరు నిశ్చింతగా ఉండండి' ' బ్రహ్మాజీ నోట మళ్ళీ అదే పాట. ఒక సమయంలో 'నెత్తిన చేతులు పెట్టే రకం కాదుగదా' అని కూడా అనుకున్నాడు.

బ్రహ్మాజీ కొత్త పోకడ చూసి సినీ ఫీల్డులో అందరూ ఎగతాళిగా నవ్వుకున్నారు. "నటీనటులంటే కొత్త వాళ్లను పెట్టారు సరే. గాయకులు, రచయితలతోసహా అవసరమైన వాళ్ళందర్నీ కొత్త వాళ్ళనే పెట్టారు. ఈ సినిమా ఆడేదేనా" అనుకున్నారు వాళ్లలో వాళ్లు.

ఆ మాటలు చెవిన పడ్డ మహీపతి బ్రహ్మాజీతో చెప్పుకుని వాపోయాడు.

"అంతా మంచే జరుగుతుంది. మీరు

నిశ్చింతగా ఉండండి" మళ్ళీ పాత పాటే

సినిమా నిర్మాణం పూర్తయి సెన్సారు కూడా సర్టిఫికెట్ ఇచ్చింది. మంచి రోజు చూసుకుని రిలీజ్ చేద్దామనుకున్నారు. కాని బయ్యర్లెవరూ ముందుకురాలేదు. థియేటర్ యజమానులు ముఖం తిప్పుకున్నారు. మహీపతి గుండె జారిపోయింది.

బ్రహ్మాజీ ఇచ్చిన సలహాతో థియేటర్‌నొకదాన్ని వారం రోజుల పాటు అద్దెకు తీసుకున్నాడు మహీపతి. మొదటి రోజు ఆటకు ఒక్క పురుగు కూడా రాలేదు. సినిమా నిర్మాణానికి అప్పు చెయ్యాల్సిన పనయితే రాలేదు గాని పెట్టిన పెట్టుబడి మాత్రం గంగలో కల్సిపోయినట్టే అనుకుని బెంగపెట్టేసుకున్నాడు.

థియేటర్ ఖాళీగా ఉండకుండా తన సినిమాలోని నటీనటుల్ని, ఆర్టిస్టులను, ఇంక నిర్మాణానికి సహకరించిన వారినందర్నీ తమ స్నేహితులతోను, బంధువులతోను ఉచితంగా చూసే అవకాశం ఇచ్చాడు బ్రహ్మాజీ.

వాళ్ళంతా సినిమా బావుందని చెప్పుకోవటం చూసి జనం చిన్నగా రావటం మొదలు పెట్టారు. మూడోరోజు కల్లా హౌస్‌ఫుల్ అయింది. మిగిలిన పట్టణాలలో కూడా రిలీజు చేశారు. అన్ని చోట్లా ఆ సినిమా వందరోజులాడింది.

మహీపతి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు. బ్రహ్మాజీకి సినీఫీల్డ్‌లో బాగా గుర్తింపు వచ్చింది.

"కోట్లు ఖర్చు పెట్టి సినిమా తీసినా ఫ్లాఫ్ అవుతున్న ఈ రోజుల్లో ఇంత తక్కువ బడ్జెట్‌తో, కొత్త ముఖాలతో ఈ సినిమాని సక్సెస్ దారిలో ఎలా నడిపించారు? " అడిగారు సినిమా పత్రికల విలేకర్లు.

"ఏముంది? అందరికీ తెల్సిందే. నిర్మాత నా మీద నమ్మకం పెట్టారు. అంతేగాక మన తెలుగు వాళ్లలో గొప్ప గొప్ప ఆర్టిస్టులున్నారు. కాని ఎదగటానికి అవకాశాల్లేక మరుగునపడి పోయారు. ఆ రోజు నేను సినిమా కోసం ఇంటర్వ్యూ చేసినప్పుడు వాళ్లలో వున్న టాలెంట్ చూసి ఆశ్చర్యపోయాను. ఒక్కొక్కరిలో ఒక్కో అద్భుతమైన కళ దాగుంది. ఇప్పుడు సినిమా ఫీల్డులో ఉన్న వాళ్లకు ఏ మాత్రం తీసిపోరని నిర్ధారణ అయింది. కొత్త వాళ్లకు అవకాశం ఇచ్చినట్టూ వుంటుంది. ఖర్చు తగ్గుతుందని ఆలోచించి ధైర్యం చేశాను..." చెప్పాడు బ్రహ్మాజీ.

"అసలే అనుభవం లేని వాళ్లు కదా! మీరు నిన్నటి వరకు అందరూ ఈ సినిమా అట్టర్ ఫ్లాప్ అవుతుందనే అనుకున్నారు. ఒక వేళ అదే జరిగితే నిర్మాతకు ఏం సమాధానం ఇచ్చుకునేవారు? "

"అలా జరగదన్న నమ్మకం ఉంది. అంతే కాక మా ఆర్టిస్టులు, హీరో హీరోయిన్లంతా ఏమన్నారో తెల్సా. అనటమే కాదు స్టాంపు కాగితంమీద కూడా రాసిచ్చారు" అని బ్రహ్మాజీ ఊపిరి పీల్చుకుంటుండగానే

"ఏమని? " అడిగాడు విలేకరి.

"సినిమా కనుక ఫ్లాప్ అయితే వట్టిచేతులతోనే వెళ్లి పోతామని రాసిచ్చారు. అవకాశం ఇచ్చారు అదే చాలన్నట్టు ఎవరి ఖర్చులు వాళ్ళే భరించి నిర్మాతకు సహకరించారు. వాళ్ల సహకారంవల్లే సినిమా తియ్యగలిగాం. మా నిర్మాత కూడా తన పెట్టుబడి వరకు తను తీసుకుని మిగిలిందంతా పంచిపెడతానన్నారు"

"ఈ సారి తియ్యబోయే సినిమాకి మళ్లీ కొత్త ఆర్టిస్టులనే ఎంపిక చేస్తారా? "

"మళ్ళీ కొత్త వాళ్ళెందుకు? " అన్న బ్రహ్మాజీ మాటలకు గతుక్కుమన్నారు పక్కనే వున్న ఆర్టిస్టులంతా. విలేకర్లూ ఆశ్చర్యంగా చూశారు.

దర్శకుడు బ్రహ్మాజీ నవ్వి "ఒక సినిమాకి చేసింతర్వాత ఇంకా కొత్త వాళ్లేమిటయ్యా" అన్నాడు. అందరూ ఒక్కసారిగా ఊపిరి పీల్చుకున్నారు.



నిజజీవితాన్ని కళ్లముందుంచిన

కథ వెనుక కథ

# విహ్వాలు



**పరిచయం అక్కరలేని గొప్పకవి గుంటూరు శేషేంద్ర శర్మ. సాహితీవేత్తగా ఆయన స్థానం అద్వితీయం. సాహితీపరంగా దేశంలోనే అత్యున్నత పురస్కారమైన సాహిత్య అకాడమీ ఫెలోషిప్ అందుకున్న సరస్వతీ పుత్రుడాయన. 'ఆధునిక మహాభారతం (నా దేశం-నా ప్రజలు)', 'జనవంశమ్' వంటివి ఆయన లేఖిని నుంచి జాలువారిన నవకవితా స్రవంతులలో కొన్ని. 'కవి సేన మ్యానిఫెస్టో'రాసి తెలుగు కవిత్వానికి కొత్త పోకడలు నేర్పించిందీ ఆయనే. ఆయన రచనలెన్నో ప్రపంచభాషల్లోకి తర్జుమా అయ్యాయి. ఆయన పేరును నోబెల్ బహుమతికి పరిశీలించేలా చేశాయి.**

బేసికల్‌గా కవే అయినా శేషేంద్ర గొప్ప కథకుడు. కొన్ని దశాబ్దాల క్రితం ఆయన రాసిన 'కామోత్సవ్' ఓ సంచలనం సృష్టించింది. సీరియస్‌గా కథలపై దృష్టికేంద్రీకరిస్తే ఆయన నుంచి మరిన్ని ఆణిముత్యాల్లాంటి కథలు, నవలలు వచ్చేవనడంలో సందేహం లేదు. సుమారు అర్ధశతాబ్దం కింద.. అంటే 1957 ప్రాంతాల్లో కొన్నికథలు రాసి 'విహ్వల' పేరుతో సంకలనంగా తెచ్చారు. ఇందులోని కథలు కొన్ని మళ్లీమళ్లీ పత్రికలలో అచ్చయ్యాయి. కొన్ని ఇతరభాషల్లోకి అనువాదమయ్యాయి. 'విహ్వల' కథను ప్రసారభారతి సింగిల్ ఎపిసోడ్‌గా చిత్రీకరించి గత ఏడాది దేశవ్యాప్తంగా దూరదర్శన్‌లో ప్రసారం చేసింది. ఈ ఏడాది మన తెలుగు దూరదర్శన్ ఛానల్ 'సప్తగిరి' కూడా దీన్ని ప్రసారం చేసింది. ఆ 'విహ్వల' కథ వెనుక కథ గురించి ఈనెల 'చతుర' పాఠకులకు శేషేంద్ర ఇలా చెబుతున్నారు..

'1957 ప్రాంతంలో నేను బొబ్బిలి మున్సిపల్ కమిషనర్‌గా పనిచేశాను. ఊరివెలుపల ప్రభుత్వం మాకిచ్చిన నివాస భవనం చుట్టూ పెద్దప్రహరీ గోడ ఉండేది. ఎటుచూసినా చెట్లు.. ఊడలు దిగిన మహావృక్షాలే! వేసవి కాలంలో వాటికింద సేదతీరడం ఎంతో హాయిగా ఉండేది. పట్టణంలో వంటచెరకు అమ్మేందుకు గిరిజనులు రావడం అక్కడ నిత్యకృత్యం. ఎండనపడి వచ్చే ఆ గిరిజనులలో అనేకమంది మా భవనం సమీపంలోని చెట్లకింద సేదతీరేవారు. ఇలావచ్చే గిరిజనులలో పిల్లల నుంచి పెద్దలవరకూ అంతా ఉండేవారు. వారిలోని ఓ ఆరేడేళ్లపిల్లతో మా పాపకు పరిచయం అయింది. మా పాప వయసూ ఇంచుమించు అంతే. ఆ పరిచయం క్రమంగా స్నేహంగా మారింది. ఇద్దరూ రోజూ చాలా సేపు ఆ చెట్లకింద ఆడుకునేవారు. వీళ్ల స్నేహాన్ని చూస్తుండేవాడిని.. వారి మాటలు గమనిస్తూ ఉండేవాడిని. కొన్నాళ్ల తర్వాత ఈ అంశంతో ఒక కథ రాయాలని మొదలెట్టాను. అదే

## నిజజీవితం నుంచే కథలు

'విహ్వాల' కథాసంపుటిలో విహ్వాల, హిరణ్మయి, రంగులచేప, హరిణ, ఎగిరిపోయిన హంస వంటి దాదాపు డజను కథలున్నాయి. దాదాపు అన్ని కథలూ నిజజీవితం నుంచి వచ్చినవే. పాత్రలూ అంతే. వాటికి కొద్దిగా ఫిక్షన్ జోడించి రాశాను.. ఈ తరంవారికి తెలియకపోయినా అప్పట్లో ఇవన్నీ పాఠకుల్ని విశేషంగా ఆకట్టుకున్నాయనే అనుకుంటున్నాను..' అంటూ ముగించారు శేషేంద్రశర్మ.

'విహ్వాల' అయింది. ఇక్కడి వరకూ కథాంశంలో ఏ మార్పూలేదు. అలాగే నడిపించాను. ఓ ఆఫీసర్ కూతురికి గిరిజనుల అమ్మాయితో దోస్తీ ఏర్పడుతుంది.

### సర్కస్‌రాకతో కథలో మలుపు

ఆ తర్వాత ఆ ఊరికి ఓ సర్కస్ వస్తుంది. ఆఫీసర్ కూతురు.. గిరిజన పిల్లతో దానిగురించి చెబుతుంది. నువ్వెప్పుడైనా సర్కస్ చూశావా? అని అడుగుతుంది. లేదంటుంది ఆ పాప. అందులో సింహాలు.. పులులు ఉంటాయని, బఫూన్లు కడుపుబ్బ నవ్విస్తారని.. తనకు తెలిసిన సంగతులెన్నో వర్ణించి చెబుతుంది ఆఫీసర్ కూతురు. దాంతో సహజ సిద్ధమైన బాల్యచాపల్యం ఆ పిల్లలో మోసులెత్తి, ఎలాగైనా దాన్ని చూడాలనే ఉత్సుకతను రేపుతుంది. ఆ మాటే అడిగితే ఆఫీసర్ కూతురు- రేపు తాము సర్కస్‌కు వెళ్తున్నామని, రాదలుచుకుంటే తమతో రావచ్చని అంటుంది. టిక్కెట్టుకు డబ్బు మాత్రం తెచ్చుకోవాలని చెబుతుంది.



### డబ్బుకోసం దొంగతనం

ఇంటికి వెళ్లిన గిరిజనపిల్ల తల్లిని సర్కస్‌కు డబ్బు అడుగుతుంది. పేదరికంలో కొట్టుమిట్టాడే ఆ తల్లి సర్కస్‌కు పైసలు ఎక్కడినుంచి తెస్తుంది? లేవుపొమ్మని కసరికొడుతుంది. ఎంత బతిమాలినా ఇవ్వదు. అయితే తల్లి ఏదోపనిలో ఉండగా ఇంట్లో నూకలకోసం దాచిన డబ్బుతీసుకుని ఊరివైపు పరుగుతీస్తుంది పాప. చాలాదూరం పరుగు పరుగున రావడంతో ఆఫీసర్ నివాసభవనం సమీపానికి వచ్చేసరికి ఆమెకు శ్వాస పీల్చుకోవడమే కష్టమవుతుంది.

### కుప్పకూలిన ఆశ

అయితే తన స్నేహితురాలు అప్పటికే సర్కస్ చూడడానికి వెళ్లిపోయిందని తెలియడంతో ఆ పసిమనసు తట్టుకోలేకపోతుంది. కంటికి మంటికి ఏకధారగా రోదిస్తుంది.. మనసంతా నైరాశ్యం కమ్ముకోవడంతో ఒక్కసారిగా కుప్పకూలిపోతుంది. మరోపక్క ఒళ్లు చల్లబడిపోతూ ఉంటుంది. ఆఫీసర్ ఆ చిన్నారి పరిస్థితిచూసి కలవరపడతాడు. ఏంచేయాలో తోచదు.. తర్వాత డాక్టర్‌ను పిలిపిస్తాడు.. కానీ అతను వచ్చేసరికే ఆమె ప్రాణాలు అనంత వాయువుల్లోకి కలిసిపోతాయి.. ఇలా ముగించానీ కథని. ఆ పసిమనసు కోరిక తీరకుండానే నూరేళ్లునిండినట్లు చూపడం.. మహావిషాదంగా కథను ముగించడం అటు పాఠకుడిని, ఇటు టీవీ ప్రేక్షకుడిని కూడా విచలితుడిని చేస్తాయి. కొంతసేపటి వరకూ కదలనీయవు. ఆవేదనలో ముంచెత్తుతాయి. తర్వాత ఆలోచింపచేస్తాయని శేషేంద్ర అన్నారు. ✦

సేకరణ: చంద్రప్రతాప్




# అనురాగము విరిసేనా...!



"జీవితమే సఫలము! రాగసుధా భరితము! 'ప్రేమకదా' మధురము..."

నిజమే, 'ప్రేమకథ' ఎపుడు మధురమంటే అనురాగాన్ని పరస్పరావగాహనతో సుధాభ రితం చేసుకున్నప్పుడు. జీవితం అనే మూడ క్షరాల్ని ప్రేమ అనే రెండక్షరాలతో గుణించి సఫలం చేసుకోగలిగినప్పుడు.

ఇప్పటి ప్రేమలకి అంత సీన్ లేదు. రోజూ ప్రేమోద్యానవనంలో విహరిస్తూ ప్రతి రోజూ ఒక ప్రేమపుష్పాన్ని ప్రేయసీ ప్రియులు ఇచ్చిపుచ్చుకునే అనురాగాలు ఇవాళ ప్రేమికుల దినోత్సవం జరుపుకొని సంవత్సరానికోసారి వాలంటైన్స్ రాగం పాడుకోవడంతో ముగిసిపోతున్నాయి. అసలు కేవలం పెదవుల చివర్నించి పలికే 'ఐ లవ్ యు'లు తప్ప ప్రేమంటే ఏమిటో ఎందరికి తెలుసు?

కార్పొరేట్ కల్చర్‌తో కాలప్రవాహంలో కొట్టుకుపోతూ అధాటున అందిన చేతిని పట్టుకుని కాఫీహౌస్‌ల్లోను, పబ్బుల్లోను సేద తీరుతూ, ఫ్రీ సెక్స్‌కు పచ్చజెండా ఊపి స్వేచ్ఛా వాంఛాగానాల్ని ఇష్టపడే యువతే నేడు ఎక్కువ. పాశ్చాత్య సంస్కృతికి, భార తీయ విలువలకి మధ్య నిజమైన ప్రేమ నిలబడ్డానికి స్థలం వెతుక్కుంటోంది.

ఎవరికిష్టమైనట్లు వాళ్ల జీవించే హక్కును ఉపయోగించుకునే స్వేచ్ఛ ఉండాలని అందరూ అనుకుంటారు. కానీ ఏ మేరకు? అన్న పరిమితిని గురించి ఆలోచించడానికి బహుకొద్ది మందే సమయం వెచ్చిస్తారు. మానవసంబంధాలన్నీ హృదయ సంబంధి తాలు కావనే వారూ ఉన్నారు. అలాంటి వారికి Emotional Bondage గురించి పట్టదు. కాంట్రాక్ట్/ఎగ్రిమెంట్ పద్ధతి, ప్రస్తుత ఇంటర్‌నెట్ అలవరసల్లో (Wave lengths) కొట్టొచ్చినట్లు కనబడుతున్న ఎంత ఇస్తే అంత పొందగలవన్న (Give and take) ధోరణి; పెళ్లికి ముందు జీవితం వేరు, తర్వాత జీవితం వేరు అనుకుని అను భూతి గాఢత కంటే కొద్ది క్షణాల దేహ చింతలు బాపే అనుభవాల కోసం వెంప ర్లాటలు, ఎంజాయ్, మజాల మత్తులో మునిగి తేలింతర్వాత ఎదురయ్యే కఠిన వాస్తవాలను గుర్తించలేని ఒక డొల్లతనం (Hollow Effect) సర్వే సర్వత్రా కనిపిస్తోం దని సర్వేలు చెబుతున్నాయి. ఎంత పెద్ద విషయాన్నయినా తేలిగ్గా తీసుకోవడానికి అలవాటుపడిపోయాం. భూతద్దాల్లోంచి

చూడ్డం దాదాపుగా తగ్గిపోయింది. ఒకనాడు అత్యంత చర్చనీయాంశాలయిన స్త్రీ పురుష సంబంధాలు, స్వేచ్ఛాప్రణయాలు ఈనాటి గ్లోబల్ గమనంలో సర్వసాధారణాంశాలు. ఒకవిధంగా అందరూ అన్నింటినీ పట్టించుకుని పీకిపాకం పట్టి ప్రాణాంతకాలుగా మార్చే కంటే ఈ నో కామెంట్ ధోరణి ఆహ్వానించదగిందే. అయినా అప్రమత్తత అవసరం.

ప్రేమ కోసం త్యాగాలు చేయడాలు, క్షమించడాలు పోయి పగ, ప్రతీకారం, స్వార్థం, వికృతానందం (శాడిజం) చోటుచేసుకోవడం శోచనీయం. ప్రేమించినమ్మాయి తనకి దక్కలేదని ఆమె ముఖం మీద యాసిడ్ పోయడం, పగబట్టి కత్తులతో పొడిచి చంపడం, ఆత్మహత్యకి పురికొల్పి తానూ ఆమెతో బాటుగా ఆత్మహత్య చేసుకుంటున్నానని నమ్మబలికి ఆమె సిన్సియర్‌గా విషం తాగి చచ్చిపోయేలా చేసి తాను బతికి బట్టకట్టడం, పలుకుబడి, డబ్బు ఎరవేసి కేసులు తారుమారు చేయడం, శిక్షలు తప్పించుకోవడం ప్రేమ అని అనిపించుకుంటుందా? ఇవన్నీ చూస్తూ కూడా అసలు వాళ్లని వదిలేసి సాక్ష్యం చెప్పిన వాళ్లని పోలీసులు, న్యాయస్థానం ప్రశ్నలతో పీడిస్తారని భయపడి ప్రజలు, ఇరుగుపొరుగు మౌన వ్రతాలు పట్టడం అంతకంటే దారుణం. ఈ విషయాన్ని అటు స్టూడెంట్ ప్రేమికులు ఇటు ఇతరులు వివేచనతో గ్రహించగలగాలి.

భాషకందని భావావేశం ప్రేమ. ప్రేమికుల సంభాషణలు, అవగాహనలు సున్నితంగా, సుకుమారంగా ఉండాలి. అప్పుడే ఆ రెండు గుండెల సవ్వడి వారికి మాత్రమే వినిపించి వలపు రాగాలు పలికిస్తుంది. నిజానికి ఒకరి నొకరు ఇష్టపడిన వారి మధ్య మౌన భాషణం తెచ్చినంత ప్రభావం చాంతాడంత సంభాషణలు తేలేవు. అందుకు నిదర్శనంగా జరిగిన సంఘటన అవధరించండి. ఇది ఈ కాలంది కాదు, కొన్ని దశాబ్దాల నాటిది. అయినా తాజాగా ఉదహరించుకోవచ్చు.

ఒకానొక చిత్రం కోసం ఓ ప్రేమ సన్నివేశ చిత్రీకరణ జరుగుతోంది. నాయికా నాయకులు ఎదురెదురుగా కూర్చున్నారు. దర్శకుడు పర్యవేక్షిస్తున్నాడు. చిత్రీకరణ ఇలా సాగింది.

హీరో: "లతా, నేను నిన్ను ప్రేమిస్తున్నాను."

అప్పటిదాకా అతన్నే చూస్తున్న హీరోయిన్ సిగ్గుతో కనురెప్పలు వాలుస్తుంది.

దర్శకుడు కల్పించుకుని "ఆమె లతే కదా! మళ్లీ పేరెందుకు? పేరు తీసెయ్యండి" అన్నాడు. సరేనని.

హీరో: "నేను నిన్ను ప్రేమిస్తున్నాను" అన్నాడు.

హీరోయిన్ అలవోకగా నవ్వింది.

మళ్లీ దర్శకుడు సీన్లోకొచ్చి "ప్రేమించేది నువ్వేగా! మళ్లీ 'నేను' అనడం ఎందుకు ? కట్" అన్నాడు. హీరో మళ్లీ సరేనని మంద్ర స్వరంతో "నిన్ను ప్రేమిస్తున్నా"నన్నాడు.

హీరోయిన్ అరమోడ్పు కళ్లతో ఆ మాటలకి పులకించి పరవశించిన ఫీలింగ్ ఇచ్చింది. ఏమాటకి ఆమాటే. ఆమె నటనలో దోషం లేదు. పట్టు వదలని దర్శకుడు "ప్చ్, ఇద్దరూ అంత సన్నిహితంగా కూర్చున్నాక పనిగట్టుకుని 'నిన్ను ప్రేమిస్తున్నాను' అనడం అస్సలు బాలేదు. నో డైలాగ్. ఏం మాట్లాడొద్దు, ఒకరి కళ్లల్లోకి ఒకరు మోహావేశంతో చూసుకోండి. షాట్ తీస్తా" అన్నాడు.

షాట్ క్షణాల్లో ఓకే అయింది. ఆయన నిశిత దృష్టికి సెట్‌లో అందరూ ఆయన్ని ఎంతో ప్రేమగా ప్రశంసించారు. ప్రేమంటే మౌనం. కళ్ల భాష అన్నమాట. కళ్లు కళ్లూ కలసిన క్షణాల కెమిస్ట్రీ కాగల కార్యం తీరుస్తుంది.

ఇక సెక్స్ ఎడ్యుకేషన్, లైంగిక స్వేచ్ఛల గురించి ఇవాళ తెలియని వారు లేరు. వివిధ మాధ్యమాలు, వింత వింత రీతుల్లో

స్త్రీ పురుష సంబంధాల గురించి- అది అటు నియంత్రణో, ఇటు విశృంఖలతకు మార్గదర్శక భద్రతో తెలీని విధానంగా- ఎడ్యుకేట్ చేయడానికి వీరలెవల్లో ప్రయత్నాలు చేస్తున్నాయి. కామిగానివారు ప్రేమగాములు కాలేరన్నట్లు వీటన్నింటినీ ప్రేమ గాటన కట్టేసి ఇవి ప్రే(కా)మ సూత్రాలన్న ఉద్బోధలు చేసే కృషికీ తక్కువ లేదు.

ప్రభావం ఏదైనా ప్రేరణ దేనికైనా కులాసా జీవితాన్ని కోరుకునే వారి సంఖ్యే అధికం కదా! అధికస్య అధికం బలం. టూ మెనీ చిట్కాలు, మెళకువలు తెలుసుకుంటున్న జ్ఞానం మిశ్రమ ఫలితాలనే ఇస్తోందనడానికి సమకాలీన జీవన సరళే సాక్షి. ఐలవ్యూల్లో లోతు లేకపోవడం వల్ల ప్రేమికుల మధ్య, ప్రేమించి పెళ్లి చేసుకుని భార్యాభర్తలయిన వారి మధ్య చిన్నపాటి విషయాలకే అనుమానాలు, అహంకారాలు, ఆవేశాలు విశ్వరూపం దాల్చి సంబంధాలు చిట్లిపోతున్నాయి. బతుకులు పెట్లిపోవడం ఎక్కువై పోతోంది.

అర్థం చేసుకోవడం, అనుకూలత, బలహీనతల్ని సర్దుబాటు చేసుకోవడం, పరస్పరం గౌరవించుకుంటూ వ్యక్తిత్వాలు నిలబెట్టుకుని సహజీవనం సాగించగలిగినప్పుడే అది సరైన ప్రేమ అనిపించుకుంటుంది. ఆ సహజీవనం సింగిల్‌గా ఉంటూ లైఫ్ పార్ట్‌నర్‌ని ఏర్పాటు చేసుకున్నదయినా, అలా ఉంటూనే పిల్లల్ని కన్నా, పెళ్లి చేసుకున్నా, Vacation Love అయినా, వారాంతపు ప్రేమలయినా జీవితాలతో ప్రయోగాలు చేయకుండా మనసుని మనసుకి జత చేయగలిగితే ఆ ప్రణయానందం ఆహ్లాదాన్నిస్తుందనడంలో ఎవరికీ సందేహం ఉండక్కర్లేదు. ఎవరైనా ప్రేమతత్వాన్ని పట్టగలగాలి.

ప్రేమే నేరమౌనా? ప్రేమ త్యాగాన్ని కోరుతుంది వంటివి ఇప్పటి క్షణక్షణ ఎద కోలాహలాలకి సరిపడేవి కావు. ఆకర్షణ, ఏకపక్షమైన వ్యామోహం ప్రేమ కాదు.

ప్రేమంటే మనసుతో చెలిమి. ఇరు హృదయాలు కలసి పాడే నిశ్శబ్దయుగళం ప్రేమ. ప్రేమ అమ్మకానికి దొరికే వస్తువు కాదు. అమ్మకానికి వచ్చినా సుఖాన్ని, మనశ్శాంతిని ఇవ్వని ప్రేమనెవరు కొనుక్కుంటారు? స్వచ్ఛమైన ప్రేమ ఇస్తానంటే కొనుక్కునే ప్రేమికుల క్యూ పొడవు తక్కువుండదు. అసలు అనురాగాలు విరిసే అంతరంగం సొంతమౌతుందంటే తమకి తామే అమ్ముడుపోరూ ఎవరైనా? అనురాగాన్ని జ్ఞాపకాల్లో వెతుక్కోకూడదు. మనసులో చూసుకోవాలి. మనసు లేని చోట మనువు, మనుగడ దుర్భరం. ప్రేమంటే మనసున మనసై, పెళ్లంటే బ్రతుకున బ్రతుకై, రాగాల సరాగాల జీవనాన్నేగా ఎవరైనా కోరుకునేది. అందుకు రెండు చేతులు, చేతలు కలవాలి. మెళకువలు, చిట్కాలు, ప్రశ్నలు సమాధానాలు కాదు పాఠాలు నేర్చుకోవాలి. ప్రేమ ఓనమాలు దిద్దుకుని, గుణింతాలు నేర్చుకుని, ఓ శాస్త్రంలా పరిశోధించి పరవశించగలగాలి. అందుకే గురజాడ అప్పారావుగారు ఒప్పైన మాటలు చెప్పారు.

"ప్రేమ విద్దెకు ఓనమాలివి
ఎదను నిలిపిన ప్రేమ చేకూరు
మరులు ప్రేమని మది తలంచకు
మరులు మరలును వయసుతోడనె
మాయమర్మములు లేని నేస్తం
మగువలకు, మగవారి కొక్కటె!
బ్రతుకు సుఖమునకు రాజమార్గము
ప్రేమ ఇచ్చిన ప్రేమ వచ్చును!!

ప్రేమ ఇచ్చిన ప్రేమ పుచ్చుకుండా చూసుకోవాలంటే మనసు వశమయ్యే ప్రేమగానాలాలపించాలి. ఆ మేరకు సినిమా పాటలూ పాఠాలు నేర్పిస్తాయి. 'కనులు మాటలాడునని మనసు పాట పాడునని...! తెలుసుకుంటే మది నిండా మోహనరాగ ఝరులే!

– డా॥ కె.బి.లక్ష్మి

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# మౌనరాగాలు

— నవీన్

నవంబరు 1978: సంపుటి: 1 సంచిక: 1

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. చతుర ప్రచురణ ప్రారంభమైన 1978వ సంవత్సరం డిసెంబరు నెలలో ప్రచురించిన **'మౌన రాగాలు'** నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

యౌవన ప్రాంగణంలో ప్రవేశించిన యువతీ యువకుల మనసులు అనుభవంతో వికసిస్తూ, మారిపోతూ వినూత్న సోయగాలను సంతరించుకుంటాయి. తమకు నచ్చిన వారితో జీవితం పంచుకోవాలని రంగుల కలలు కంటూ వాళ్ళు మధురోహలలో తేలిపోతుంటారు. ఆ అనుబంధాలు శాశ్వతం చేసుకోవాలనుకునే ప్రయత్నంలో వారి ప్రవర్తనలు కొత్త మలుపులు తిరుగుతాయి. వారి సంగతలా ఉంటే వారి తల్లిదండ్రులు పిల్లలకు పెళ్లిళ్ళు చేసి తమ భారం దింపుకోవాలనుకుంటారు. బాధ్యత నిర్వర్తించుకోవాలనుకుంటారు. కొన్నిసార్లు యువతరం భావాలు పెద్దలకు నచ్చవు. పెద్దల అభిప్రాయాలు పిల్లలకు సరిపడవు. తల్లిదండ్రుల వత్తిళ్ళకు తలొంచి వారిని నొప్పించవద్దనుకునే యువతీ యువకులు పెద్దల మాటల్ని గౌరవించి పెళ్ళికి అంగీకరిస్తారు. ఆ అంశాలన్నిటినీ అద్భుతంగా చిత్రించిన నవల ఇది.

**ఇతివృత్తం:**

"రేపీపాటికి అంతా అయిపోతుంది. ఒక కొత్త వ్యక్తితో తన జీవితం ప్రారంభమవుతుంది" అన్న వాక్యాలతో మౌన రాగాలు నవల మొదలవుతుంది. పెళ్ళికూతురు అరుంధతి తనను పెళ్ళాడబోతున్న వరుని గురించి, సమాజం గురించి, పెళ్ళి పేరిట జరుగుతున్న సంప్రదాయాలు, ఆచారాలు, లాంఛనాల గురించి ఆలోచిస్తూ ఉంటుంది. తల్లి వచ్చి భోజనానికి రమ్మన్నా తినాలని లేదని చెప్పి మళ్లీ ఆలోచనల్లో పడిపోతుంది. "అతడెలాంటివాడో! తననర్థం చేసుకుని తన అభిప్రాయాలను గౌరవిస్తాడో లేక భార్యంటే తన కాళ్ల కింద పడి ఉండాల్సిన ఒక బానిసలాంటిదనుకుని అధికారం చలాయిస్తాడో? ఈ తల్లిదండ్రులు ముక్కూ

మొహం తెలీని కొత్త వ్యక్తిని నమ్మి కూతుర్ని అతని చేతుల్లో ఎందుకు పెడతారో? అతని మనస్తత్వం ఎలాంటిదోననీ, సంస్కారవంతుడేనా కాదా అనీ ఎందుకు పట్టించుకోరో? అమ్మాయి వెళ్ళి దీనంగా పెళ్ళి చూపుల్లో కూర్చోవాలి. నఖశిఖ పర్యంతం ఎక్స్‌రే కళ్లతో పరీక్షించి పెళ్ళి కొడుకు తరఫువాళ్ళు వంకలు పెడతారు. గొంతెమ్మ కోరికలు కోరతారు..." అని ఆలోచిస్తుంటుంది అరుంధతి. అంతలో అరుంధతి చెల్లెలు అపర్ణ వచ్చి "అక్కా! నీవు కలలు కనడం మానేసి తిండి తిను" అంటుంది. అక్కను ఆట పట్టిస్తుంది.

అరుంధతి పిన్ని రమణమ్మ, ఆమె కూతుళ్ళు ఉజ్వల, ఉమ వస్తారు. అరుంధతి తల్లి రాజమ్మ, చెల్లెళ్ళు అపర్ణ, అనల, తండ్రి కృష్ణమూర్తి వారిని సాదరంగా ఆహ్వానిస్తారు. ప్రయాణం కబుర్లు, పెళ్ళి విశేషాలు, చదువులకు సంబంధించిన సరదా సంభాషణలు సాగుతాయి. రాజమ్మ మరో చెల్లెలు రత్నమ్మ, అక్కకు పెళ్ళి పనుల్లో సాయపడుతుంటుంది.

అరుంధతి నిర్లిప్తంగా ఉండటం చూసి "నీకీ పెళ్ళి ఇష్టం లేదా? వినయ్ నిన్నింత అన్యాయం చేస్తాడనుకోలేదే? అతడు నిన్ను పెళ్ళి చేసుకోననడానికి కారణం ఏమిటి?" అని అడుగుతుంది పిన్ని కూతురు ఉజ్వల. "ఏ కారణం చెప్పడు. ఇలాగే స్నేహితులుగా ఉందాం. నిన్ను పెళ్ళి చేసుకుంటే ఏదో ఒక విషయంలో నీతో పోట్లాడాల్సి వస్తుంది. రోగాలు, ఇరుకు గదులు, పిల్లలు, చాలని జీతం, ఆ నరకంలోకి నన్నెందుకు ఈడుస్తావు" అంటాడు అని చెబుతుంది అరుంధతి. మద్రాసు నుండి కృష్ణమూర్తి అక్క రాధమ్మ, ఆమె కొడుకు సందీప్, అతని స్నేహితుడు వచ్చారని కబురు తెస్తుంది అపర్ణ.

సందీప్ మంచి ఒడ్డూ, పొడవుతో అందంగా తయారవటం చూసి అపర్ణ అతని వైపు ఆకర్షితురాలవుతుంది. సరదాగా జోక్స్ వేస్తుంటుంది. సందీప్‌ను "బావా! బావా" అని పిలుస్తూ ప్రత్యేక శ్రద్ధ చూపుతుంటుంది. తనతో వచ్చిన స్నేహితుడు రవికాంత్ మంచి ఆర్టిస్టనీ, గాయకుడనీ పరిచయం చేస్తాడు సందీప్. రవికాంత్ ఉజ్వల బొమ్మగీసిస్తే అందరూ ముచ్చట పడతారు.

అంతలో కృష్ణమూర్తి చెల్లెలు విమలమ్మ, ఆమె కొడుకు సుధీర్ వస్తారు. ప్రయాణ విశేషాలు చెబుతారు. సుధీర్ సరదాగా కబుర్లు చెప్పి అందర్నీ నవ్విస్తాడు. అందరూ స్నానాలు, భోజనాలు ముగిస్తారు. "సుధీర్ బావ అమాయకుడు. సందీప్ బావకు గర్వం ఎక్కువే. తనంత అందమైన వాళ్ళు లేరనుకుంటాడు. అపర్ణక్కకు సందీప్ ఇష్టం. తను సుధీర్‌ను చేసుకుంటే బాగుంటుంది" అని అనల ఆలోచిస్తుంటుంది. సారిక రవికాంత్ పట్ల ఆకర్షితురాలవుతుంది. "అతడో గొప్ప ఆర్టిస్టు. పాడతాడట కూడా" అంటుంది.

వంటింట్లో రాజమ్మ, రత్నమ్మ కబుర్లు చెప్పుకుంటూ ఆడపడుచులిద్దరూ తిరిగి వెళ్లేలోగా అపర్ణను సందీప్‌కూ, అనలను సుధీర్‌కూ చేసుకోమని కృష్ణమూర్తి చేత అడిగించాలని నిర్ణయించుకుంటారు. పెళ్ళి సంబంధాలు, వరుల డిమాండ్లూ, కట్నకానుకల గురించి చర్చిస్తారు.

బావలూ, మరదళ్ళూ సరదాగా కబుర్లు చెప్పుకుంటారు. ఆ సరదా సంభాషణలే స్త్రీ పురుషుల సమానతల అంశాలకు దారి తీస్తాయి. సందీప్ మాట్లాడుతుండగా అనల, సారిక, సుధీర్, ఉమ వస్తారు. "మనకందరికీ ఫ్యూడల్ సంస్కృతి వంటబట్టింది. ఒక సమాజంలోని ఆర్థిక సంబంధాలే ఆ సమాజం నాగరికత, సంస్కృతులను నిర్ణయిస్తాయి. భర్త డబ్బు సంపాదిస్తాడు. కనుక అధికారాలు అతడికి సంక్రమించాయి. స్త్రీ తనలో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్సును డెవలప్ చేసుకుంది. దీనికి ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోవడమే కారణం.




## వీళ్లు పాడుకోవచ్చుగా...

కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో 'పాండవ వనవాసం' తీశారు. ఆ సినిమా పూర్తయ్యాక దాని వివరాలు అడుగుతూ ఎన్టీఆర్- సావిత్రికి పాట పెట్టారా? అని అడిగారు చక్రపాణి.

ఎన్టీఆర్ భీముడు, సావిత్రి ద్రౌపది వారికి డ్యూయెట్ ఏమిటి? అన్నారు కమలాకర.

'భీముడు, ద్రౌపది పాడకపోవచ్చు ఎన్టీఆర్ సావిత్రి పాడుకోవచ్చు కదా? 'అన్నారు చక్రపాణి.

అలా ఆయన పుణ్యమా అని జీవంపోసుకుంది 'హిమగిరి సొగసులు' గీతం.

స్త్రీ పురుషుల సంబంధాల్ని, మనస్తత్వాల్ని సమాజంలోని ఆర్థిక సంబంధాలను బట్టి అర్థం చేసుకోవాలి" అని సందీప్‌కు జవాబిస్తుంది ఉజ్వల. "ఫ్రాయిడ్ సిద్ధాంతాలన్నీ అవాస్తవికమే నంటారా? " అని నిలదీస్తాడు సందీప్. కమ్యూనిస్టులు, రష్యా, చైనా ప్రజలు, నమ్మకాలు, తుపాకీలు, కమ్యూనిస్టు వ్యతిరేకులు అంటూ చాలాసేపు ఉజ్వల, సందీప్‌లు చర్చిస్తారు.

రవికాంత్ అపర్ణ బొమ్మను అందంగా చిత్రించి ఇవ్వగా "కొంపదీసి అపర్ణను ప్రేమించేశావా? కవిత్వం వస్తోంది. అదే నిజమైతే పెళ్ళి జరిపించేస్తా" అని సందీప్ పరిహాసమాడగా అపర్ణ విలవిలలాడి పోతుంది.

భోజనాలు ముగిశాక ఎవరికి కేటాయించిన గదులలో వారు పడుకుంటారు. సందీప్ పడుకున్న గదిలోంచి రవికాంత్ సైగల్ పాటలను పాడుతుంటే పక్క గదుల్లో పడుకున్న ఉజ్వల, అరుంధతి, అపర్ణ, సారిక, ఉమ అందరూ తన్మయులై వింటారు.

అటు పెళ్ళికొడుకు కిశోర్‌కుమార్ అరుంధతి గురించే ఆలోచిస్తుంటాడు. అరుంధతిని తను పెళ్లాడడానికి, ఆమె తనకు నచ్చడానికి కారణం ఆమె అందమైందే గాక అమాయకంగా, అణకువగా, నిగర్విగా కన్పించటమే. ఒద్దికగా, వినయంగా ఉండే అమ్మాయిలు తనకిష్టం. నిర్లక్ష్యంగా, గర్వంగా ఉండే వాళ్ళంటే అసహ్యం. తను కాలేజీలో ఉండగా నివేదితను ఇష్టపడ్డాడు. ఎం.ఎస్సీ అయిపోగానే పెళ్ళి చేసుకుందామనుకున్నాడు. కానీ నివేదిత తన జీవితాన్ని ఫిజిక్స్‌కూ, రీసెర్చికే ధారపోస్తానంది. మేడమ్ క్యూరిలా, సి.వి. రామన్‌లా సైంటిస్ట్ నవుతానంది. అదే జీవితాశయమనేసరికి తను ఇక ఆమె గురించి కలలు కనటం మానేశాడు. చదువు ముగిశాక లెక్చరర్ ఉద్యోగం దొరికింది. పెళ్ళి చూపులలో తను అరుంధతితో ఒంటరిగా మాట్లాడాలనీ, తనంటే ఆమెకు ఇష్టమో కాదో కనుక్కోవాలనీ అనుకున్నాడు. కానీ పెద్దలు తనకా అవకాశమే ఇవ్వలేదు మరి!

మగ పెళ్ళి వారికి విడిదిలో ఘనంగా ఏర్పాట్లు చేయించాడు కృష్ణమూర్తి. అయినా ఫ్యాన్లు కావాలనీ, వేడి నీళ్ళు కావాలనీ, పిల్లలకు పాలు కావాలనీ ఏదో ఒకటి రాద్ధాంతం చేస్తూనే ఉన్నారు పెళ్ళి కొడుకు బంధువులు. ఎలాగో సర్దుకోమన్న కిశోర్‌ను "అప్పుడే అత్తవారింటి వారిని వెనకేసుకొస్తున్నాడు. ముందు ముందు వీడసలు మన మొహాలు చూస్తాడా? " అని నిష్ఠురాలాడ

తారు అతని తోబుట్టువులు.

పెళ్ళి ఘడియలు రానే వచ్చాయి. అరుంధతిని ముస్తాబు చేస్తారు. "అక్కయ్యా! నీకో గుడ్ న్యూస్. వినయ్ పెళ్ళికొచ్చాడు" అంటూ వచ్చింది అపర్ణ. అరుంధతి ఆలోచనల్లో పడటం చూసి "జరిగిందంతా మర్చిపో. జరగబోతున్న దానిని గురించి ఆలోచించు. నువ్వింకా చిన్న పిల్లవు కాదు" అని రత్నమ్మ హెచ్చరిస్తుంది.

కిశోర్, అరుంధతిల పెళ్ళి జరుగుతుంది. పెళ్ళి తరువాత భోజనాలకు వెళ్తున్న వారిలో సందీప్ లేకపోవడం చూసి అతని గదిలోకి వెళ్తుంది అపర్ణ. ఆ గదిలో అతడు ఆమెతో అతి చనువుగా ప్రవర్తించబోతాడు. పెళ్లయ్యాకా తన వంటిపై చెయ్యి వేయనిస్తానని వచ్చేస్తుంది అపర్ణ. 'కంట్రీ గర్ల్' అని తిట్టుకుంటాడు సందీప్. అపర్ణ నేరుగా అరుంధతి, కిశోర్‌ల దగ్గరికి వచ్చి సరదా సంభాషణలు ప్రారంభిస్తుంది. అంతలో అక్కడికి వినయ్ వచ్చి వధూవరులను అభినందిస్తాడు. "మిమ్మల్ని చూశాక, మీతో మాట్లాడాక నాకు చాలా హేపీగా ఉంది. మీరు మా అరుంధతిని సుఖపెడతారన్న నమ్మకం కలిగింది" అంటాడు. అతడు వెళ్ళిపోయాక అరుంధతి ఆలోచిస్తుంది. కిశోర్ నవ్వు తనకు హాయిగా అనిపిస్తుంది. ఆ నవ్వులో ఎంత మగతనం! వినయ్ అలా నవ్వగలడా? లేదు. కాని కిశోర్ ఎంత లౌలీమ్యాన్! అతనితో తన జీవితం సుఖవంతమవుతుంది" అని ఆలోచిస్తూ పెళ్లి కొడుకు పక్కన కూర్చుని చాలానాళ్ళ తరువాత కడుపునిండా భోజనం చేస్తుంది అరుంధతి.

కిశోర్ స్నేహితులు, అరుంధతి స్నేహితులు, పెళ్ళికొచ్చిన బంధుమిత్రులు, ఉజ్వల, సారిక, సందీప్, అపర్ణ, అనల, సుధీర్, ఉమ చుట్టూ కూర్చోగా రవికాంత్ పాట పాడటం మొదలుపెడతాడు. అందరూ ఆనందిస్తుంటారు. సారిక అష్టపదులు పాడుతుంది. అందరూ చప్పట్లు కొట్టి వాళ్లని అభినందిస్తుంటారు. ప్రోత్సహిస్తుంటారు.

అప్పగింతలవేళ తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళతో ముడిపడిన స్త్రీ జీవితం అంతమై భర్త, అత్తమామలు, ఆడపడుచులు, బావమరుదులు, తోడి కోడళ్ళతో ప్రారంభమయ్యే క్షణానికి నాంది పలికే సంధికాలం. పెళ్ళికూతురు తరఫున వాళ్ళు



పసిపిల్లల్లా రోదించటం చూసి కిశోర్ ఆశ్చర్యపడతాడు. వీళ్ళింతగా ఎందుకు ఏడవాలి? తనమీద నమ్మకం లేదా?

"ప్లీజ్! స్టాపిట్! నేను రాక్షసుణ్ణి కాదు. మీ అమ్మాయిని కష్టపెట్టను. మీ కంటే ప్రేమగా చూసుకుంటాను" అని అనాలనిపించింది. ఆ తరువాత మగపెళ్ళి వాళ్ళంతా బస్సుల్లో, జీపుల్లో బయల్దేరారు. ఇల్లంతా బోసిపోయింది.

"అక్కయ్య పెళ్ళైపోయింది. తన పెళ్ళి సందీప్ బావతో అయితే బాగుండును" అని అపర్ణ, కలలు సుధీర్ బావతో తన పెళ్ళి

పోతే బాగుండని అనల కలలు కంటుంటారు.

"రవికాంత్ తన ప్రేమను స్వీకరించి పెళ్ళాడితే బాగుండును. తన కలలు ఫలిస్తాయా? తామిద్దరి అభిరుచులొకటే" అని రవికాంత్‌కు మనసులో ప్రేమలేఖలు రాస్తూ నిద్రపోవడానికి ప్రయత్నిస్తుంది సారిక.

"ప్రేమించటమంటే ఏమిటి? ఈ ప్రేమించామనుకుంటున్న వాళ్ళలో నిజంగా ఎంత మంది ప్రేమించుకుంటారు? సందీప్, రవికాంత్ వెళ్ళిపోతారంటే మనసంతా ఏదో వెలితి అన్పిస్తోంది"... ఆలోచించసాగింది ఉజ్వల.

"అపర్ణ లాంటి సెంటిమెంటల్ క్రీచర్ని చేసుకుంటే ఇంకేం లేదు. తననో ప్రైవేట్ ప్రాపర్టీ అనుకుంటుంది. మరో ఆడదాని వైపు కన్నెత్తి చూడనివ్వదు. ఉజ్వలతో మాట్లాడితే జెలసీ ఫీలవుతుంది. తను జీవితాంతం ఈ న్యూసెన్స్‌నెలా భరించగలడు. కొంచెం కూడా ఆమెకు కల్చర్ లేద"ని ఆలోచిస్తుంటాడు సందీప్.

"ఉజ్వలా! ఐ లవ్ యూ! మీకభ్యంతరం లేకుంటే మనం పెళ్ళి చేసుకుందాం. మీరు నా పక్కనుంటే సంగీతంలో ఉన్నతోన్నత శిఖరాలధిరోహిస్తాను. నాలాంటి కళాకారుడికి మీలాంటి ప్రేమదేవత అండ కావాలి. మీరు కాదంటే నా జీవితం నిస్సారమైపోతుంది" అనుకుంటూ తెల్లవార్లూ ఆలోచనలతోనే గడిపాడు రవికాంత్

"అపర్ణ తనకు దక్కదు. సందీప్‌కే ఇస్తారు. అపర్ణ అందంతో తన కళ్ళు చెదిరిపోతున్నాయి. అనలతోనైనా తన పెళ్ళి త్వరగా జరిగితే బాగుండును. తనకు ఎవరితోనో ఒకరితో త్వరగా పెళ్ళి జరగాలి. తనను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్న అనలను పెళ్ళి చేసుకుంటేనే తను సుఖపడతాడు. అందని దాని కోసం అర్రులు చాచేకంటే అందిన దానితో తృప్తి పడటం మేలు" అని ఆలోచిస్తూ నిద్రకు ఉపక్రమించాడు సుధీర్.

మర్నాడు అందరూ ప్రయాణానికి సిద్ధమయ్యారు. భార్య కోరిక మేరకు అపర్ణను సందీప్‌కు చేసుకోమని కృష్ణమూర్తి రాధమ్మను అడగ్గా, "అపర్ణకు మరో సంబంధం చేయండి. డబ్బు కావాలంటే సాయం చేస్తాను. నేను విదేశాలకు వెళ్ళాలి. మా కంపెనీవాళ్ళు నన్ను ట్రెయినింగ్ కోసం జపాన్‌కు పంపిస్తున్నారు. మరో రెండేళ్ళ దాకా పెళ్ళి చేసుకోను. అపర్ణకు మరో సంబంధం చూడండి మామయ్యా" అని చెప్పి సందీప్ తల్లి రాధమ్మ, స్నేహితుడు రవికాంత్‌తో కలిసి వెళ్లిపోతాడు. అపర్ణ గుండెల్లో అగ్నిపర్వతం బద్దలై ఏడుస్తుంది.

"పోనీ! సుధీర్‌కు అపర్ణను చేసుకుంటారేమో మీ చెల్లి విమలమ్మ నడగండి" అంటుంది రాజమ్మ. కృష్ణమూర్తి విమలమ్మతో ఆ మాటే అడుగుతాడు. "సందీప్‌కు అపర్ణను, సుధీర్‌కు అనలను ఇచ్చి చేయాలనుకున్నాం. సందీప్ చేసుకోననేశాడు గనుక అపర్ణను సుధీర్‌కిచ్చి చేయాలని నిర్ణయించుకున్నాం. అనల పెళ్ళి మూడు నాలుగేళ్ళ తరువాత కూడా చేయవచ్చు" అంటాడు కృష్ణమూర్తి.

"అలాగే కానియ్ అన్నయ్యా! మాకు అపర్ణయినా, అనలైనా ఒక్కటే! ఇద్దరూ మా అన్నయ్య బిడ్డలేగా" అంటుంది విమలమ్మ. సుధీర్ సంతోషంగా పెళ్ళికి అంగీకరిస్తాడు. తననింత అకస్మాత్తుగా అదృష్టం వరించేసరికి గంతులెయ్యాలన్నంత ఆనందం కలిగిందతనికి. అనల గుండెల్లో చితి రగిలింది దానినెవరూ గమనించలేదు.

"ఓ వారం తరువాత కబురు పెడతాను. నువ్వు, సుధీర్ రండి. ముహూర్తాలు పెట్టుకుందాం" అని వీడ్కోలు పలుకుతాడు కృష్ణమూర్తి.

ఇతర బంధువులంతా తమ తమ గమ్యస్థానాలకు బయల్దేరటంతో నవల ముగుస్తుంది. ✦




## జీవిత సాగరాన్ని మథించి..

(మొదటి బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)

ఆనాడు సురాసురులు క్షీరసాగరాన్ని మథించి సాధించిన వాటిని ఒక్కొక్క దానిని అందరూ పంచుకున్నారు. ఈనాడు లక్ష్మీ పద్మసుందరిగారు జీవిత సాగరాన్నే మథించి, ఆ మథనంలో ఆవిర్భవించిన, అంశాలను, తీరు తెన్నులను, కేవలం పాఠకులే కాక, సమాజంలో ప్రతి ఒక్కరూ పంచుకోవల్సినట్లు చేశారు.

మిత్రత్రయం యాధృచ్ఛికంగా మనస్తత్వశాస్త్ర సెమినార్‌కి వెళ్తారు. ఆ సైకాలజిస్టును వాళ్లు కలుసుకుని, వాళ్ల బాధలను, భావనలను వెళ్లబోసుకునేంత వరకు అవి వాళ్లకే తెలీదు. ఆ సమస్యలను అధిగమించటానికి పూనుకుని, విచిత్రంగా వాళ్ల భాగస్వాములను వాళ్లు ఎన్నుకుంటారు. ఈ ఎన్నుకొన్న విధానం కూడా చాలా 'డ్రమెటిక్'గా చిత్రించారు. హృదయ సరదాకి అలాంటి వ్యక్తి ఎవరూ ఉండరనుకున్న పెళ్లి ప్రకటనతో ఆనంద్ అవతరించడం అసలు సిసలయిన వండర్! తర్వాత విచిత్రం మనస్వికి అనుకున్న శశికాంత్‌ని సుమన తన కోసం కుదుర్చుకోవడం. ఈ ప్రక్రియలను నడిపే విధానం రచయిత్రి వైచిత్రికి పరాకాష్ట. ఆ తర్వాత సస్పెన్సుల కన్నా సస్పెన్సు ఈ ముగ్గురూ విడాకులు కోరడం! మనోవిశ్లేషణను ఆసరా చేసుకున్నా ఫలితం మట్టుకు ఎవరి చేతిలో లేదన్న చేదునిజాన్ని దీని ద్వారా తెలియజేశారు.

మొత్తనికి నవలలో వస్తువు, కథనం, శైలి, చాలా బాగుంది. ముఖ్వురు ముదితల మనస్సును మథించి పాఠకులకు చాలా అనుభవాలను పంచిపెట్టారు రచయిత్రి. ఆసాంతం నవలను ఉత్కంఠభరితంగా సాగించారు. తక్కువ పాత్రలతో, ఎక్కువ గజిబిజి లేకుండా పూర్తిగా సమస్యలు, వాటి పరిష్కరణలతో సాగే నవల వదలకుండా చదివిస్తుంది. చాలా రోజుల తర్వాత ఓ మంచి వస్తువుతో మంచి నవలను అందించిన రచయిత్రి అభినందనీయురాలు.

–వి. లలితాంబ, పర్లాకెమండి.

## గ్రామీణ యువతకు సైతం...

(రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

ఒకప్పుడు ఉమ్మడి కుటుంబాలుండేవి గాబట్టి పెద్దవాళ్లే పిల్లలకు కౌన్సిలింగ్ ఇస్తూ వాళ్ల జీవితాలకు దిక్సూచిలా వ్యవహరించేవారు. అందుకే ఆ రోజుల్లోని ఆడపిల్లలు స్వంత నిర్ణయాలు తీసుకోడానికి సాహసించేవారు కాదు. అదీకాక అన్నీ పెద్దవాళ్లే చూసుకుంటారులే అన్న భరోసా వుండేది. ఒకళ్లు మందలిస్తే మరొకళ్లు చేరదీయటం నీకు అండగా మేమున్నామంటూ ధైర్యం చెప్పేవారు. లాలనతో బుజ్జగించి ప్రేమగా చూసుకునేవారు.

కాని ఇప్పుడు పిల్లల్ని పట్టించుకునే సమయం లేక కొందరు, కూలిపోతున్న కాపురాల్ని నిలబెట్టే పెద్దల అండకు దూరమై, చివరికి విడిపోయి పిల్లల్ని ఎక్కడో హాస్టల్లో దిక్కులేని వాళ్లలా వదిలేసి వాళ్ల మనసులతో ఆడుకోవడం ఈ రోజుల్లో సహజమైపోయింది. మరి

కొందరు అతి ప్రేమకు పోయి పిల్లలపై ఆంక్షలు విధించి పిరికివాళ్లుగా తయారుచేస్తున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో సైకాలజిస్టుల అవసరం ఎంతైనా ఉంది.

సైకాలజీ అధ్యయనం చేసిన సుధామూర్తి ద్వారా పాఠకులకు అవగాహన లేని విషయాలెన్నింటినో కళ్లకు కట్టినట్టు విశదపరిచారు రచయిత్రి. కాని ఇలాంటి సైకాలజిస్టులు కేవలం పట్టణాలకే పరిమితమవటం దురదృష్టం. ప్రభుత్వ ఆస్పత్రుల్లో కూడా సైకాలజిస్టులను ఏర్పాటు చెయ్యాలి. గ్రామీణ యువతకు సైతం అందుబాటులో వుండే విధంగా నిర్ణయాలు తీసుకుంటే చాలావరకు యువతను పెడదారినపడి చెడిపోకుండా కాపాడవచ్చు. ముగింపులో అయ్యో... మళ్ళీ ఇదేంటి అనిపించిందిగాని పరిష్కారమార్గం చూపటానికి సుధామూర్తి ఎలాగూ వున్నారుకదా అని నిశ్చింతగా ఫీలయ్యాం. ఎక్కడో ఒకటి రెండుచోట్ల వున్న అసహజ ధోరణులు మినహాయించి కథ ఆసాంతం ఆసక్తిగా నడిపించి సంతృప్తి కలిగించారు.

**–విజయలక్ష్మి, మిర్యాలగూడ.**

## థాంక్సెలాట్

(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

నేటి యువతరంలో ముఖ్యంగా ఎదిగిన ఆడపిల్లల పరిస్థితి ఎటూ తేల్చుకోలేని విధంగా తయారయ్యింది. ఓ పక్క తల్లిదండ్రుల ఆంక్షలు, మరో పక్క పోకిరి అల్లర్లు, చదువుకోవాలనే ఆకాంక్ష, జీవితాన్ని చదువలేని అశక్తత, చదువులు ముగిశాక పెళ్ళి పేరిట అబ్బాయిల నిర్ణయాలు, కాకుంటే ప్రేమ వ్యవహారాల దాగుడు మూతలు, పెళ్లి తర్వాత ఇంకెన్నో సమస్యలు. సమాజపు విషపు చూపులకు కేంద్ర బిందువు ఆడదయితే వారి గత, వర్తమాన, భవిష్యత్ కాలాలు ఒకే కోణాల్లో పయనిస్తాయనే నగ్న సత్యానికి అక్షర రూపం 'జీవన మథనం' చతుర నవల. ముగ్గురు స్నేహితురాళ్ళు మూడు కోణాల్లో పయనిస్తూ తల్లిదండ్రుల విషయంలో జాగ్రత్తలు పాటిస్తూ తమ తమ వరుళ్లను వెతుక్కోవడం, కౌన్సిలింగ్ పేరుతో సైకాలజిస్ట్ సుధగారి సలహాలు వారి జీవన యానానికి ఊపిరినందించాయి. ముఖ్యంగా సహృదయ విషాదగాథ హృదయాన్ని కలచివేసింది. పెళ్లిళ్ళయిన ఆరు నెలలకి ముగ్గురి కాపురాలు తిరగబడడం ఫన్నీగా ఉంది. ముగింపు వాక్యాలు 'జీవనం నిరంతర ప్రయాణం. ఆటుపోటు ప్రవాహంతో సాగించే నిరంతర కడలి పయనం...' ఆ పది లైన్లు నవలకే కాదు మనిషి జీవనానికి అక్షర సాక్ష్యాలుగా నిలిచిపోయాయి. కథలోని ప్రతి పాత్ర మానవత్వానికి ప్రతీకలై విలనిజానికి దూరంగా మెలిగాయి. నవల ఆసాంతం చక్కని శైలిలో మలచిన తీరు పఠనానికి ఆటంకం కలుగకుండా ప్రతి పాఠకుడిని ఆకట్టుకునే విధంగా అద్భుతంగా రాశారనడంలో సందేహం లేదు.

**– అవుసలి ఆంజనేయులు, మూసాపేట**

## చక్కని విశ్లేషణ

(నాలుగవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)

జీవన మథనం నవల చాలా బాగుంది. ఒకే గూటి పక్షుల్లా హాస్టల్లో కల్సిన ముగ్గురు యువతుల మానసిక వ్యథ నవలంతా పరచుకొంది. స్నేహానికి ప్రతిరూపాలు ఈ ముగ్గురమ్మాయిలు. సహృదయతో పోల్చుకుంటే మిగిలిన ఇద్దరు బాధ సాధారణంగా మధ్య తరగతి కుటుంబాల్లో అతి సహజంగా ఎదురయ్యే చిన్నపాటి సమస్యే! తండ్రి ఎలా ఉంటాడో తెలియక, అతని పేరైనా ఎరుగక తల్లని తెలిసే ఆమెకు దూరంగా హాస్టల్లో నిజంగా నరకాన్నే అనుభవించిన సహృదయ పాఠకుల మనసుకు దగ్గరగా వచ్చి వారి అభిమానాన్ని చూరగొంది అంటే అది

అబద్ధం కాదు. మనస్తత్వశాస్త్రం కౌన్సిలింగ్‌ల నేపథ్యంలో నవల రాయాలనుకున్నారేమో రచయిత్రి. కానీ మామూలు నవల మాదిరే నడిచింది చివరి వరకూ! మానసిక వైద్య నిపుణురాలైన డాక్టర్ సుధ చేసింది నిజానికి ఏమీ లేదు. ఆవిడ చెప్పుకున్నట్టుగానే అనుకోకుండానో, ఉద్దేశ పూర్వకంగానో జన్యుశాస్త్రాన్ని సమర్థిస్తూ ముగిసింది నవల.

స్నేహితురాండ్రు ముగ్గురి మనసుల్ని వాళ్ళ కుటుంబ నేపథ్యాలను చక్కని విశ్లేషణతో కథని నడిపించడంలో రచయిత్రి సమర్థత నిరూపించుకున్నారు. భార్యాభర్తల మధ్య కలహాలు... వారి ప్రవర్తన మానసిక పరివర్తన చెందే పసిబిడ్డలపై ఎంతగా పడుతుందో, వాళ్లనెంతగా కలవర పరుస్తుందో, తల్లిదండ్రుల బాధ్యతారాహిత్యం పిల్లలనెంతగా మానసిక క్షోభకు గురిచేస్తుందో చక్కగా విశ్లేషించారు. అర్థం చేసుకోగలిగితే ఒక మానసిక వైద్యుడు 'తొలిదశలో వున్న మానసిక రోగికి' ఎంత చేయగలడో అంత కన్న ఎక్కువగానే ఈ నవల అందించగలిగింది. ఉమ్మడి కుటుంబ వ్యవస్థ వెనుకబడి సమిష్టి కుటుంబాలేర్పడడం. క్షణం తీరిక లేని జీవిత వాతావరణంలో మానసిక వైద్య నిపుణుల ఆవశ్యకత ఒకింత ఎక్కువగానే ఏర్పడింది. వారి సలహా సంప్రదింపులతో జీవితాలను చక్కబరచుకోవచ్చునన్న సందేశం రచయిత్రి ఇస్తున్నారు! 'జీవన మథనం' మంచి నవల.

– సువర్చలా జ్యోతి, తణుకు.

---

## అనుమానించాలి

(ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

వక్కలంక లక్ష్మీపద్మ సుందరిగారి రచన 'జీవన మథనం' ఆకట్టుకుంది. మూడు విభిన్న కుటుంబ నేపథ్యాల మధ్యన అందంగా అల్లబడిన కథ ఇది. నేటి మధ్యతరగతి కుటుంబాలలో నిత్యం జరుగుతున్న సంఘర్షణలు కళ్ళకు కట్టినట్లు ఈ కథలో కనిపిస్తాయి. ఆచార సాంప్రదాయాల నడుమ తల్లిదండ్రులు పెట్టే ఆంక్షలు, కట్టుబాట్లు ఎంతగా హాని చేస్తాయో, స్వేచ్ఛా స్వాతంత్ర్యాల పేరిట వారు పిల్లల ఎడల చూపే గారాబం, వాత్సల్యం కూడా అంతగా హాని చేస్తాయని సున్నితంగా విడమర్చి చూపారు. కథా గమనం బాగుంది. సంభాషణలు సరళంగా ఉండి ఆకట్టుకున్నాయి. తల్లిదండ్రులు పెంచిన తీరు ఆధారంగా ముగ్గురు స్నేహితురాళ్ళ మనస్తత్వం వ్యక్తమయింది. సహజంగానే వారి వ్యక్తిత్వాలకు సరిపోయే జీవిత భాగస్వాములను వారు ఎంపిక చేసుకున్నారు. అవసరమైన మేరకు పాత్రలను పరిమితం చేసిన తీరు ప్రశంసనీయం. సైకాలజిస్టు సుధతో సంభాషించిన అనంతరం స్నేహితురాళ్ళ శైలిలో మార్పు వచ్చినప్పటికీ, వివాహమైన ఆరు నెలలకే యాధృచ్ఛికంగా, వారి వారి భర్తలకు విడాకులివ్వాలనుకోవడం అసంబద్ధం. అటు తల్లిదండ్రుల తీరు నచ్చలేదని చెప్పి, ఇటు భర్తలతోనూ సంసారం చేయలేమని చెప్పడంతో అసలు ముందు వారి వ్యక్తిత్వాలనే అనుమానించవలసి వస్తోంది. ముగింపుపై తగిన శ్రద్ధ వహించి ఉండవలసినది.

– సి. హెచ్.వి.ఎస్.ప్రసాద్, రాజమండ్రి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 2 57 50 528, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 2 5 518181, 2 5 598787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 275757; Anantapur: 27 5444; Karimnagar: 22 5216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2 5 587 54; Srikakulam: 220901; Kurnool: 25281 5; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276 576; Ongole: 256777; New Delhi: 2 575 5440; Mumbai: 22819557; Chennai: 282 52 590; Bangalore: 2558 5804.

# 'కోర'మీనం



నవ్వలేదని తెలిసి కూడ స్మైల్ ప్లీజ్ అని ఫొటోగ్రాఫర్
అన్నందుకేనా నిప్పులు చెరిగే అంతటి కోపం...

